ప్రథమ ముద్రణ 1992 (శక 1914)



M.N, ROY (Telugu)

రూ. 9-00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్క్,
న్యూ ఢిల్లీ-110016 ద్వారా ప్రచురింపబడినది.

ముద్రణ : దక్షిణ భారత ప్రెస్, ఖైరతాబాద్, హైదరాబాదు-500 004.

# విషయసూచిక

# పరిచయం

ఎం. ఎన్. రాయ్ విశిష్ట వ్యక్తిత్వం గలవాడు. ఈ శతాబ్దారంభంలో మొదటి రెండు దశాబ్దాలలో దేశంలో జరిగిన సాయుధ పోరాటాలలో చురుకుగా పాల్గొన్న ఖ్యాతి అతనికి దక్కింది. ఆ తరువాత మెక్సికో, చైనాలోని విప్లవ పోరాటాలలో కూడా బాగా పాల్గొనగల అవకాశం లభించింది. విశ్వ విఖ్యాతి గాంచిన లెనిన్, ట్రాట్స్కీ, స్టాలిన్ వంటి విప్లవ మూర్తులతో పనిచేయగల అరుదైన అదృష్టం కూడా అతనికి వున్నది. జాతీయ రంగంలో అతని సమకాలీనుల కెవరికీ యిటువంటి దిగ్భ్రమ గొలిపే చరిత్ర లేదు. మహాత్మాగాంధీని మినహాయిస్తే మిగిలిన వారందరూ భారతదేశంలోనే కృషిచేశారు. నెహ్రూను మినహాయిస్తే మిగిలినవారికి అంతర్జాతీయ సంబంధాలు లేవు. ఇతర దేశాలలోని విప్లవోద్యమాల విషయమై రాయ్‌కుగల అనుభవం నెహ్రూకు సైతంలేదు.

అయినప్పటికీ 1936 డిసెంబరు నుంచి రాయ్ దేశంలోని జాతీయోద్యమంలో బాహాటంగా కృషిచేస్తుండగా, అతనికి అర్హమైన గుర్తింపు, విజయం లభించలేదు., సరిగదా తన వ్యక్తిత్వ శాశ్వతముద్రను జాతీయోద్యమంలో ప్రధానాంగమైన భారతజాతీయ కాంగ్రెసును నాలుగేళ్ళలోనే వదిలి, ప్రజలలో అధికసంఖ్యాకుల కోర్కెలు ఆశయాలు తీర్చడానికి, పోరాడడానికి, రాయ్ కొత్తసంస్థను నిర్మించనారంభించాడు. ద్వితీయ ప్రపంచయుద్ధం మొదలు కాగానే యీ పరిణామం జరిగింది. అప్పుడు యుద్ధానికి నిర్నిబంధంగానూ, ధైర్యంగానూ రాయ్ అండగా నిలబడగలిగాడు. తటపటాయించిన కాంగ్రెసు తుదకు, క్విట్ఇండియా వుద్యమం పేరిట యుద్ధాన్ని నిరోధిస్తూ పోయింది. ప్రజలలోగల బ్రిటిష్ వ్యతిరేక ధోరణిని వ్యక్తం చేసిన కాంగ్రెస్ విధానం

బహుళ ప్రచారం పొందినది. రాయ్‌కు స్పష్టమైన అవగాహన వున్నది. **హిట్లర్** విజయం, అతనితో పొత్తు పెట్టుకున్నవారి గెలుపు వలన ప్రపంచ వ్యాప్తంగా ప్రజలు, బానిసలయ్యే అవకాశం వున్నది. గ్రేట్ బ్రిటన్, ఇతర ఫాసిస్ట్ వ్యతిరేక శక్తులు నెగ్గితే సామ్రాజ్యాలు విచ్ఛిన్నమై, భారతదేశం విమోచనకు, వలస రాజ్యాల స్వేచ్ఛకూ దారితీస్తుందని రాయ్ తెలుసుకున్నాడు. అతని ప్రవచనం నిజమైంది. కాని గౌరవం దక్కని ప్రవక్తగానే మిగిలిపోయాడు.

కాంగ్రెస్‌తో రాయ్ విభేదించడం, ముఖ్యంగా గాంధేయ నాయకత్వంతో **తేడా అనేవి** రెండవ ప్రపంచయుద్ధం మొదలు కాగానే తలెత్త లేదు. ఇవి చాలా కాలం నుంచీ వస్తున్నవి. దేశంలో కమ్యూనిస్టు పార్టీని పెంపొందించాలని రాయ్ తీవ్రకృషి చేయడం, 1920లో సహకార నిరాకరణోద్యమంతో యీ విభేదాలు మొదలయ్యాయి. ప్రజలను సమీకరించడంలో గాంధీ శక్తిపట్ల రాయ్‌కి చాలా గౌరవం ఉన్నది. కానీ గాంధేయ కార్యక్రమం పరోక్షం, హాని లేనిది, సామాజిక దృక్పథంలో తిరోగమనం అని రాయ్ ఉద్దేశ్యం. అటువంటి కార్యక్రమం, దృక్పథంలో, గాంధేయ నాయకత్వం జాతీయ విప్లవం వైపుకు ప్రజలను తీసుకెళ్లలేదని రాయ్ నమ్మాడు. రాజకీయ స్వాతంత్ర్యం, సాంఘిక ఆర్థిక విమోచన అనేవి జాతీయ విప్లవంలోనే యిమిడి వున్నాయి కూడా. కనుక, విదేశాలలో వున్నప్పుడు, 1936లో జైలు నుంచి విడుదలైన తరువాత కాంగ్రెసులో చేరినప్పుడు కూడా ప్రస్తుత నాయకత్వాన్ని తొలగించాలని, దానిస్థానే సమగ్ర రాజకీయ, సాంఘిక ఆర్థిక, తాత్విక విప్లవం కోసం స్పష్టమైన కార్యక్రమాన్ని ఇవ్వగల కొత్త నాయకత్వం రావాలని రాయ్ కృషి చేశాడు. గాంధీకి వ్యతిరేకంగా రాయ్ నిలిచాడు. ఆ విధంగా విఫలుడయ్యాడు రాయ్‌కు విపరీతమైన మేధాశక్తి వున్నది. నిర్మాణ వ్యవస్థ పట్ల నేర్పు వున్నది. బాధలకు త్యాగాలకు సంసిద్ధత వున్నది. అయినా నిలబడ లేకపోయాడు.

గాంధీని ఒక వ్యక్తిగా రాయ్ వ్యతిరేకించలేదు. ప్రజల అసక్తికి వ్యతిరేకంగా కల్పించిన జీవన విధానం ఆలోచనాశీలిని గాంధీ కోరుతున్నాడని

రాయ్ వ్యతిరేకించాడు. రాయ్ పంథా ఆధునికం, వివేచనాత్మకం, విజ్ఞానయుతం. మధ్య శతాబ్దాల ఆధ్యాత్మిక దృష్టిని కావాలనే వ్యక్తిగా, ఆధునిక నాగరికతకు వ్యతిరేకిగా, స్వార్థపరుల ఆసక్తులను కాపాడే గాంధీని చూశాడు రాయ్. ప్రజా బాహుళ్యంలో వున్న ఈర్ష్య అసూయలకు, హానికరమైన సాంఘిక ఆచారాలకు వ్యతిరేకంగా రాయ్ ధ్వజమెత్తాడు. రాజకీయ సాంఘిక వ్యవహారాలలో మత జోక్యాన్ని వ్యతిరేకించాడు తాత్విక విప్లవం కావాలన్నాడు. ప్రజల ఆలోచనా సరళి మారాలని, నిశితదృష్టి, స్వయం శక్తిపై ఆధారపడడం కావాలని అభిల షించాడు. వీరారాధనను నిరసించాడు. గాంధీ అనుచరులకి యివన్నీ నచ్చ నందున, రాయ్‌కు ప్రచారం లభించ లేదు. రాజకీయ నాయకుడుగా రాయ్ విజయావకాశాలు బాగా పరిమితమయ్యాయి. ఉత్తరోత్తరా నవ్యమానవ వాదిగా రాయ్ పరిణమించిన అనంతరం, గాంధీ ఆలోచనకూ రాయ్ చింతనకూ కొన్ని పోలికలు కనిపించాయి కాని అప్పటికే రాయ్ దైనందిన రాజకీయాలనుంచి విర మించగా, గాంధీ అస్తమించాడు.

ఉగ్ర జాతీయవాదిగా, బాంబులు, పిస్తోళ్ల ఆసరాగా సాయుధ తిరుగుబాటు ఆవశ్యకత వున్నదంటూ, రాయ్ తన రాజకీయ జీవితాన్ని ఆరంభించాడు. ఈ మార్గం వృథా అని, గ్రహించి, సోషలిస్టుగానూ (సమాజవాది) తరువాత కమ్యూ నిస్టు (సామ్యవాది)గానూ మారాడు. కమ్యూనిస్టు ఉద్యమంలో అత్యున్నత స్థానా నికి చేరుకున్నాడు. అందులో కావలసినంత అధికారం, ప్రతిష్ట వున్నందున, వాటిని అంటిపెట్టుకోవడానికి ఎవరైనా తాపత్రయపడే అవకాశం వున్నది. కానీ, ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిస్టు ఉద్యమానికి మార్గదర్శిగా వున్న కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తప్పుదారిన పడేసరికి, రాయ్ సహించలేదు. ఇంటర్నేషనల్‌పు దాని నాయకుడు స్టాలిన్‌కు వ్యతిరేకంగా రాయ్ నిలిచాడు. వెంటనే రాయ్‌ను వ్యవస్థనుంచి తొలగించి, రాజకీయంగా అతన్ని అంతమొందించటానికి అన్ని ప్రచారసాధనాలు ప్రయోగించారు. ద్రోహి, ప్రతి విప్లవకారుడు, సామ్రాజ్యవాద

త్తొత్తు అంటూ ఎన్నో దూషణలు ప్రయోగించారు. చనిపోయేవరకూ ఆ విష ప్రచారం అతన్ని వెన్నాడింది.

15 సంవత్సరాల అనంతరం రాయ్ భారతదేశానికి 1930లో తిరిగి వచ్చాడు. కొందరు దీక్షాపరులైన సహకార్యకర్తలు మినహా రాయ్ ఏకాకిగా వున్నాడు. వ్యతిరేకంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదం వున్నది. జాతీయోద్యమంలోకి భాగంగా కమ్యూనిస్టు ఉద్యమంలో కృషిచేసిన ఫలితంగా రాయ్‌కి అచిరకాలం లోనే జైలు సంప్రాప్తమయింది. స్వేచ్ఛ పొందగానే జాతీయోద్యమంలోకి ప్రవేశించాడు. కానీ అతని మార్గం సుగమంగా లేదు. అతివాదులు మితవాదు లిరువురూ వ్యతిరేకంగా వున్నారు. అంతలో రెండవ ప్రపంచ యుద్ధం వచ్చి, జాతీయ అంతర్జాతీయ రాజకీయాలలోనూ, ప్రపంచ ఆలోచనా రంగంలోనూ అనూహ్య మార్పులు వచ్చాయి.

యుద్ధసమయంలోనూ తరువాత కూడా జరిగిన పరిణామాలన్నీ కమ్యూ నిజం, మార్క్సిజంలోని అసంబద్ధతలను రాయ్‌కు కొగాస్పష్టంచేశాయి. వాటిని అతను అధిగమించాలనుకున్నాడు. నవ్యమానవ వాది అయ్యాడు. జాతీయవాదం నుంచి కమ్యూనిజానికి అందులోనుంచి నవ్యమానవ వాదానికి పయనం సాగిం చాడు. అదొక స్వేచ్ఛాన్వేషణ యాత్ర. విద్యార్థిగా వుండగానే రాయ్‌కు యీ పంథా నచ్చింది. అప్పుడే విప్లవోద్యమంలోకి ఆకర్షితుడయ్యాడు. ఈ అన్వేషణే అతనిని చైనాకు, జపాన్‌కు, అమెరికా, మెక్సికో, రష్యా తదితర యిరోపా దేశా లకు, మళ్ళీ చైనాకు పిమ్మట భారతదేశానికి తీసుకెళ్ళింది. ఈ ప్రయాణంలో అనేక ప్రముఖ వ్యక్తులను కలుసుకున్నాడు. అనేక ఆలోచనా స్రవంతులను అధ్యయనం చేశాడు. ఆధునిక విజ్ఞానంలో భౌతిక రసాయనిక శాస్త్రాలు, సామా జిక, మానసిక విజ్ఞానం పరిశీలించాడు. ఇవన్నీ ఆకళింపు చేసుకొని, తుదకు స్వంతతత్వం రూపొందించాడు. అదే నవ్యమానవ తత్వం.

రాజకీయంగా చురుకుగా పనిచేసే వ్యక్తి పండితుడుగా, ఆలోచనా పరుడుగా వుండడం అరుదు. రాయ్ వ్రాసిన గ్రంథాలే యిందుకు సాక్ష్యాధారాలు. అనేక విషయాలు యీ పుస్తకాలలో పరిశీలించాడు. రాజకీయాల నుంచి ఆర్థిక శాస్త్రం, తత్వం నుంచి ప్రకృతి విజ్ఞానంవరకూ యీ గ్రంథాలు ప్రస్తావించాయి.

ఇటువంటి విశిష్ట వ్యక్తి జీవిత చరిత్ర ఆకర్షణీయంగా వుండకతప్పదు. ఆ విషయాలను యికముందు పుటలలో వెలుగులోకి తీసుకురావడానికి ప్రయత్నం జరిగింది.

# ఉగ్ర జాతీయ వాది

మానవేంద్రనాథ్, లేక ఎం. ఎన్. రాయ్ జీవిత చిత్రణ యిక్కడ వివరిస్తున్నప్పటికీ అతని అసలుపేరు అదికాదు. జీవితంలో ఒక అధ్యాయం ముగించి, మరొకటి ప్రారంభించినప్పటి పేరే యిది. నరేంద్రనాథ్ భట్టాచార్య మొదటిపేరు. జాతీయ వాదంతో తీవ్రస్థాయికి పోయిన దశలో, జీవిత ప్రథమ దశలో యీ పేరుతోనే అతను సుపరిచితుడు.

నరేంద్రనాథ్, నరేన్, నొరెన్ అని ఆ రోజులలో పిలుస్తుండే యీ వ్యక్తి, కలకత్తాకు ఏమంత దూరంగాని, 24 పరగణాల జిల్లా అర్బేలియా గ్రామంలో 1887లో పుట్టాడు. పురోహితుల కుటుంబంలో జన్మించాడు. బెంగాల్ రాష్ట్రంలోని మిద్నపూర్ జిల్లా క్షేపుట్ గ్రామదేవత క్షేపుదేశ్వరి గుడిలో యితని తండ్రి దీనబంధు భట్టాచార్య ప్రధాన పురోహితుడుగా వుంటుండేవాడు. అతనా గ్రామాన్ని వదిలి, అర్బేలియాకువెళ్ళి సంస్కృత పాఠాలు చెబుతుండేవాడు. మొదటిభార్య మరణానంతరం రెండవ పెళ్ళిచేసుకోగా, నరేంద్రనాథ్ ఆమెకు రెండవబిడ్డగా జన్మించాడు. మొత్తం తండ్రి సంతానంలో నాలుగవ వాడన్నమాట. తరువాత కలకత్తాకు 12 మైళ్ళదూరానగల చింగ్రిపోత అనే గ్రామానికి ప్రవాసం వెళ్ళాడు. అక్కడే కొంత ఆస్తిపాస్తులు సమకూర్చుకొని 1905మే లో చనిపోయే వరకూ జీవితం గడిపాడు.

---

1. ఈ అధ్యాయంలోని విషయం ప్రధానంగా సుమరేన్‌రాయ్ వ్రాసిన ది రెస్ట్‌లెస్ బ్రాహ్మిన్ అనే గ్రంథంపై ఆధారపడినదే. ప్రచురణ 1970లో ఎల్లైడ్, బొంబే.

నరేంద్రనాథ్ పెరగడం, చదవడం, చింగ్రిపోతలోనేకాగా, అతని ఉగ్ర జాతీయవాద చర్యలకు అది రంగస్థలమైంది పాఠశాలగురించి అందులో యితని ప్రగతి విషయం అట్టే తెలియదు. కలకత్తా జాతీయ కళాశాల ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణుడై విద్యార్థిగా చేరాడు. అంతటితో సంస్థాగత విద్యకు స్వస్తిపలికాడు.

నరేంద్రనాథ్ గ్రామం చింగ్రిపోత ప్రక్కన కొడాలియ, హర్నివి, రాజ్ పూర్ గ్రామాలున్నాయి. ఆధునిక బెంగాల్ రాజకీయాభివృద్ధికి, సామాజిక ప్రగతికి యీ గ్రామ సముచ్చయం అతి ప్రధాన పాత్ర నిర్వహించాయి. సుమరేన్‌రాయ్ యిలా పేర్కొన్నాడు, 19వ శతాబ్దపు బెంగాలు సాంఘిక సంస్కర్తలు, మత ప్రచారకులెందరో యిక్కడ పుట్టారు. అరవిందో, బరిన్‌ల తాత రాజ్‌నారాయణ్‌బోస్, పండిత శివనాథశాస్త్రి సహచరుడు, సోంప్రకాశ పత్రిక సంపాదకుడు ద్వారకానాథ్ విద్యాభూషణ్ 19వ శతాబ్దిలో గొప్పపండితుడుగా పేరొందిన శివనాథ శాస్త్రి బ్రహ్మసమాజంలో చేరడానికి యజ్ఞోపవీతాన్ని తెంచి పారవేసినవాడు, యిత్యాదులంతా యిక్కడే పుట్టారు: ఇతను నరేన్‌తల్లికి మామ కూడా. ఆ కుటుంబసభ్యులపై యితని ప్రభావం బాగావున్నది. 19వ శతాబ్దపు రోజులలో రహస్య విప్లవ సమాజస్థాపనకు తొలిప్రయత్నం చేసిన వారు శివనాథశాస్త్రి, రాజ్‌నారాయణ్‌బోసు, నవగోపాల్ మిత్ర. జాతీయ మేళాకు ప్రోత్సాహకారులు కూడా. (ది రిస్ట్ లెస్ బ్రాహ్మిన్ చూడండి.) ఇక్కడే హరికుమార్ చక్రవర్తితో నరేంద్రనాథ్‌కు సంబంధం ఏర్పడింది. రాజకీయ, సాంఘిక కార్యకలాపాలలో జీవిత పర్యంతం సన్నిహిత మిత్రుడుగా అతనున్నాడు.

బాల్యదశలో తండ్రి, పెద్దన్న, తదితరులనుంచి నరేంద్రనాథ్ సంస్కృతం నేర్చుకుని వుండాలి. 'తత్వం' తర్కంపై సంస్కృత గ్రంథాలు చదివి వుండాలి కూడా. ఉత్తరోత్తరా వాటి నుంచి ఉదహరిస్తుండేవాడు. బెంగాలులో మధ్య యుగాలకు చెందిన సుప్రసిద్ధ తార్కికుడు రఘునందన్ వంశానికి చెందిన వాళ్ళమని రాయ్ అంటుండేవాడు.

నరేంద్రనాథ్ పెరుగుతున్న కాలంలో బెంగాలు తీవ్రమార్పులు చెందు తున్నది. 1905లో బెంగాలు విభజన సందర్భంగా మార్పులో తీవ్రస్థాయికి చేరినప్పటికీ, దీనికి బీజాలు చాలా ముందే ఏర్పడినవి. పరిణామాలకు సమాధానం గానే బ్రిటిష్ ప్రభుత్వం జుగుప్సాకరంగా విభజన చేసిందనవచ్చు. విభజన వలన గందరగోళ రాష్ట్రాన్ని అదుపులో పెట్టవచ్చునని ప్రభుత్వం భావించింది. ఫలితం సరిగ్గా వ్యతిరేకమైంది. గందరగోళం యింకా వ్యాపించి, తీవ్రతరం కాగా, విభజన రద్దుచేయవలసి వచ్చింది స్వేచ్ఛకై జనించిన చైతన్యతను అణచలేకపోయారు. అది పెరిగి, యువకులను ఉత్తేజపరచి, వ్యవస్థ రూపంలో వున్న పెత్తందారి విధానం మీద దెబ్బలు కొట్టింది.

ఆందోళన దేశవ్యాప్తంగా వున్నది. రాజకీయాలలో ప్రాతినిధ్యపు విధానం, విజ్ఞప్తులు, రాజ్యాంగ బద్ధమైన ఆందోళన, ప్రజలలో విపరీతంగా వున్న పేదరికం, చదువుకున్న యువకులలో నిరుద్యోగం, జాతి, మతం పట్ల విశ్వాసం పునరుద్ధరణ కావడంతో, నిస్పృహ వ్యాపించగా, 19వ శతాబ్దాంతంలో అలజడి ఆరంభమైంది. మతపరమైన జాతీయ వాద రూపం దాల్చిన తీరు ఒక ప్రధాన శక్తిగా పరిణమించింది. విప్లవ కార్యకలాపాలలో నిమగ్నమైన అనేకమంది యువకులను ప్రోత్సాహ పరచి, మాతృభూమి విమోచనకై పురికొల్పింది. బంకిం చంద్ర ఛటర్జీ ఆనందమఠంఅనే సుప్రసిద్ధ నవల వలన మాతృభూమి భావన ప్రేరేపితమైంది మాతృభూమి విమోచనకై నవలలో పేర్కొన్న సన్యాసి వలె చాలా మంది సిద్ధమయ్యారు అమెరికానుంచి విజయోత్సాహంతో తిరిగి వచ్చి, హైందవ ఆధ్యాత్మికతను పునరుద్ధరించడానికి మత జాతీయ వాదాన్ని శక్తివంతంగా ప్రచారం చేసిన స్వామీ వివేకానంద ఆలోచనలు, ఆచరణ చాలామందిని ప్రభావితం చేసినవి. ఇదొక ప్రధాన విషయం.

చుట్టుపట్ల గ్రామాలలోనూ, రాష్ట్రమంతటా వ్యాపించి వున్న తీవ్ర జాతీయ వాద ప్రభావంతో, నరేంద్రనాథ్ కూడా విప్లవోద్యమం పట్ల సులభం గానే ఆకర్షితుడయ్యాడు. సరిగ్గా ఎప్పుడు చేరాడో చెప్పడం కష్టం గాని సుమా

రుగా 1904లో ఆయి వుండాలి. సుపరేన్ రాయ్ వ్రాసిన ది రెస్ట్ లెస్ బ్రాహ్మిన్ అనే గ్రంథంలో రాయ్ సన్నిహితుడు జాదూ గోపాల్ ముఖర్జీ పరిచయం వ్రాస్తూ యిలా పేర్కొన్నాడు. 1905 లేదా 1906లో మొదటి పర్యాయం అనుశీలక సమితిలో నరేన్ భట్టాచార్యను కలిశాను. అనుశీలక సమితి కార్యాలయం కారన్ వాలీస్ వీధిలోని 49వ యింట్లో వుండేది. కార్యకర్తలకు వుండే ఏర్పాట్లు చేశారు. తరుచు నరేన్ అక్కడ వుంటుండేవాడు. అతను, హరికుమార్ చక్రవర్తి కలసి సమితి సభ్యులయ్యారు. హరికుమార్ చక్రవర్తి ననుసరించి, 1904లో మొదట నరేంద్రనాథ్, హరికుమార్, శైలేశ్వర్ కలసి కలకత్తావెళ్ళి, అరవింద ఘోష్ సోదరుడు బరిన్ ఘోష్‌ను కలిశారు. ఇతను యుగంతర్‌కు సంపాదకుడయ్యాడు కూడా. వీరంతా విప్లవోద్యమంలో చేరదలచారు. ఆ తరువాత ఒక ఏడాదికి వీరు జాదు గోపాల్ ముఖర్జీని కలసి వుండాలి.

1899లో మొదటిసారి నరేంద్రనాథ్‌ను కలసి, జీవితపర్యంతం సన్నిహిత మిత్రుడుగానూ సహచరుడుగానూ వున్న హరికుమార్ చక్రవర్తి తొలి కాలాన్ని గురించి యిలా వ్రాశాడు. నరేన్‌కు సహనం అంటే ప్రీతి. చాలా దూరాలు నడచేవాడు. ఎప్పుడు తోటలలో తిరుగుతూ, దయ్యాలు అన్వేషణలో రాత్రిళ్ళు స్మశానాలలో గడిపేవాడు. (ది రెస్ట్ లెస్ బ్రాహ్మిన్)విరామంలేనివ్యక్తిగా నరేంద్రనాథ్ నాడు గడిపాడు. తండ్రి దగ్గర సంస్కృతం అధ్యయనం చేస్తూ. బేలూర్‌లో రామకృష్ణ ఆశ్రమం సందర్శిస్తుండేవాడు. కర్రసాము, యోగాభ్యాసాన్ని శివనారాయణస్వామివద్ద నేర్చాడు. జాతీయ వాదం, హైందవ సంస్కరణ వాదం అభ్యసిస్తూ విప్లవవాదుల గురించి, వారి కార్యకలాపాల విషయమై సమాచారాన్ని సేకరిస్తుండేవాడు.

నరేంద్రనాథ్ ఉద్యమంలో ప్రవేశించడాన్ని అతని సహచరుడు యిలా వ్యాఖ్యానించాడు. నరేంద్ర కుర్రవాడు. పద్నాలుగేళ్ళు వుంటాయో లేదో. మంచి శక్తివంతుడు, చురుకు దనంతో వున్నాడు. విప్లవోత్సాహంతో ఉప్పొంగుతున్నాడు బెంగాలులోనూ యితరచోట్ల మమ్మల్ని నాడు ఎదుర్కొంటున్న సమ

స్యలు యిష్టాగోష్టిగా చర్చిస్తుండగా, గదిలోకి దూసుకవచ్చాడు. మాతోమాట్లాడాడు. విదేశీ బంధంనుంచి దేశాన్ని విమోచన గావించడానికి తన సమయమంతటినీ వినియోగిస్తానన్నాడు. అసాధ్యమైనది చేస్తానని ప్రమాణం చేశాడు. విప్లవకారుడికి అసాధ్యం లేదు. ఆచిర కాలంలోనే మా తో చేరాడు. మా ఉద్యమానికి అతనెంతో విలువైన వాడయ్యాడు. గొప్పనాయకులలోని లక్షణాలు అతనిలో కనిపించాయి. (ఎ. కె. హింది ఎం. ఎన్. రాయ్, దిమేన్ హు లుక్డ్ ఎహెడ్ పుట.8)

స్వేచ్ఛా లక్ష్యమే నరేన్‌ను విప్లవోద్యమంలోకి ఆకర్షించింది. 1905లో విభజన వ్యతిరేక సమావేశాలు తరుచు కలకత్తాలో జరుగుతుండగా, నరేన్ వాటిల్లో పాల్గొంటూ వుండేవాడు. అతనితో పాటు హరికుమార్ చక్రవర్తి, శైలేశ్వర్ బోసు కూడా వుండేవారు. ఒకసారి సుప్రసిద్ధ జాతీయ నాయకుడు సురేంద్రనాథ్ బెనర్జీని కొడాలియాకు ఆహ్వానించి, సమావేశం ఏర్పాటు చేశారు. ఆ పని చేసినందుకు అతనినీ మరికొందరినీ పాఠశాలనుంచి బహిష్కరించారు. తరువాత నిషేధం తొలగించి ప్రవేశ పరీక్షకు కూర్చోవడానికి అనుమతించారు. నరేన్, అతని మిత్రులు కూడా భగవద్గీత, ఆనందమఠ్, అరవిందుని భవాని మందిర్ నాటి విప్లవ సాహిత్యం చదువుతుండేవారు. స్వామి వివేకానంద రచనలు వారికి బాగా నచ్చాయి

నరేన్ అతని మిత్రులు అనుశీలన్ సమితిలో చేరారు బెంగాలు యువపులకు శారీర, మానసిక, నైతిక పునరుజ్జీవనానికై 1902లో ఈ సంఘం స్థాపితమైంది. అతి త్వరలోనే బెంగాలు అంతటా విప్లవ చర్యలకై యిచొక రహస్య సంస్థగా రూపొందింది. దీని శాఖలు ఇతర నగరాలలో తలెత్తాయి. మరికొన్ని స్వతంత్ర సంస్థలు వెలశాయి. ఇందులో పేర్కొన దగినది ఢక్కాలోని అనుశీలన్ సమితి ఒకటి. ఏత్తుగడలలో తరుచు వివిధ సమితులకు ఏకాభిప్రాయం వుండేది కాదు. వ్యక్తిగత ఈర్ష్య అసూయలు, స్పర్ధలతో కలహించుకోవడం, పరస్పర అనుమానాలు వుంటుండేవి. కలసి పనిచేయడానికి కొన్ని పర్యాయాలు కలసి కట్టుగా వుండేవారు. ప్రతి సమితికి ఒక నాయకుడు వుండే

వాడు, ప్రవేశానికి చాలా కట్టుదిట్టమైన నిబంధనలు వుండేవి. క్రమ శిక్షణ, రహస్యం పొక్కకుండా వుండడానికి చర్యలు తీసుకునేవారు. సమితిపట్ల ప్రభుత్వం, పోలీస్ ఎప్పుడూ అనుమానిస్తూనే వుండేవారు. కాని పైకి చేస్తున్న కార్యకలాపాలు చట్టబద్ధమైనవి కావడంతో చర్య తీసుకోవడానికి వీల్లేక పోయేది. సి.ఆర్. దాస్ వంటి ప్రముఖులు యీ సమితితో సంబంధం పెట్టుకోవడం కూడా యిందుకు ఒక కారణం. 1908 నాటికి సమితి చర్యలకు దారి దోపిడీలు, హత్యలకు ముడి పెట్టే సాక్ష్యాధారాలు చాలా లభించాయి. ఫలితంగా అనేక సోదాలుచేశారు. చట్ట వ్యతిరేక సంస్థలుగా వీటిని ప్రకటించారు. 1908లోకలకత్తా అనుశీలన్ సమితి చట్ట వ్యతిరేకమని ప్రకటించారు. మరుసటి సంవత్సరం ఢక్కా సమితి కూడా అలాంటిదే అన్నారు. దీనితోపాటు అనేకసంఘాలను చట్టవ్యతిరేకమైన వన్నారు.

సమితిలో చేరిన కొత్త సభ్యులు సాంఘిక, సహాయ కార్యక్రమాలు చేయాలి. క్రమ శిక్షణ నిమిత్తం, ఇదొక విధానంగా పెట్టుకున్నారు. ఒరిస్సాలో కరువు నివారణ కృషికై నరేన్, హరి కుమార్‌లను పంపారు. జయపూర్‌లోని దూరియాహత్ శిబిరానికి నరేన్ బాధ్యత వహించవలసి వచ్చింది. వీరి కృషి సంతృప్తికరంగా వుండడంతో, కలకత్తాకు తిరిగి రాగానే వీరిని అంతరంగిక బృందంలో చేర్చుకున్నారు. అప్పటికే నరేన్ స్వగృహాన్ని వదిలి కలకత్తాలోని 49 కారన్ వాలీస్ వీధిలోని అనుశీలన్ సమితి కేంద్రంలో వుంటున్నాడు. ఆసమయంలోనే బెంగాలీ దిన పత్రిక యుగంతర్‌ను ప్రారంభించిన బరిన్ ఘోష్‌తో నరేన్‌కు పరిచయం ఏర్పడి సన్నిహితుడయ్యాడు. దిన పత్రిక నిర్వహణలో బరీన్ ఘోష్‌కు తోడ్పడటమే గాక, కొన్ని వ్యాసాలు కూడా నరేన్ వ్రాసాడు. తరువాత బెంగాలీలో మాత పిలుపు శీర్షిక అనే చిన్న పుస్తకాన్ని వ్రాయగా, అది పోలీసులకు చిక్కింది. అంతటితో అరెస్టు చేశారు.

విప్లవోద్యమంలో చేరగానే గురిచూసి కాల్చడం, బాంబులు తయారుచేయడం నరేన్‌కు నేర్పారు. విప్లవ కారులకు గుండ్లు, బాంబులు ప్రధాన సాధనాల

యాయి. బ్రిటిష్ అధికారులను భయపెట్టడానికి, తమనుంచి తొలగిన వారిని శిక్షించడానికి, ప్రజలను ఉత్సాహపరచి చైతన్యవంతులుగా మార్చడానికి, సాయుధ తిరుగుబాటుకు, మాతృభూమి స్వేచ్ఛకై వీటినే ప్రయోగించేవారు.

ఇదే సమయంలో నరేన్‌కు జతీంద్రనాథ్ ముఖర్జీతో సంబంధం ఏర్పడింది. బెంగాలు ప్రభుత్వ ఆర్థిక కార్యదర్శి కార్యాలయంలో సంక్షిప్త లేఖకుడుగా అతను పనిచేస్తుండేవాడు. అయితే విప్లవోద్యమంలో బాగా నిమగ్నుడైనాడు. అప్యాయ స్వభావం గలవాడు. ఆకర్షణీయ వ్యక్తిత్వం వున్నది. అనేకమంది యువకులైన విప్లవ కారులను తనవైపుకు ఆకర్షించాడు. నరేన్ యితన్ని నాయకుడుగా స్వీకరించాడు. ఉత్తరోత్తరా అనేక విప్లవ సాహసకృత్యాలలో యిరువురూ కలసి పని చేశారు.

బరీన్‌ఘోష్‌తో కలసి బాంబులు చేయడంలో నరేన్ అప్పటికే నిమగ్నమై వున్నాడు. కలకత్తా శివార్లలోని మనిక్తోలా మురారిపుకూర్ తోటలో వీరి కార్యకలాపాలు సాగుతుండేవి. ఇక్కడ సిద్ధంచేసిన బాంబులను కలకత్తాలోని అనేక చోట్ల ప్రయోగిస్తుండేవారు. ముజఫర్‌పూర్‌లో 1908 ఏప్రిల్ 30న ఖుదిరాంబోస్ ప్రయోగించిన బాంబు వలన యీ కేంద్రం ఆచూకీ తెలిసింది. కేంద్రంపై దాడి చేసి సోదాచేయగా లభించిన పరికరాల ఆధారంగా కుట్రకేసును పెట్టారు. అలీపూర్ కుట్ర కేసుగా పేరొందిన దానిలో బరీన్‌ఘోష్, అరవిందఘోష్‌లు ప్రధాన నిందితులుగా వున్నారు. అందులో నరేన్‌లేడు. అయితే అతనిపై పోలీస్‌కు అనుమానం వున్నది

అంతకు క్రితం సంవత్సరం రాష్ట్రంలో నరేన్ తొలి రాజకీయ దోపిడీ చేశాడు. జతీన్‌ముఖర్జీ నాయకత్వాన పెంపొందిన విప్లవ కార్యకలాపాలకు నిధులు సమకూర్చే నిమిత్తం యీ దోపిడీ జరిగింది. 1907 డిసెంబరు 6న చింగ్రిపోత రైల్వేస్టేషన్ వద్ద యీ దోపిడీ జరిగింది,

స్టేషన్‌మాస్టర్‌ను గాయపరిచి, కార్యాలయంలో భద్రంగా దాచిన డబ్బును దోచుకుపోయారు. దోపిడీ అనంతరం నరేన్ తప్పించుకున్నప్పటికీ, కొద్దిరోజులకే అరెస్టు అయ్యాడు. పట్టుబడినప్పుడు అతనివద్ద బరీన్‌ఘోష్ వ్రాసిన బెంగాలీ పుస్తకం 'వర్తమాన రణనీతి' (ఆధునిక యుద్ధ వ్యూహం) సొంతంగా వ్రాసిన 'మయేర్ డాక్' (మాత పిలుపు) అనే వ్రాత ప్రతి వున్నాయి. సాంఘిక కార్యకర్తగా ఖ్యాతి గాంచినందున అతన్ని జామీనుపై విడుదల చేశారు. జామీను దరఖాస్తులో బాబు ప్రమోదనాథ్ ముఖర్జీ న్యాయవాదిగా కలకత్తాలోని సెల్దా పోలీస్ మాజిస్ట్రేట్ ముందు యిలా పేర్కొన్నాడు. 'ఈ యువకుడు బెంగాలు సాంకేతిక సంస్థ విద్యార్థి. ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. జాతీయ కళాశాలనుంచి యితనికి పతకం కూడా లభించింది. తరువాత రెండేళ్ళలో నరేన్ అనేక రాజకీయ దోపిడీలు చేశాడు. కాని వాటిని గురించి అంతగా సమాచారం తెలియదు. 24 పరగణాల జిల్లాలోని డైమండ్ హార్బరు దగ్గర నేత్రాలో జరిగిన దోపిడీని గురించి కొంత సమాచారం తెలుస్తున్నది. 1909 ఏప్రిలు 25న యిది జరిగినది. రెండువేల రూపాయలు దోచుకున్న అనంతరం యింటిని వదలి వెడుతూ నరేన్ యింటి యజమానితో ఇలా అన్నాడు బ్రిటిష్ వారిని తరిమి వేయడానికి యీ డబ్బును అప్పుగా తీసుకుంటున్నామంతే. ఈ దోపిడీ సందర్భంగా నరేన్ అరెస్టు అయ్యాడు. జామీనుపై విడుదలై కనిపించకుండా పోయాడు. నేత్రా దోపిడీని విడిగా విచారించలేదు. ఒక సంవత్సరం తరువాత హౌరా కుట్ర కేసులో యిదొక భాగంగా స్వీకరించారు.

ఒక పట్టాన పట్టుపడని నరేన్ హౌరా, శిబపూర్‌లలో ఎక్కువగా గడుపుతుండేవాడు. అనుశీలన సమితి నిషేధానికి గురియైంది. అరవింద ఘోష్ రాజకీయాలనుంచి విరమించాడు. బరీన్‌ఘోష్, తదితరులకు చాలాకాలం శిక్ష పడింది. విప్లవోద్యమం గట్టి చిక్కులలో వున్నది. జైల్లా చెదురైన వారిని కూడగట్టడం, వారిలో విశ్వాసాన్ని పునరుద్ధరించడం, వారందరినీ పునర్వ్యవస్థీకరించే బాధ్యత

నరేన్‌పై పడింది. జతీన్ ముఖర్జీ నాయకత్వాన యీ బాధ్యత వహించాడు. వ్యవస్థాకారుడుగా అనేకచోట్లకు వెడుతూ, ఉత్సాహవంతులైన కార్యకర్తలను కలుసుకున్నాడు. ప్రేరేపణ అంతా జతీన్‌ముఖర్జీది. అతనే ఆకర్షణీయ కేంద్రంకూడా. నరేన్‌కు చెందిన చింగ్రిపోతముఠా యీ కృషిలో ప్రముఖ పాత్ర నిర్వహించింది. హౌరాలో వుండగా వివిధ ముఠాలతో నరేన్ రాజకీయ చర్చలు సాగించాడు. గెరిల్లా పద్ధతిలో యుద్ధం చేయాలని పథకం వేశాడు. బ్రిటిష్ వారిని దేశం నుంచి పారద్రోలడానికి యితర విధాలైన పద్ధతులు కూడా ఆలోచించాడు.

నాటి నరేన్ సహచరులతో మాట్లాడి విషయ సేకరణ చేసిన సమరేన్ రాయ్ ననుసరించి, ఇతరులకంటే నరేన్ రాజకీయ భావాలు చాలా అభ్యుదయమైనవి: సోషలిస్టు భావాలు అతడిలో కనిపించకపోయినా, మతాన్ని ఎన్నడూ రాజకీయాలకు ముడిపెట్టలేదుకూడా. బ్రిటిష్ ప్రభుత్వం స్థానే ఎటువంటి ప్రభుత్వం కావాలో నరేన్ చెబుతుండేవాడు. అవకాశాలుగల కొద్దిమంది ప్రభుత్వం స్థానే ప్రజల ప్రభుత్వం గురించి ఆలోచిస్తూ, యిటువంటి ప్రభుత్వ స్థాపనకు విప్లవం ఒక్కటే మార్గమనేవాడు.

హౌరా-శివపూర్ కుట్ర కేసు 1910 ప్రారంభంలో పెట్టారు. ఇందులో నరేన్, జతీన్ ముఖర్జీతో సహా 46 మంది నిందితులున్నారు. వీరిలో చాలామంది జనవరి 29న అరెస్టు అయ్యారు. మార్చి 4న మాజిస్ట్రేటు విచారణ ఆరంభమయింది. హైకోర్టులోని ఒక ప్రత్యేక ట్రిబ్యునల్ వీరిని విచారించాలని జూలై 20న కేసును మాజిస్ట్రేటు పంపాడు. నిందితులపై నేరారోపణ ఏమంటే 1905-1910 మధ్య శివపూర్‌తో సహా, హౌరా జిల్లా, తదితర బ్రిటిష్ పాలిత భారతదేశంలో వీరంతా కుట్రపన్ని, రాజుకు వ్యతిరేకంగా యుద్ధం చేయాలనుకున్నారు. బ్రిటిష్ ఇండియాలో రాజుకు సార్వభౌమాధిపత్యం లేకుండా చేయాలనుకున్నారు. చట్టబద్ధంగా ఏర్పడిన ప్రభుత్వాన్ని నేరచర్యల రూపంగా బలవంతంగా తొలగించాలనుకున్నారు. తద్వారా భారత శిక్షాస్మృతి 121-ఎ

విభాగం క్రింద శిక్షార్హమైన నేరం చేశారు. (ది రెస్ట్ లెస్ బ్రాహ్మిన్ పుట 46) రాజకీయ స్వభావంతో కూడిన అనేక నేరాలకు పాల్పడ్డారు. ఇద్దరు పోలీస్ అధికారులను, సమాచారాన్ని చేరవేసే మరొక వ్యక్తిని చంపేశారు. ఆయుధాలను సేకరించారు. 10వ జాట్ దళ విధేయతలో జోక్యం చేసుకున్నారు. కుట్ర నిమిత్తం నిధులను సేకరించడానికి భద్రలోకులు చాలా దోపిడీలు చేశారు అని ఆరోపించారు. [ది రెస్ట్ లెస్ బ్రాహ్మిన్ పుట 47].

వదిలేసిన 33 మంది సైతం ఒక ఏడాది పాటు జైలులో గడపవలసి వచ్చింది. అందులో నరేన్ ఒకడు. ఇతను 9 మాసాల పాటు జైలులో ఏకాకిగా వుండడం చాలా చిత్రహింసలతో కూడిన అనుభవం. చింగ్రిపోత చిత్రహింసతో కూడిన దోపిడియే కాక, 1908లో కూడా ఆరు దోపిడీలలో పాల్గొన్నట్లు నరేన్‌పై ఆరోపణలున్నాయి. నరేన్ వున్నట్లు సాక్ష్యాధారాలు చూపడం లేదని ప్రధాన న్యాయమూర్తి పేర్కొన్నారు.

జైలులో శిక్ష అనుభవిస్తూండగానే, జతీన్ ముఖర్జీ, నరేన్ తదితరులు భవిష్యత్తు కార్యక్రమానికి పథకం వేశారు. సాయుధ తిరుగుబాటు సాగించాలనుకున్నారు.

సాయుధ తిరుగుబాటు పథకాన్ని యితర విప్లవ ముఠాల ముందు పెట్టి, వారందరినీ ఒప్పించాలని భావించారు. అందరి మధ్య సమైక్యత సాధించి, ఒకే నాయకత్వం క్రిందకు తేవాలనుకున్నారు. ఈ రెండు బాధ్యతలు నరేన్ స్వీకరించి, విజయవంతంగా సాధించాడు. ఇందుకుగాను బెంగాలు అంతటా, దేశంలోని ఇతర ప్రాంతాలు పర్యటించవలసి వచ్చింది. కొంతకాలంపాటు సన్యాసి అయ్యాడు. సన్యాసిగా పోలీసులకు అనుమానం రాకుండా తిరగడం సులభం. కొందరు విప్లవ నాయకులు సన్యాసులయ్యారు. వారంతా నరేన్ కూడా తమ అడుగుజాడలలో సంచరిస్తున్నాడనుకున్నారు. పుణ్యపురుషుల నిమిత్తం యితను అన్వేషిస్తుండడం వలన వారి అనుమానం ధృవపడింది. కానీ

నరేన్ కోరే విమోచన ఆత్మకు కాదని, మాతృభూమి కోసరమని అచిరకాలంలోనే స్పష్ట మయింది అప్పట్లో నరేన్, వారణాసి, అలహాబాదు, ఆగ్రా,మధుర వంటి స్థలాలు సందర్శించాడు. ఇటువంటి సంచారం వలన దేశాన్ని గురించి సన్నిహితంగా తెలుసుకున్న విషయాలు, ఏర్పడిన సంబంధాలు ఉత్తరోత్తరా అతని కార్యకలాపాలకు ఉపకరించాయి. ఒక సంవత్సరానికి ఐక్య సంఘటన ఏర్పడింది. బెంగాలులోనూ వెలుపల కూడా శాఖలు, సంబంధాలు ఏర్పడ్డాయి. దీనినే యుగంతర్ పార్టీ అనేవారు.

జైలునుంచి విడుదలకాగానే, ఏదోఒక నెపం అడ్డం పెట్టుకోవడానికిపీలుగా ఇండియా ఈక్విటబుల్ అస్యూరెన్స్ కంపెనీలో నరేన్ ఉద్యోగం స్వీకరించాడు బెలియా ఘటలో బియ్యపు మిల్లులో బిల్లు కలెక్టర్గానూ, కట్టెల అడితీలోనూ పనిచేశాడు. 1912-18 మధ్య నరేన్ ఎక్కువగా శ్రీ గోపాల్ మల్లిక్ వీథిలోని ఒక వసతి గృహంలో బసచేశాడు. తరువాత ఉద్యోగాలకు ఉద్వాసన పలికి ఒక ఫలహార శాల ప్రారంభించగా, అదే ఆయుధ సేకరణకు కూడలి అయింది. సమాచారం పరస్పరం అందించుకోవడానికి కేంద్రంగానూ మారింది. సైనికులు, నావికులు యీ ఫలహారశాలకు యిష్టంగా వస్తుండేవారు. నరేన్ చేసే మంచి పదార్థాలే వారిని ఆకర్షించేవి.

విప్లవ ముఠాల చర్యలు బెంగాలుకే పరిమితంకాలేదు పంజాబు, ఉత్తర ప్రదేశ్, ఢిల్లీ వంటి ఉత్తరాది ప్రాంతాలకు యివి వ్యాపించాయి. మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, మద్రాసులతో సంబంధాలు ఏర్పడినవి. బెంగాలులో శిక్షణపొందిన యువకులను యీ ప్రాంతాలకు "ఆచరణ" నిమిత్తం పంపారు. కొన్ని సందర్భాలలో బాంబులు, పిస్తోళ్ళు కూడా బెంగాలునుంచే అందేవి. ఇండియా వైశ్రాయి లార్డ్ హార్డింజ్ 1912 డిసెంబరు 23న ఢిల్లీకి రానుండగా అతనిపై విసిరిన బాంబుకేసు సుప్రసిద్ధమైనది.

ఐరోపా, అమెరికా, బర్మా, ఇండొనేషియా, బాంకాక్, సింగపూర్ హాంకాంగ్ వంటిచోట్ల భారత విప్లవ ముఠాలతో సంబంధాలు ఏర్పరచారు. పశ్చిమ రాజ్యాలలో, కెనడాలోని పాన్‌కార్, అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కో-లోనూ దిట్టమైన భారత విప్లవ ముఠాలు పనిచేస్తున్నాయి.

సాయుధ తిరుగుబాటుకు ధనం కావాలి. ఈ పని నరేన్‌కు అప్ప గించారు. "ముందుగా కావలసిన ఖర్చులకై నాకు అప్పగించిన పని పథకం ప్రకారం నిర్వహించాను." అని తన స్మృతులలో ఎం. ఎన్. రాయ్ పేర్కొ-న్నాడు. నరేన్ ఆధ్వర్యాన జరిపిన అనేక రాజకీయ దోపిడీల వలన నిధులు సేకరించారు. ఇందులో ఒక పేర్కొనదగినది కలకత్తాలో పట్టపగలే గార్డెన్ రీచ్‌లోని బర్డ్ అండ్ కంపెనీ ధనాన్ని 1915 ఫిబ్రవరి 12న నరేన్ మరి యిరువురు దోచారు. చేయదలచిన దోపిడీలలో యిది మొదటిది. గార్డెన్ రోచ్ రాజకీయ దోపిడీగా ప్రసిద్ధి చెందిన యీ చర్య కలకత్తాలో సంచలనాన్ని సృష్టిం చింది. తుపాకులు చూపుతూ, పేల్చనవసరం లేకుండానే నిమిషాలలో తొలి దోపిడీ పూర్తిచేశారు డాక్టర్ జాదుగోపాలు ముఖర్జీ ననుసరించి గార్డెన్‌రీచ్ దోపిడీ సాహసోపేతమైనది, ధైర్యంతో కూడినది. నరేన్ భట్టాచార్య ప్రశాం తంగా నిర్దిష్టంగా యీ కార్యక్రమాన్ని నిర్వహించాడు. కనీసం ఒక్కసారైనా తుపాకీ పేల్చలేదు. [ది రెస్ట్ లెస్ బ్రాహ్మణ్ లో ముందుమాట] ఈ దోపిడీ జరి గిన ఒకటి రెండు రోజుల తరువాత నరేన్ అరెస్టు అయ్యాడు.

అంతకు కొద్దిమాసాలక్రితం జరిగిన విప్లవచర్య కూడా ప్రస్తావించతగినదే. సెడిషన్ కమిటీ నివేదిక యిలా పేర్కొన్నది. "కలకత్తాలో తుపాకులు చేసే రోడా అండ్ కో నుంచి పిస్తోళ్ళు దొంగలించడం చేయడం బెంగాలు విప్లవ నేరా లలో అతి ప్రధానమైనది. 1914 ఆగస్టు 26 బుధవారంనాడు రోడాఅండ్ కంపె నీలో దిగుమతులను చూసే గుమాస్తా, 202 కేసులను సుంకాల కార్యాలయం పంపగా, 192 కేసులు మాత్రమే గిడ్డంగి పన్నిటర్‌లోకు తెచ్చాడు. మిగిలినవి

తెస్తానని వెళ్ళాడు. తిరిగిరాలేదు. మూడురోజుల అనంతరం పోలీస్‌కు ఫిర్యాదు యిచ్చారు. తప్పిపోయిన 10 పెట్టెలలో 50 పిస్తోళ్ళు, 46 వేలసార్లు కాల్చడానికి వీలుగా గుండ్లు వున్నాయి. 300 బోరే పిస్తోళ్ళే అవన్నీ రోడా అండ్ కంపెనీలో వీటి గురించి సమాచారం వున్నది. రైఫిల్‌వలె భుజానికి ఆనించి కాల్చడానికి వీలైన తీరులో యీ పిస్తోళ్ళను తయారుచేశారు వాటన్నిటినీ పెట్టెలో భద్రపరచారు. కాజేసిన వాటిలో 44 పిస్తోళ్ళను 9 విప్లవ ముఠాలకు బెంగాలులో పంచారని సమాచారం అందింది. వీటిని 54 దోపిడీలు హత్యలు, లేదా దోపిడీకి హత్యకు ప్రయత్నించటంలో 1944 అగస్టు తరువాత వాడారు. 1914 ఆగస్టు తరువాత, రోడాఅండ్ కంపెనీనుంచి దొంగిలించిన పిస్తోళ్ళను వాడని విప్లవచర్యలంటూ అరుదు. [సెడిషన్ కమిటి, 1918, నివేదిక -న్యూ ఏజ్ పబ్లిషర్స్, కలకత్తా 12, 1973 పుట 66] ఈ చర్యలో నరేన్ ప్రముఖపాత్ర నిర్వహించాడు.

అప్పుడు అంతర్జాతీయ పరిస్థితి తీవ్రతరమైంది. యుద్ధమేఘాలు క్రమ్ముకున్నాయి ఇంగ్లండ్ జర్మనీల మధ్యయుద్ధం వచ్చే సూచనలు కనపడ్డాయి. యుద్ధమే గనుక వస్తే జర్మనీ సహాయపడడానికి సిద్ధంగా వున్నట్లు విదేశాలలోని స్నేహితుల వలన విప్లవకారులకు సమాచారం అందింది.

భారత విప్లవ కారులు జర్మనీ అధికారులను సమీపించి సంప్రదింపులు ప్రారంభించారు. 1913 చివరలో, కలకత్తాలోని జర్మన్ రాయబార కార్యాలయం ద్వారా జర్మనీ వారితో సంబంధాలు పెట్టుకోవడానికి నరేన్ ప్రయత్నించాడు. 1914 ప్రారంభంలో నరేన్, జతీన్ ముఖర్జీలు జర్మనీ రాయబారితో అనేక పర్యాయాలు కలసి, సాయుధ తిరుగుబాటు గెరిల్లా యుద్ధపన్నాగాలు చర్చించారు.

1914 ఆగస్టులో ఇంగ్లండ్ జర్మనీల మధ్య యుద్ధం ప్రారంభమైంది. పరిస్థితిని అనువుగా చేసుకోవడానికి విప్లవకారులు తీవ్ర కృషి చేశారు. సాయుధ

పోరాటం జరపాలని నిర్ణయించారు. సమైక్య పార్టీకి జతీన్‌ముఖర్జీ ప్రధాన నాయకుడయాడు. అప్పట్లో జతీన్‌ముఖర్జీ కలకత్తా వెలుపలవుంటూ, కంట్రాక్టర్‌గా పనిచేస్తున్నాడు తరుచు కలకత్తా సందర్శిస్తూండేవాడు. తరువాత కలకత్తా రావడం క్షేమకరం కాకుండా పోయింది. అతని భద్రత నిమిత్తం, బాలాసోర్‌కు అట్టే దూరంగాని మొహందియ గ్రామంలో స్థావరం ఏర్పరచాడు నరేన్. సమాచారం తెలుసుకునే నిమిత్తం యూనివర్సల్ ఎంపోరియం అనేది స్థాపించాడు. కలకత్తాలో అప్పటికే అటువంటివి రెండు వున్నాయి.

తిరుగుబాటుకు కలకత్తాలో సన్నద్ధాలు సాగుతున్నాయి. సందేహవాదులకు హామీ యిస్తూ, రాకపోకలు స్థంభింపజేస్తామని చెప్పి, నరేన్ వారిని తమవైపు త్రిప్పుకున్నాడు. అవసరమైనప్పుడు రాకపోకలు స్థంభింపజేసే నిమిత్తం, చక్రధరపూర్, సంబల్‌పూర్‌లో కేంద్రాలు స్థాపించారు. తిరుగుబాటు వ్యూహాన్ని చర్చించడానికి వారణాసిలో కొద్దిరోజులకే సమావేశమయ్యారు. రాచ బిహారి బోస్, జతీన్ ముఖర్జీ, నరేన్‌లు యీ సమావేశంలో పాల్గొన్నారు. అమరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ, అటుల్ కృష్ణఘోష్‌లు కూడా వున్నారు జర్మనీ ఆయుధాలు పంపడానికి సిద్ధంగా వున్నదని 1915 మార్చిలో సమాచారం అందింది. వివరాలు చర్చించడానికి ఒక ప్రతినిధిని బటేవియాకు పంపవలసిందిగా కబురు చేశారు. ఆయుధాలు వస్తాయనగానే విప్లవకారులు ఉబ్బిపోయారు. ప్రతినిధిని పంపాలనే ఆహ్వానాన్ని ఆమోదించారు. నరేన్‌పై బాధ్యత పడింది. అతని రాజకీయ జీవితంలో యిదొక మలుపుగా మారింది.

## 2 వ అధ్యాయం

# ఆయుధాల అన్వేషణలో

1915 ఏప్రిల్‌లో ఆయుధాల అన్వేషణాకృషిలో నరేన్ భారతదేశాన్ని వదలి జావాకు వెళ్ళాడు. అక్కడ ఎదురు చూసిన ఆయుధాలు లభించలేదు. దానికి బదులు కొత్త వ్యక్తిత్వం, కొత్తసిద్ధాంతం లభించాయి. ఆయుధాల అన్వేషణ అంతమవుతుండగా యిది సంభవించింది.

సి. మార్టిన్ అనే పేరుతో, కలకత్తాలోని ఒక కంపెనీ ప్రతినిధిగా నరేన్ అక్కడికి వెళుతున్నట్లు చెప్పుకున్నాడు. హేరీ అండ్ సన్స్ అనే యీ కంపెనీ తమ కార్యకలాపాల నిమిత్తం విప్లవకారులు స్థాపించినది మాత్రమే. నరేన్ సన్నిహిత మిత్రుడు కంపెనీ వ్యవహారాలు చూస్తున్నాడు. అతనిపేరు హరికుమార్ చక్రవర్తి. నరేన్ ఆయుధాల అన్వేషణలో ప్రయాణాలు చేస్తుండగా యీ కంపెనీ ఆధారంగానే దేశంలోని విప్లవ కారులతో సంబంధాలు కొనసాగించాడు.

తన ప్రయత్నాలన్ని గురించి యం. ఎన్. రాయ్ ఉత్తరోత్తరా వ్రాసిన స్మృతులలో యిలా పేర్కొన్నాడు. 1914లో మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం కాగానే, ప్రవాసంలో వున్న భారత విప్లవకారులు జర్మనీవైపు ఆశగాచూస్తూ ఎన్నో ఊహలతో అక్కడకు వెళ్ళారు. సంవత్సరాంతానికి మాకు చేరిన వార్తలనుబట్టి బెర్లిన్‌లోని భారత విప్లవ సమితికి ఆయుధాలు, డబ్బు యివ్వటానికి జర్మన్ ప్రభుత్వం అంగీకరించిందని, స్వాతంత్ర్యంకోసం

యుద్ధాన్ని ప్రకటించే నిమిత్తం యిది వుద్దేశించారనీ తెలిసింది. దేశంలో బ్రిటిష్ దళాలలోని భారతీయులపై కూడా ప్రభావం చూపెట్టే అంతగా యీ వార్త నలుమూలలా వ్యాపించింది. ఈ విషయాన్ని కొనసాగిస్తూ యింకా యిలా పేర్కొన్నాడు. అప్పుడు హామీ యిచ్చిన ప్రకారం ఆయుధాలను దేశంలోకి తీసుకరావలసిన సమస్య ఎదురయింది. జర్మనీ నుంచి యింత దూరం స్వయంగా తీసుకరావటం జరిగే పనికాదు. ఒక వార్తా హరుడు బెర్లిన్ వెళ్ళి, ఆయుధాలను భారతదేశం సమీపంలోవున్న తటస్థదేశంలో జర్మన్‌లు మాకు అందించాలని ప్రతిపాదన చేశారు. దీనికి డచ్ యీస్ట్ యిండీస్‌ను ఎంపిక చేసాము. 1914 చివరలో నేను జావాకు వెళ్లాను. దేశంనుంచి బయటకు పోవటం అదే ప్రథమం (మెమోయిర్స్ పేజీ-8)·

నరేన్ అక్కడకు చేరగానే బటేమియాలో ఏమి జరిగిందో సెడిషన్ కమిటీ నివేదిక యిలా వివరించింది. బటేమియాకు చేరగానే మార్టిన్‌ను జర్మనీ కౌన్సిల్ ధియోడోర్ హెల్ఫరిచ్‌కు పరిచయం చేసాడు. ఆయుధాలూ, మందు గుండు సామగ్రి, కరాచీ త్రోవలో వున్నవనీ, భారతీయులకు విప్లవంలో తోడ్పడటానికి వీనిని వుద్దేశించారనీ అతను చెప్పాడు. ఆ నౌకను బెంగాలుకు మళ్లించాలని మార్టిన్ కోరాడు.

షాంఘైలోని జర్మన్‌కౌన్సిల్‌ను సంప్రదించిన అనంతరం యిందుకు ఒప్పుకున్నారు. మావెరిక్ అనే యీ నౌకను స్వీకరించటానికి తగిన ఏర్పాట్లు గావించే నిమిత్తం మార్టిన్ తిరిగి దేశానికి వచ్చి సుందర బాన్స్‌లోని రాయ్ మంగల్‌వద్ద ఏర్పాట్లు జరిపారు. నౌకలో 30 వేల రైఫిళ్ళు, 400 రౌండ్లకు పనికి వచ్చే మందుగుండ్లు రెండు లక్షల రూపాయలూ వున్నాయి. ఈలోగా సుప్రసిద్ధ విప్లవకారుడు నడుపుతున్న తప్పుడుసంస్థ హేరీఅండ్‌సన్స్‌కు మార్టిన్ తంతియిస్తూ వ్యాపారం ప్రోత్సాహకరంగా వున్నది అన్నారు. జూన్‌లో హేరీ అండ్ సన్స్ డబ్బు కోసం మార్టిన్‌కు తంతిని యిచ్చింది. అప్పటినుంచీ అగస్టు

వరకూ బటేవియాలోనే హెల్ఫెరిచ్ అనేక పర్యాయాలు హేరీ అండ్ సన్స్ కంపెనీ పేరిట డబ్బు జమకట్టగా మొత్తం 43 వేల రూపాయలు కూడింది ఏమి జరుగుతున్నదో అధికారులు తెలుసుకునేలోపు 33 వేల రూపాయలు విప్లవకారులకు చేరింది. (సెడిషన్ కమిటీ రిపోర్టు, పేజీ-121)

జూన్ మధ్యలో నరేన్ దేశానికి తిరిగి వచ్చాడు. మావరిక్ నౌకలోని సరుకు స్వీకరించటానికి, దానిని సద్వినియోగం చేయడానికి వేసిన పథకాలను సెడిషన్ కమిటీ యిలా పేర్కొన్నది. ఆయుధాలను మూడుభాగాలు చేసి ఒకటి బారిసాల్ పార్టీ సభ్యుల కృషి నిమిత్తం తూర్పు బెంగాలు జిల్లా కొరకు హతియాకు పంపాలనుకున్నారు రెండవ భాగం కలకత్తాకు, మూడవభాగం బాలసోర్‌కు పంపదలిచారు. బెంగాలులోని సైనికదళాలలో ఎదుర్కొనగల సంఖ్యాబలం తమకున్నదనీ, అయితే బయటినుంచి దళాలకు మద్దత్తు రావచ్చునని భయపడ్డారు. ఈ దృష్టితో బెంగాలుకు వచ్చే 3 ప్రధాన రైలుమార్గాలను ఆటంకపరిచే నిమిత్తం ముఖ్యమైన 3 వంతెనలను పేల్చివేయాలను కున్నారు. బాలసోర్‌నుంచి మద్రాసుకు వెళ్ళే రైలు విషయం జతీంద్ర చూసుకోవాలి. బెంగాలు-నాగపూరు రైలుమార్గం విషయమై భోలానాథ్ చటర్జీని చక్రధర్ పూర్‌కు పంపారు. సతీష్ చక్రవర్తి తూర్పు రైల్వేమార్గంపై గల వంతెన పేల్చే నిమిత్తం అజయ్‌కు వెళ్ళాలి, నరేన్‌చౌధరి, ఫణీంద్ర చక్రవర్తి హతియాకు వెళ్ళి కొంత ఆయుధాన్ని స్వీకరించి, తూర్పుబెంగాలు జిల్లాలను అదుపులో పెట్టి కలకత్తాకు సాగిపోవాలి. నరేన్ భట్టాచార్‌జీ, విపిన్‌గంగూలీ ఆధ్వర్యాన కలకత్తా పార్టీ ముందుగా కలకత్తా చుట్టూవున్న ఆయుధాలనూ ఆయుధాగారాలనూ స్వాధీనం చేసుకుని, తరువాత విషయం కోటను పట్టుకొని, ఆ తరువాత కలకత్తా నగరాన్ని వశం చేసుకోవాలి. మేవారిక్‌లో వచ్చే జర్మన్ అధికారులు తూర్పు బెంగాలులో వుంటూ సైన్యాన్ని సమీకరించి శిక్షణ యివ్వాలి (సెడిషన్ కమిటీ రిపోర్టు పేజీ-122).

మేవరిక్ గానీ, సరుకుగానీ రాలేదు 20 రోజులు వేసిన అనంతరం కల కత్తా నుంచి రాయ్ మంగల్‌కు వెళ్ళిన విప్లవకారులు ఓడ రాకపోవడం, సరుకు చేరక పోవటంతో తిరిగి వచ్చారు. నరేన్, అతని సహచరులూ తీవ్రంగా నిస్పృహ చెందారు కాని చేయగలిగిందేమీ లేదు.

అనేక సందేశాలను భిన్న మార్గాలలో పంపించినప్పటికీ ప్రత్యుత్తరం లేకపోయేసరికి, కొత్తగా ఏర్పాట్లు చేసే నిమిత్తం నరేన్‌ని మళ్ళీ బటేవియాకు పంపాలనుకున్నారు. ఈ సారి భూభాగాల మీదుగా అయుధాలను జర్మనీ నుంచి చేరవేయటానికి కొత్త పథకాలు చర్చించే నిమిత్తం యితన్ని పంపాలని నిర్ణయించారు. రాయ్ తన స్మృతులలో యీ విషయం యిలా చిత్రించారు. ఓడలలో ఆయుధాలను రహస్యంగా చేరవేయాలనే ప్రయత్నం విఫలం కావటంతో చైనా నుంచి భూభాగం మీదుగా ఆయుధాలను తేవాలనే ప్రత్యామ్నాయ పథకంతో రెండవ సారి దేశం బయటకు పోయాను. ఇటీవల ఆబోరులు తిరుగుబాటు చేసిన సరిహద్దు ప్రాంతాల నుంచి ఆయుధాలను చేరవేయాలనుకున్నాను ఆయుధాల నిమిత్తం నేను విదేశాలకు వెళుతుండగా, మాలో తెలివిగలవారు కొందరు సరిహద్దులకు వెళ్ళి ఆబోరులను రెచ్చగొట్టి మళ్లీ తిరుగుబాటుకు పురికొల్పదలిచారు బయటనుంచి ఆయుధాలూ, తదితర వనరులతో సహాయ పడదలిచారు (మెమోయిర్స్ పేజీ-4).

నరేన్ వెళ్ళిపోగానే అతని పార్టీకి వీరోచిత నాయకుడైన జితేంద్రనాథ్ ముఖర్జీ అమరజీవి కావడంతో పార్టీకి విఘాతం వాటిల్లింది. బెంగాలు విప్లవోద్యమంలో బాలసోర్ పోరాటం పోలీసుకు వ్యతిరేకంగా జితేంద్ర జరిపిన సాహస కృత్యం చిరస్మరణీయమైనది. దీని ఫలితంగా దళాధిపతి మరణించటంతో వుద్యమానికి వెన్నుముక విరిగింది. అందులో నుంచి కోలుకొని మళ్ళీ కృషి ప్రారంభించటానికి చాలా సంవత్సరాలు పట్టింది. ఈలోగా ఆయుధాల అన్వేషణలో నరేన్ నిమగ్నమయ్యాడు. జర్మన్‌లు యీసారి అంతగా సహకరించలేదు. భార

తీయులు సంఘటితంగా లేరనీ, రహస్యాలు అట్టి పెట్టటం లేదనీ జర్మన్‌కౌన్సిల్ ఫిర్యాదు చేశాడు. 3, 4 పర్యాయాలు కౌన్సిల్‌తో మాట్లాడిన అనంతరం ఏమీ ముందుకు సాగటం లేదని నరేన్ గ్రహించాడు. జర్మన్‌లకు పంపేటందుకు మనుషులు లేరు. ఓడను యివ్వడానికి సిద్ధంగానూ లేరు.

తన స్మృతులలో మరొక ప్రయత్నాన్ని యిలా వర్ణించాడు. ఇండోనీషియానుంచి సహాయాన్ని తెచ్చేటందుకు మరో ప్రయత్నం చేసాను. సమాత్రా ఉత్తర కొనలోవున్న రేవువద్ద జర్మన్ ఓడలు వున్నాయి. వాటి సహాయంతో అండమాన్ దీవులపైబడి అక్కడి ఖైదీలను విడిపించి, వారిని సాయుధుల్ని చేసి, యీ విమోచన దళంలో ఒరిస్సా తీరానికి వెళ్ళాలి. ఓడలు ఆయుధాలతో వున్నాయి. వాటిని యుద్ధానికి వుపయోగించవచ్చు. వాటిలో అనేక తుపాకులు కూడా వున్నాయి. ఓడ సిబ్బందిలో నౌకాదళం వారుకూడా వున్నారు. వారంతా నిర్బంధం నుంచి తప్పించుకొని ఓడలను తీసుకొనిపోవాలి. కొన్నివందల రైఫిళ్ళనూ, యితర చిన్న ఆయుధాలూ, తగినంత మందుగుండు సామాగ్రి చైనా నుంచి చేరవేసే వారి దగ్గర స్వీకరించి ఓడలలో చేరవేయవచ్చు. ఇటువంటి తీవ్రమైన ఆలోచనకు జర్మనీ సిద్ధపడనందున పథకం విఫలమయింది. ఆయుధాలు కొనటానికి డబ్బు రాలేదు ఈ పథకాన్ని నిర్వహించమని ఉత్తరువులు యివ్వవలసిన వాడు జర్మన్‌కౌన్సిల్ జనరల్ అదృశ్యమై పోయాడు (మెమోయిర్స్. పేజీ-70)

నరేన్ చేసిన మరొకప్రయత్నం చాలా ఆశతో కూడినది. దీని వలన సన్‌యట్ సెన్‌తోనూ, చైనా విప్లవానికి సంబంధించిన యితర నాయకులతోనూ సంబంధం ఏర్పడింది. చైనా అంతటా పర్యటించారు. ఆ ప్రయత్నంలో ఒక రాత్రి తైంటిసిన్ అనే చైనా నగరంలో బ్రిటిష్ వారి అదుపులో నరేన్ వుండవలసివచ్చింది. బ్రిటిష్ కౌన్సిల్ జనరల్ న్యాయనిర్ణయం, నరేన్ స్వంత పథకం వలన ఆపద తప్పింది. 1915 చివరలో బర్మా, భారత సరిహద్దులలోని చైనా

రాష్ట్రాలు యునాన్, జెకుయాక్‌లలో తిరుగుబాటు వచ్చింది. రాజరికాన్ని స్థాపించాలనే యువాన్ పథకానికి వ్యతిరేకంగా యిది జరిగింది. తిరుగుబాటు దారులకు సమృద్ధిగా అయుధాలున్నాయి. అందులో కొన్ని భారత విప్లవ కారులకు సరిహద్దుల మీదుగా చేరవేయాలని నరేన్ సూచించాడు. సన్‌యట్ సెన్ యీ సూచనకు యిష్టపడి అయుధాలు కొనుగోలుకై జర్మన్ రాయబారినుంచి 5 మిలియన్ డాలర్లు తెమ్మని నరేన్‌ను అడిగాడు. డబ్బు సిద్ధంగా వుంటే సన్‌యట్‌సెన్ తన పక్షాన ప్రతినిధిని యునాన్‌కు పంపిస్తాడు. అక్కడ విలువైన సరుకును స్వీకరించటానికి నరేన్ వెళ్ళవచ్చు. కొన్ని సంవత్సరాల అనంతరం తన స్మృతులలో రాయ్ యిలా వ్రాసాడు. నా సాహస ధోరణికి బ్రహ్మాండమైన యీ పథకం బాగా నచ్చింది. కొన్ని మాసాలలో అయుధాలతో భారత సరిహద్దులలో తగినంత సైన్యాన్ని సమకూర్చాలనే ఆలోచన సాధించవచ్చునని అనుకున్నాను. (మెమోయిర్స్ పేజీ-7).

పథకం విఫలమయింది. అవసరమైనంత డబ్బును యివ్వడానికి చివరి క్షణంలో జర్మనీ సిద్ధపడలేదు. నరేన్‌కు ఆగ్రహం వచ్చింది. జర్మన్‌ల గురించి తన స్మృతులలో వ్రాస్తూ వారెన్నడూ తగినంత సహాయం చేయదలచలేదని భారత విప్లవకారులకూ అయుధాలివ్వాలనే జర్మన్ పథకం అంతా మోసపూరితం అన్నాడు. అంతటితో నరేన్ ఆయుధాల అన్వేషణ ఆగిపోయింది. ఆ తరువాత నూతన ప్రపంచంలో కూడా కొద్దిమాసాలపాటు వాటికోసం అతను చూడక పోలేదు.

జర్మన్ రాయబారి నరేన్‌ను బెర్లిన్ పంపిస్తూ నూతన ప్రపంచానికి దారి చూడుపా. అైనా ఆయుధాలను కొనడానికి నరేన్ కోరిన 5మిలియన్ డాలర్లు కేవలం ఉన్నతస్థాయి అధికారులు మాత్రమే అనుమతించగలరని రాయబారి అన్నాడు. కనుక బెర్లిన్‌కు వెళ్ళి యుద్ధానికి సర్వాధిపతీ, సర్వసేనాధిపతీ ముందు యీ పథకాన్ని వుంచమని నరేన్‌కు సలహాయిచ్చాడు. అప్పుడు చైనాలో జర్మన్ రాయ

బారిగా అడ్మిరల్ వాన్‌హిన్ట్జ్ వున్నాడు. నరేన్ బెర్లిన్ పోవడం సైనిక దృష్ట్యా ప్రయత్నించదగినదనీ ఉన్నతాధికారులు దీనికి అనుమతించవచ్చుననీ భావించి అతను సలహా యిచ్చాడు. (మెమోయిర్స్, పేజీ-14) నరేన్ ప్రయాణానికి ఏర్పాటు జేసి ఫాదర్‌మార్టిన్ పేరుతో పాస్‌పోర్టు యిచ్చి పాండిచేరి నివాసిగా మత విజ్ఞానాన్ని అధ్యయనం చేయడానికి పేరిస్ పోతున్నట్లు పేర్కొన్నాడు.

అప్పటికే తన నాయకుడూ, దళాధిపతీ జతీన్ ముఖర్జీ మరణించిన విషాద వార్త విప్లవోద్యమంలో తన సహచరులు చాలామంది పట్టుబడటం, దీర్ఘకాల శిక్షకు గురికావడం, రహస్యంగా దాక్కోవటం అతనికి తెలిసింది. ఆ ఉద్యమం కూడా విచ్ఛిన్నం కాజొచ్చింది. దేశానికి తిరిగి పోవాలని నరేన్‌కు అనిపించలేదు

3వ అధ్యాయం

# అమెరికా-మెక్సికో

ఎం. ఎన్. రాయ్‌గా మారనున్న నరేన్ 1916 జూన్‌లో అమెరికా పశ్చిమ తీరాన శాన్‌ఫ్రాన్‌సిస్కోలో అడుగుపెట్టాడు. అతనిరాక గమనించకుండా పోలేదు. స్థానిక పత్రిక యిలా వ్రాసింది నేడు నిప్పన్‌మరు ఓడ హాంకాంగ్ నుంచి ఒక మార్మిక వ్యక్తిని తెచ్చింది. పేరు మార్టిన్ అయినా, అతను హిందువు, ఉన్నత బ్రాహ్మణ కుటుంబము ఫ్రెంచి-ఇండియన్ రేవులో ఓడ ఎక్కానని, పారిస్‌కు అధ్యయనం నిమిత్తం వెళ్ళే ప్రయత్నంలో త్రోవలో వున్నానన్నాడు. అతను పేర్కొన్న చోట ఓడలేదని ప్రయాణీకులు ప్రకటించారు. అతను విప్లవ నాయకుడైనా కావాలి, లేదా బ్రిటిష్ ప్రభుత్వ పక్షాన వచ్చినవాడైనా అయివుండాలన్నారు.

(పొలిటికల్ ట్రబుల్ ఇన్ ఇండియా, 1907-1917 జేమ్స్ కాంప్ బెల్ కెర్, ఇండియన్ ప్రచురణ, కలకత్తా 1973 పుట-258).

ఈ ప్రచారం నరేన్‌కు యిష్టం లేదు. తన కార్యకలాపాలు ఎంత వృధా అయినవో అతనికి అనుభవం ద్వారా తెలిసింది. మరొక మార్గాన్ని అవలంబించాడు. అమెరికా, మెక్సికోలలో వుండగా అటువంటి మార్పు కలిగింది. అతనికి తెలిసిన భారతీయ మిత్రుని వద్ద, స్టాన్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం ఆవరణలో వున్నాడు. పాతను విస్మరించి, కొత్తజీవితాన్ని ఆరంభించడానికి అనువుగా పేరు మార్చుకోవలసిందిగా మిత్రుడు సూచించాడు. ఈ సూచనను నరేన్ అంగీకరించి, మానవేంద్రనాథ్ రాయ్‌అని పెట్టుకున్నాడు. మానవేంద్రనాథ్ నరేంద్రనాథ్

ఒకటే. రాయ్‌అనేదిమాత్రం భట్టాచార్యకు భిన్నమైంది. బెంగాలులో సర్వసాధారణంగా వుండే రాయ్ అనేది ఎందుకు జోడించాడో తెలుసుకునే అవకాశంలేదు.

స్టాన్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ ప్రాంగణంలో ఎం. ఎన్ రాయ్ ఆవిర్భవించాడు ఇది 'తన పునర్జన్మ' అని రాయ్ అన్నాడు. తన స్మృతులలో పేర్కొన్నట్లు, ఇంతటితో రాయ్ తన గత వృథాకార్యకలాపాలకుస్వస్తిపలికి, కొత్త సాహసాలను, సాధనలను చూడడానికి వీలుకలిగింది. కొత్త ప్రపంచంలో ఉత్సాహపూరిత పయనానికి అదేనాంది అని రాయ్‌వర్ణించాడు. [మెమోయర్స్ పుట 28] ఆయుధాల సేకరణ ప్రయత్నం చేయాలని, భారతదేశంలో తద్వారా విప్లవపోరాటాన్ని సాగించాలనే ధోరణి ఒకపట్టాన వదలలేదు అమెరికా మెక్సికోలలో కూడా అది వెన్నాడింది జర్మనులు యీ విషయమై పట్టుదలతో లేరని తెలిసినప్పుడు మాత్రమే వదలి, విస్తృత విప్లవధోరణి అలవరచుకున్నాడు.

పోలీసు అణచివేతవలన అప్పటికే భారతదేశంలో విప్లవ సంస్థలు చెల్లాచెదరయ్యాయి. ఒకవేళ రాయ్ ఆయుధాలు సేకరించినప్పటికీ, వాటిని వినియోగించగలిగే వారుకాదు.

స్టాన్‌ఫర్డ్‌లో రాయ్ చాలామంది విద్యావేత్తలను, రాజకీయ కార్యకర్తలను కలిశాడు. చాలామందితో స్నేహం చేశాడు. అందులో ఫలవంతమైనది ఎవిలిన్ ట్రెంట్ స్నేహమే. ఆమె అతనితో బాటు న్యూయార్క్ వెళ్ళి, అక్కడ రాయ్‌ని వివాహం చేసుకున్నది. రాయ్‌కు రాజకీయ సహచరిణి అయింది. అతనితో పాటు మెక్సికోకు, రష్యాకు వెళ్ళింది. రాజకీయ, సాహిత్యపరమైన కృషిలో రాయ్‌కు ఎంతో ఉపకారి అయింది. రాయ్‌తో కలసి కొన్ని గ్రంథాలు వ్రాసింది. శాంతిదేవి అనే మారుపేరుతో కమ్యూనిస్టు పత్రికలకు తరుచు వ్రాసింది. 1926లో విడిపోయే వరకూ యిరువురూ కలసి పని చేశారు.

న్యూయార్క్‌లో చాలామంది అమెరికన్ సోషలిస్టులు, అభ్యుదయ వాదులతో రాయ్‌కు సంబంధం ఏర్పడింది. భారత జాతీయ నాయకుడు లాలా లజపతి

రాయ్‌తో పరిచయమైంది. ఇరువురూ మంచి మిత్రులయ్యారు. సోషలిజాన్ని ఒక పద్ధతిలో న్యూయార్కులో రాయ్ అధ్యయనం చేశాడు త్వరలోనే తాను సోష లిస్టుగా మారినట్లు గ్రహించాడు. సోషలిజాన్ని ఎదుర్కోవాలని అధ్యయనం ప్రారంభించాడు తొలుత సోషలిజంలోని భౌతిక తత్వాన్ని రాయ్ అంగీకరించ లేదు. తరువాత మెక్సికోలో తనను కలసి, స్నేహితుడైన రష్యా విప్లవ నాయ కుడు మైకేల్‌బరొడిన్ మార్గదర్శకత్వాన రాయ్ ఈ తత్వాన్ని ఆమోదించాడు. జాతీయవాదం నుంచి సోషలిజానికి మార్పు అనేది రాయ్ రాజకీయ జీవితంలో పెద్ద సంఘటన. బంకించంద్ర వివేకానంద, సనాతన హిందూ తత్వం ఆధా రంగా వున్న తన గతం నుంచి తీవ్రంగా విభేదించాడు

విప్లవం నిమిత్తం రాయ్ కృషి సాగించాడు తీవ్ర జాతీయవాదిగా కోరిన విప్లవానికి, సోషలిజానికి మారిన తరువాత ఆశించిన విప్లవానికి మౌలికమైన తేడా వుంది. మొదటిది కేవలం బ్రిటిష్ పాలన పోగొట్టడానికే వుద్దేశించగా, మరొకటి కొత్త సాంఘికవ్యవస్థను ఆశించింది. కొద్దిమంది సాహస విప్లవకారు లతో సాధించాలని జాతీయ వాదం భావించగా, మరొకటి ప్రజా పక్షకార్యమూలం గా వస్తుందన్నారు. ఆర్థిక శక్తుల చర్యల ఆధారంగా సోషలిజం వుంటే, దీనిని బొత్తిగా అశ్రద్ధ చేసింది జాతీయవాదం. వివేచనాయుత భౌతిక దృక్పధాన్ని సోషలిజం కోరగా, విప్లవకారులలో గాని, ప్రజలలో గాని మానసిక సాంఘిక దృక్పథం మారాలని జాతీయవాదం కోరలేదు. సోషలిజానికి ఒక్కసారిగా రాయ్ చేరుకోలేదు. ఇది క్రమేణా జరిగింది. కాని సోషలిజం నుంచి కమ్యూనిజా నికి మాత్రం మెక్సికోలో మరసటేడు అతివేగంగా పయనించాడు. సోషలిజం లక్ష్యానికి చేరుకోవడానికి నాడు కమ్యూనిజమే శరణ్యంగా వున్నది

న్యూయార్క్‌లో రాయ్ సోషలిజాన్ని అధ్యయనం చేయడం హఠాత్తుగా ఆగిపోయింది. 1917 జూన్‌లో అమెరికా యుద్ధంలో దిగగానే, శాన్ ఫ్రాన్ సిస్కోలో పెట్టిన హిందూ, జర్మనీ కుట్రకేసులో రాయ్ చిక్కుకున్నాడు.

ఇందులో అమెరికనులు, జర్మనులు, భారతీయులు మొత్తం వందమంది వున్నారు. జాతివ్యాపితంగా కుట్రలో పాల్గొని అమెరికా తటస్థతను అధికమించారు. కైజర్ దీనికి ఆర్థిక సహాయం చేశాడు. జర్మనీ విదేశ కార్యాలయంద్వారా యిది అందుతున్నది భారతదేశం తిరుగుబాటు తేవడానికి, యుద్ధంలో జర్మనీకి సహాయపడడానికి, గ్రేట్‌బ్రిటన్ తన దళాలను ఐరోపానుంచి యితర చోట్ల జరిగే తిరుగుబాట్లను అణచే నిమిత్తం దారి మళ్ళించడానికి యిదంతా వుద్దేశించారు. అని కేసులో ఆరోపణ చేశారు. [కమ్యూనిజం అండ్ నేషనలిజం ఇన్ ఇండియా, జాన్ పేట్రిక్ హెత్‌కాక్స్, ప్రిన్సిటన్ యూనివర్శిటీ ప్రెస్, 1971 పుట 8).

లజపతిరాయ్ మాట్లాడిన ఒక సమావేశానికి వెళ్ళి వస్తుండగా కొలంబియా విశ్వవిద్యాలయ ప్రాంగణంలో రాయ్‌ను అరెస్టు చేశారు. ఆ రాత్రి జైలులో గడిపాడు. ఉదయం లేస్తూ, పగలు టౌన్‌హాలులోని గ్రాండ్ జూరీ ఎదుట హాజరు కావాలన్నారు, అమెరికా ప్రవాస నియమాలను ఉల్లంఘించినందుకు గ్రాండ్ జూరీ ఆగ్రహించి, విచారణ జరపడానికి వీలుగా వ్యక్తిగత పూచీపై విడుదల చేశారు మళ్ళీ అక్కడ అడుగు పెట్టరాదని రాయ్ నిర్ణయించుకున్నాడు. తరువాత తన స్మృతులలో యిలా వ్రాశాడు. జైలులో పడడం : ప్లవకారుడి ధర్మంగా యింకా భావించే స్థితి రాలేదు దీనికి కారణాలు లేకపోలేదు. గాంధీ ప్రవేశించక పూర్వం రాజకీయ నేరాలకి జైలుపాలైతే, ప్రభుత్వ గౌరవాదరణలేదు సరిగదా ఎన్నో కష్టాలు ఎదుర్కొవలసి వచ్చేది. దేశభక్తిని అగ్నిపరీక్షకు గురిచేసేవారు. సహజంగా, నాటి విప్లవకారులు సాధ్యమైనంతవరకు జైలు తప్పించుకోవడానికే చూసేవారు. కొందరు ఉరికంబాలకు పోవడానికి వెనుకాడేవారుకాదు. (మెమోయర్స్ పుట 48).

చెప్పకుండా పోవడం రాయ్‌కు కొత్తకాదు. భారతదేశంలో చాలా పర్యాయాలు చేశాడు. అదే మళ్ళీ చేయాలనుకున్నాడు. సోషలిస్టు మిత్రులవలన మెక్సికో గురించి విన్నాడు. అక్కడ సాంఘిక విప్లవం జరుగుతున్నట్లు, ఒక

ప్రాంతమైన యుకటాన్‌లో సోషలిజాన్ని స్థాపించడాన్ని తెలుసుకున్నాడు. ఆ రాష్ట్ర గవర్నర్ జనరల్ అల్వెరాడోకు పరిచయ లేఖ తీసుకున్నాడు. మనసులో నిర్ణయం తీసుకున్నాడు. మెక్సికోకు పారిపోదలచాడు. సరిహద్దు వందలమైళ్ళున్నప్పటికీ అంతశ్రద్ధగా కాపలా కాయడంలేదు న్యూయార్క్ పోలీసుల కనుకప్పి రెండురోజుల రైలు ప్రయాణం అనంతరం మెక్సికోలో అడుగుపెట్టాడు.

1917 జూలైలో రాయ్ మెక్సికోకు చేరుకున్నాడు. అమెరికా నుంచి బెయిల్ తప్పించుకొని వచ్చిన అజ్ఞాతవ్యక్తిగా, భారతదేశంలో దోపిడీలు యితర నేరాలు చేసిన వ్యక్తిగా రాయ్‌పై ఆరోపణలు వున్నాయి. నాటి యుద్ధపు రోజులలో అధికారికంగా మెక్సికో తటస్థంగా వున్నది. కానీజర్మనీపట్ల సానుభూతిచూపింది. అమెరికానుంచి వచ్చిన రాజకీయ నేరస్తులను దయతో చూసింది. గ్రేట్‌బ్రిటన్‌కు వ్యతిరేకమైన వారిని కూడా ఆలాగే పరిగణించింది. తమదేశంలో ప్రవేశించడాన్ని నిరాకరించనందున, అటువంటి వారికి మెక్సికో సురక్షిత స్థావరమైంది.

మెక్సికోలో రాయ్‌కు స్నేహితులు లేరు. డబ్బులేదు. యుకటాన్ రాష్ట్ర గవర్నర్ జనరల్ అలవారాడోకు పరిచయ లేఖ మాత్రం వున్నది. ఇది మెక్సికో నగరానికి చాలా దూరం, యించుమించు అందుబాటులో లేదనే చెప్పవచ్చు పరిచయ లేఖ వలన మెక్సికో ఉన్నత పాలక వర్గాలలో ప్రవేశించడానికి రాయ్‌కు అవకాశం లభించింది. జావాలో జర్మనీసైనిక అధికారులతో ఏర్పడిన పరిచయం వలన రాయ్‌కు బాగా ధనం సమకూరింది. ఈ రెండు సౌకర్యాలతో రాయ్ మెక్సికోలో జీవితం ఆరంభించాడు ఆ దేశ రాజకీయ జీవితంలో తాను పెద్ద పాత్ర నిర్వహించనున్నట్లు రాయ్‌కు అంచవలేశమైనా తెలియదు. ఏ ప్రమాణాన్ని బట్టి చూసినా ఆ దేశంలో రాయ్ పాత్ర పెద్దదే. విశిష్టమైనది కూడా. రాజకీయ అజ్ఞాత వ్యక్తిగా కొత్తగా ప్రవేశించిన వ్యక్తి అటువంటి పాత్ర నిర్వహించడమే అందుకు కారణం.

చేరిన వారంలోగానే, తాను ఇండోనేషియాలో కలిసిన యిరువురు జర్మన్ అధికారులను రాయ్ కలుసుకున్నాడు, నరేన్‌గా చైనాలో ఆయుధాలు కొని భూభాగం మీదుగా భారతదేశానికి చేరవేయాలని రాయ్ వేసిన పథకం గురించి చర్చ జరిగింది. ఆ పథకాన్ని ఆమోదించి, రాయ్‌ను చైనాకు వెళ్ళమన్నారు. వెళ్ళడానికి ఆసక్తి చూపని రాయ్, కేవలం అలవాటు చొప్పున వెళ్ళడానికి ఒప్పుకొన్నాడు. రాయ్ వెళ్ళవలసిన జపానుస్టీమరు రానందున ఆ పథకం విఫలమైంది. రాయ్ మళ్ళీ మెక్సికో నగరానికి తిరిగివచ్చాడు. తాను చేయదలచిన రాజకీయ కృషికై ప్రయత్నాలు సాగించాడు.

జర్మనీ అధికారులతో సంబంధంవలన రెండువిధాల, రాయ్‌కు మేలుచేకూరింది. మెక్సికో పాలక వర్గాలలోనూ, అధ్యక్షుడి వద్ద అతనికి ప్రవేశం లభించింది. ధనం చాలా లభించింది. చైనాలో కృషికై యీ ధనం ఉద్దేశించారు. చైనాలో యిటువంటి కృషి అసంభవం అని తెలుసుకున్న అనంతరం ఆ ధనాన్ని జర్మన్‌లకు తిరిగి యిచ్చి వేయాలని రాయ్ కొన్నాళ్ళు అనుకున్నాడు. చివరకు తానే అట్టిపెట్టుకోవాలనుకున్నాడు. అదొక నైతిక సమస్యగా పరిణమించింది. విప్లవం కోసరం ఆ ధనాన్ని వినియోగించదలచుకొని సమస్యను పరిష్కరించాడు. వాస్తవానికి చేసింది కూడా అదే. మెక్సికోలో సోషలిస్టు పార్టీని పెంపొందించడానికి, బరోడిన్‌కు సహాయ పడడానికి, వాషింగ్‌టన్‌లో రష్యా వాణిజ్య మిషన్‌కు ఉపయోగించాడు. రాయ్ తన స్మృతులలో యిలా వ్రాశాడు. ఆర్థికంగా నేను బోల్షివిక్‌లకు సహాయపడడంతో నా సంబంధం మొదలైంది ... బోల్షివిక్‌లు అధికారాన్ని హస్తగతం చేసుకోవడంతో, రష్యాలోని బంగారం ప్రపంచంలో నలుమూలలకూ, కమ్యూనిస్టు ఉద్యమవ్యాప్తికై వినియోగించారు. కనీసం ఒక్కసారైనా దీనిని నేను తిరగేయడం జరిగిందన్న మాట. [మెమోయిర్స్ పుట 199] కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో తానున్న తొలి సంవత్సరాలలో, రాయ్ నుంచి వచ్చిన ఆర్థిక సహాయానికి కృతజ్ఞత చెప్పారు.

3)

రాయ్ మెక్సికో చేరేనాటికి, జనరల్ వెనుస్టియానా కరంజా తన ఆధిక్యతను వ్యవస్థాపించి దేశానికి అధ్యక్షుడయ్యాడు. అంతర్యుద్ధం అంతమైనది గాని దేశంలో యింకా గందరగోళ స్థితి తగ్గలేదు. కేంద్ర ప్రభుత్వ ఆధిపత్యం ఇంకా కొన్ని ప్రాంతాలలో సరిగా స్థిరపడలేదు. అధ్యక్షుడు కరంజా కొత్త రాజ్యాంగాన్ని ప్రకటించాడు. దీని వలన ప్రజలకు కొన్ని హక్కులు లభించాయి, కార్మిక కర్షకుల అసక్తులు కొన్ని తీరాయి. ప్రభుత్వం ప్రజాదరణ చూరగొన్నది. అయితే ఏ ఒక్క ప్రజా సంస్థ మద్దత్తూ దీనికి లేదు. రాయ్ చేరిన కొన్నాళ్ళకే, అమెరికా దండయాత్ర ప్రమాదం వాటిల్లగా, అటువంటి మద్దత్తు అవసరమైంది. ప్రజల మద్దత్తును సమీకరించడంలో రాయ్ ప్రభుత్వానికి ఎంతో సహాయకారి అయ్యాడు.

ప్రభుత్వానికి అనధికార పత్రిక అయిన ఎల్ పాబ్లో అనే ప్రముఖ దినపత్రికకు వ్యాసాలు వ్రాయడంతో రాయ్ తన రాజకీయ కృషి అరంభించాడు. వ్యాసాలను ఇంగ్లీషులో వ్రాయగా, ఆ దేశ భాష అయిన స్పానిష్‌లోకి అనువదించేవారు. ఉదార రాజకీయ వాదులు, సాంఘిక కార్యకర్తలు యీ వ్యాసాల వలన రాయ్‌పై శ్రద్ధ వహించారు. మెక్సికో నగరంలో సోషలిస్టుల మనుకునే వారు కొందరున్నారు. అయితే వారిని సోషలిస్టులు అనేకంటే అనార్కిస్టులు లేక సిండలిస్టులు అనవచ్చును.

వారికి రాజకీయ చర్యలో గాని, దేశ రక్షణలో గాని నమ్మకం లేదు. మధ్యతరగతి మేధావులతోనూ వారికి సంబంధంలేదు. రాయ్ వారికి పాఠాలు నేర్పవలసి వచ్చింది. సంఘటనలపై ప్రభావాన్ని చూపెట్టే నిమిత్తం, విస్తృత ప్రాతిపదికపై రాజకీయ పార్టీ ఏర్పాటుకై ఆలోచించడానికి వారిని పురికొల్పాడు. ఈ కృషిలో రాయ్‌కు అండగా అమెరికానుంచి వచ్చిన శరణార్థ సోషలిస్టులు, శాంతి కాముకులు బాగా తోడ్పడ్డారు సామ్రాజ్య వాదయుద్ధంలో పాల్గొనడం వారికి యిష్టం లేదు. కొద్దిమాసాలలోనే సోషలిస్టు పార్టీ ప్రారంభించడానికి పరిస్థితి అనుకూలించింది. 1917 డిసెంబర్‌లో ఒకమహాసభను మెక్సికో నగరంలో

జరిపి, సోషలిస్టు పార్టీని స్థాపించారు. రాయ్‌ను ప్రధాన కార్యదర్శిగా మహాసభ ఎన్నుకున్నది. అతను విదేశీయుడని ఎవరూ గుర్తించనంతగా పార్టీని సృష్టించడంలో రాయ్ కృషి వుంది. ప్రతివారూ యీ ఎన్నికను ఆహ్వానించారు. భారతీయ మిత్రుడికి అంతటి వున్నత గౌరవాదరణ లభించింది.

పార్టీ మహాసభ సోషలిస్టు కార్యక్రమాన్ని ఆమోదించి, ప్రజల సంక్షేమానికై అనేక చర్యలు తీసుకోమంటూ ప్రభుత్వాన్ని కోరింది. అమెరికా దండయాత్ర జరిపితే ప్రభుత్వానికి చేయూత నిస్తామంటూ పేర్కొన్నారు. రాయ్ వేసిన పథకమే యిదంతా. అధ్యక్షుడి నుంచి రాయ్‌కు హామీ లభించడమే గాక, కార్మిక కర్షకుల తక్షణావసరాలను తృప్తి పరచడానికి అన్నిచర్యలూ తీసుకునేటట్లు, ఉదార విధానాన్ని అవలంబిస్తామన్నారు.

మహాసభ జరిగిన అనంతరం, సోషలిస్టు పార్టీ నాయకుడు ప్లుటారో్క ఎలియాస్ కాలెస్‌ను కార్మిక మంత్రిగా స్వీకరించి, ప్రభుత్వ సానుభూతి ధోరణిని చూపారు. ఈ నియామకం వలన రాయ్‌పై అదనపు భారం పడింది. కార్మిక శాసనాన్ని రాయ్ రూపొందించడమే కాకుండా సమ్మెలకు సిద్ధపడుతున్న కార్మికులను ఓదార్చే నిమిత్తం కార్మికమంత్రి వెంట వివిధ ప్రదేశాలకు వెళ్ళవలసి వచ్చింది. దీనితో బాటు పార్టీ పత్రికను నిర్వహించడం. పార్టీ వ్యవస్థను కట్టుదిట్టం చేయడం కూడా జరిగింది. సోషలిస్టు పార్టీ కార్యకలాపాల వలన ప్రభుత్వ సామాజిక ప్రాతిపదిక బలపడి విస్తరించింది. ప్రభుత్వానికి అండగా ప్రజలు సమీకృతులు కావడంతో, విదేశీ దండయాత్ర ప్రమాదం తప్పింది. జాతీయ, అంతర్జాతీయ పరిస్థితిలో యిటువంటి అనుకూల మార్పునకు పూర్తిఖ్యాతి, ప్రభుత్వ పక్షాన, అధ్యక్షుడి తరపున రాయ్‌కే దక్కింది.

సోషలిస్టు పార్టీని స్థాపించడంలో నిర్విరామంగా రాయ్ కృషి చేస్తుండగా మెక్సికో నగరానికి ఒక మార్మిక వ్యక్తి వచ్చాడు. రష్యా బోల్షివిక్ పార్టీ నాయకులలో ఒకరైన మైకేల్ బరోడిన్ అతను. రహస్య పనిమీద నూతన

ప్రపంచానికి చేరుకున్నాడు. రాజుకు చెందిన అత్యంత విలువైన నగా నట్రా యిచ్చి, వాటిని అమ్మగా వచ్చిన ధనంతో వాషింగ్‌టన్‌లో వాణిజ్య కార్యకలాపాలు కొనసాగించమని, అమెరికాలో కమ్యూనిస్టు ఉద్యమాన్ని పెంపొందించమని అతన్ని మాస్కో పంపింది. సూట్‌కేసుల అడుగున జాగ్రత్తగా నగలను బరోడిన్ దాచిపెట్టాడు. చికాగో లోని తన భార్యకు అందజేయమని వాటిని ఒక ఆస్ట్రియన్ సైనికాధికారికి అప్పగించాడు. కారణాంతరాలచే అతను ఒక ఏడాది వరకూ ఆపని చేయలేకపోయాడు. బరోడిన్ న్యూయార్క్‌లో చిక్కుకపోయాడు. అరెస్టు తప్పించుకోవడానికి అక్కడి నుంచి వెళ్ళ వలసి వచ్చింది. ఆ పరిస్థితులలో మారు పేరుతో, ఒట్టి చేతులతో మెక్సికో చేరుకున్నాడు. మెక్సికో నగరంలో సోషలిస్టు పార్టీ, దాని హిందూ ప్రధాన కార్యదర్శి గురించి తెలుసుకున్నాడు. వెతికి రాయ్‌ను కలిశాడు. ఆ సమావేశం రాయ్ రాజకీయ జీవితంలో మలుపు తిరగ డానికి తోడ్పడింది.

బరోడిన్ యిబ్బంది తెలుసుకొని, తనతో వుండవలసిందిగా రాయ్ ఆహ్వానించాడు. ఆర్థిక చిక్కులనుంచి కూడా రాయ్ అతన్ని తప్పించాడు. చికాగోలోని బరోడిన్ భార్యకు, వాషింగ్టన్‌లోని రష్యన్ వాణిజ్య కేంద్రాలకు రాయ్ డబ్బుపంపాడు. జర్మన్‌లనుంచి లభించిన ధనాన్ని, రాయ్ ఆవిధంగా భౌతిక వాదంలో లోతుపాతులు, యూరోపా నాగరికత ఔన్నత్యం, కళ సంస్కృతులను గ్రహించడం బరోడిన్ వద్ద రాయ్ నేర్చాడు. ప్రపంచ వ్యాప్తంగా సాంఘిక విప్లవ ఆవశ్యకత, దీనికి గాను ఎత్తుగడలు, వ్యూహాలు కూడా రాయ్ యితని వద్ద నేర్చాడు.

బరోడిన్‌ను అధ్యక్షుడు కరంజాకు ప్రభుత్వంలో ప్రముఖులకు రాయ్ పరిచయం చేశాడు. బరోడిన్ వారికి నచ్చచెప్పి, రాయ్ కృషితో రష్యా ప్రభుత్వ కార్యకలాపాలకు, కొమింటర్న్‌కు సౌకర్యాలు సమకూర్చడంలో కృతకృత్యుడయ్యాడు. మెక్సికోలో రాయ్ స్థితి వలన, నూతన ప్రపంచంలో బోల్షివిక్‌లకు స్థానం లభించింది. తనకు అప్పగించిన కృషిని బరోడిన్ సాధించాడు. రాయ్ తోడ్పాటు లేనిదే యిది జరగదని బరోడిన్‌కు తెలుసు,

రష్యా విప్లవ వార్త ప్రపంచంలో వ్యాపించి చాలా దేశాలలో పరిస్థితిని మార్చి వేసింది రష్యా విప్లవానికి మద్దతు ప్రకటించి కమ్యూనిస్టు-ఇంటర్నేషనల్‌కు అనుబంధం కావాలని సోషలిస్టు పార్టీలో ఒత్తిడి వచ్చింది. పార్టీ ప్రధాన కార్యదర్శికి అతిథిగా బోల్షివిక్ ప్రతినిధి నగరంలోనే వున్న వార్త పొక్కగానే వత్తిడి యింకా పెరిగి పోతుంది. కమ్యూనిస్టు పార్టీగా రూపొందే నిమిత్తం ఒక అసాధారణ పార్టీ మహాసభ జరపాలని సూచన వచ్చింది. కొద్ది రోజులు అనంతరం మహాసభ జరిగింది రాయ్ అధ్యక్షత వహించాడు. పార్టీ పేరు మార్చాలని మహాసభ నిర్ణయించింది. రష్యా వెలుపల తొలి కమ్యూనిస్టుపార్టీ వెలసింది కొమింటర్న్ జారీ చేసిన ప్రణాళికనే పార్టీ ఆమోదించింది. పార్టీని కొమింటర్న్‌కు అనుబంధం గావించింది. మరుసటి సంవత్సరం మాస్కోలో జరుగనున్న కొమింటర్న్ ద్వితీయ సమావేశానికి ప్రతినిధి వర్గాన్ని పంపాలని నిర్ణయించారు. ప్రతినిధుల పేర్లు ప్రకటించలేదు, కాని అందులో రాయ్ ఒకరు అని తేలింది.

రాయ్ మాస్కోను సందర్శించడానికి బరోడిన్ రంగం సిద్ధం చేశాడు. రాయ్ కృషి గురించి అతను నివేదికలు పంపిస్తుండేవాడు. రాయ్ ద్వితీయ సమావేశానికి వచ్చి రష్యావిప్లవ నాయకులను కలుసుకోవాలని బరోడిన్ ఆతురత చూపాడు. ఈ ఆహ్వానంతో రాయ్‌కు కొత్త అవకాశాలు లభించాయి. తమ దేశంలో విప్లవాన్ని సాధించిన వారి మధ్య వుంటూ ప్రపంచ విప్లవానికి కృషి చేసే అవకాశం లభించింది. ఇది చాలా ఆకర్షణీయమైన అవకాశం. కాని ఒక నిర్ణయానికి రావటం రాయ్‌కి అంత సులభం కాదు. మెక్సికో అతని పట్ల చాలా దయతో వ్యవహరించి ఆతిథ్యం యిచ్చింది. భారతదేశంలో అవకాశంలేని రాజకీయ కృషిచేయడానికి యిక్కడ అవకాశంలభించింది. అతనికెందరో మిత్రులయ్యారు. తాను వెళ్ళిపోవాలనే నిర్ణయం వారికి అసంతృప్తిని కలిగిస్తుందని రాయ్‌కు తెలుసు. అయితే ఒక ఆశ మాత్రం వున్నది. మాస్కో భారతదేశానికి దారిలో వున్నదనీ, మాస్కోనుంచి అవకాశం లభించినప్పుడు మన దేశానికి వెళ్ళి విప్లవ కృషి మళ్ళీ ఆరంభించవచ్చుననీ బరోడిన్ వివరించాడు. అంతటి

తో సమస్య తేలి పోయింది. అధ్యక్షుడు కరంజా తదితరులను సంప్రదించి రాయ్ వారి అనుమతి పొందాడు.

1919 నవంబరులో రాయ్ మెక్సికోను వదలి వెళ్ళాడు. దౌత్య ప్రతినిధి పాస్‌పోర్ట్ రాయ్‌కు ఏర్పాటు చేసారు. అతనికి అవసరమైన సహాయాన్ని అందివ్వాలని ఐరోపాలోని మెక్సికో ప్రతినిధులకు సూచించారు. అతనితోపాటుమెక్సికోలో వున్న ఎవిలిన్ రాయ్అతని వెంట మాస్కోకు బయలుదేరింది

తన స్మృతులలో రాయ్, మెక్సికో ఆదరణకు, దయకు కృతజ్ఞత తెలుపుతూ, హృదయం కదిలించేటట్లు రెండున్నర సంవత్సరాలలో అక్కడున్నంత కాలం తనలో వచ్చిన మార్పును వివరించాడు అతనిలా వ్రాసాడు. 'నేను వెళ్ళవలసిన రోజు సమీపించేసరికి ఏదో పోగొట్టుకుంటున్న భావన ఎక్కువయింది. రెండున్నర సంవత్సరాలే మెక్సికోలో వున్నప్పటికీ చిన్నప్పటినుంచీ వున్నట్లు అనిపించింది. వ్యక్తిగతంగా నాకు ఎక్కువమంది సన్నిహిత స్నేహితులు లేరు. మెక్సికో-అతి పోకడ, సంప్రదాయాల బరువు-భారాలూ కపటంతో కూడినవి కాకపోయినా నా ధోరణికి అట్టే సరిపడవు. అయినప్పటికీ ఆ దేశం చాలా ఆదరణతో చూసిందనే చెప్పాలి. అనుకున్న దానికంటే ఎక్కువగా ప్రభుత్వం స్నేహాన్ని చూపింది. కృతజ్ఞతతో నేను చేసిన చిన్న సేవకు మించిపోయి వారు నాకు తోడ్పడ్డారు. అనేకమంది ఎంతో అభివృద్ధి చెందిన వ్యక్తులు నన్ను దయతోనూ, ఆదరంతోనూ చూశారు. ఇది చాలా గొప్ప అనుభవం ఒకవిధంగా మెక్సికో నాపునర్జన్మకు తోడ్పడిన భూమి అనవచ్చు. అక్కడకు చేరుకునేముందు తొలి జీవితంలోని నా భావాలూ, అభిప్రాయాలపట్ల అసంతృప్తి ఆరంభమయింది మెక్సికోలో నేను వుండగా, కొత్త దృక్పథం స్పష్టపడింది. నిస్సారమైన గతం, అసంతృప్తిస్థానే భవిష్యత్తులో సాగిపోవడానికి మార్గదర్శకత్వం కనిపించింది. ఇది కేవలం రాజకీయ భావాలూ,విప్లవాదర్శాలలో మార్పు మాత్రం కాదు జీవితంలోనే కొత్తదృక్పథం వచ్చింది. నాలో అంతం ఎరుగని తాత్విక విప్లవం బయలుదేరింది. జీవితంలో వచ్చిన యీ మౌలిక మార్పు నేను పునర్జన్మ ఎత్తిన గడ్డను

అంటి పెట్టుకొని వుండే వుద్వేగ ధోరణి అధిగమించటానికి తోడ్పడింది. నా పునర్జన్మ దేశాన్ని మేధస్సుతో స్వేచ్ఛా పరుడుగా కొత్త విశ్వాసంతో వదిలేసాను. ఆర్థిక విమోచన, సాంఘిక న్యాయం లేకుండా, రాజకీయ స్వేచ్ఛను నమ్మేస్థితిలో లేను అయితే సంప్రదాయం, పెత్తందారీ బంధాలనుంచి స్వేచ్ఛ అనేది-మేధస్సుతో కూడిన స్వేచ్ఛ, సాంఘిక విమోచనకు సరైన పోరాటం సాధించే నిమిత్తం తోడ్పడుతుందని నేను గ్రహించాను. (మెమోయిర్స్, పేజీ: 219).

4వ అధ్యాయం

# కొమింటర్న్‌తో

మాస్కోకు ప్రయాణం అంటే రాయ్‌కు తీర్థయాత్రవలె అనిపించింది. అప్పటికే దృఢమైన కమ్యూనిస్టుగా మారి మాస్కోను మార్గసూచిక కేంద్రంగా ప్రపంచ విప్లవాన్ని నడిపేదిగా అమోదించి, తన జీవితాన్ని అందుకు అంకితం చేయాలని రాయ్ ప్రమాణం చేసాడు. భారతదేశంలో విప్లవ కృషి సాగించాలని అత్రుత వహిస్తున్నప్పటికీ మాస్కో కేంద్రీకృతమైన ప్రపంచ విప్లవ సంస్థ మార్గదర్శకత్వంలో యీకృషిని సమర్ధవంతంగా సాగించవచ్చని రాయ్ భావించాడు. ప్రపంచ విప్లవ సైన్యంలో తానూ ఒక సైనికుడుగా చేరడానికి అక్కడకు పోవాలనుకున్నాడు. మొదటి ప్రపంచ యుద్ధం అంతం కాగానే రష్యాలో విప్లవం సఫలమైన ఆ రోజులలో, రష్యాపట్ల ఆకర్షితులై, పవిత్ర విప్లవ భూమిలో తమ సేవలను కొనసాగించాలనే వారిలో రాయ్ ఒక్కడే లేడు. సామాజిక విప్లవ నిమిత్తం అంకితమైన వందలాది ఉన్నత వ్యక్తులు యిటువంటి తృప్తితో మాస్కోకు వెళ్లారు. చాలామంది తాము చూసిన దానితో నిస్పృహ చెంది ముఖ్యంగా ఉత్తరోత్తరా పరిణామాల వలన కమ్యూనిష్టు ఉద్యమం నుంచి విరమించారు. రాయ్ కూడా నిరుత్సాహపడి కమ్యూనిస్టులతో తెంచుకున్నప్పటికీ అది ఒక దశాబ్దం తరువాత గాని జరుగలేదు.

ఆ రోజులలో రష్యాకు పోవడం సులభంకాదు. ఐరోపాలో కూడా ఒక దేశం నుంచి మరో దేశానికి పోవడం అంత సుకరం కాదు. యుద్ధ సమయంలోని అదుపులింకా అమలులోవున్నాయి. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ (కొమింటర్న్) ద్వితీయ సమావేశానికి వెళ్ళే ప్రతినిధులందరూ బెర్లిన్‌లో సమావేశం

కావాలనీ, అక్కడ నుంచి రష్యాకు తీసుకుపోవాలనీ ఏర్పాట్లు జరిగాయి. తదనుగుణంగానే 1919 డిశంబరు చివరలో రాయ్ బెర్లిన్ చేరుకున్నాడు. [ఈ సమాచారమంతా రాయ్ స్మృతులలోనిదే] అంతకు ముందు స్పెయిన్‌కు వెళ్ళి బరోడిన్ సూచించినట్లు సోషలిస్టు పార్టీ నాయకులను కలుసుకున్నాడు. అనార్కిస్ట్ (అరాజకవాదము) సిండికలిస్ట్ (కార్మికసంఘ పెట్టుబడి ఉద్యమం) ముఠాలను ద్వితీయ సమావేశానికి రావలసిందిగా నచ్చజెప్పారు. 1919 ఏప్రిల్‌లో మాస్కోలో కొమింటర్న్ స్థాపించినప్పుడు ప్రథమ సమావేశం ప్రాతినిధ్యంతో కూడిందికాదు. ఐరోపాలో సోషలిస్టు ముఠాల హాజరుకూడా చాలా స్వల్పంగా వున్నది. ద్వితీయ సమావేశం ఎక్కువ ప్రాతినిధ్యంతో కూడిందిగా చేయాలని నిర్ణయించారు. స్పెయిన్‌లో సోషలిస్టు ముఠాల మద్దతుకై ప్రచారం చేసే కృషిని రాయ్‌కు అప్పగించారు.

మాస్కో తీసుకవెళ్ళటానికి ముందు బెర్లిన్‌లో రాయ్ నాలుగు మాసాలు గడపవలసి వచ్చింది. ఆ సమయంలో జర్మనీ స్థితి గతులను అధ్యయనం చేస్తూ-సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీల నాయకులను కలసి సిద్ధాంత రీత్యానూ, ఆచరణ పూర్వకమైన సమస్యలను వారితో చర్చించారు. రాయ్ బెర్లిన్ చేరే నాటికే కైజరు సామ్రాజ్యం కూలి పోయింది. కొద్ది మాసాల పాటు అంతర్యుద్ధం, అరాచకత్వం, భయంకర వాతావరణం అనంతరం సోషల్-డెమోక్రాటిక్ పార్టీ అధికారంలోకి వచ్చింది. ఇది తిరుగులేని అధికారమేమీ కాదు. రాయ్ బెర్లిన్‌లో వున్నప్పుడే సైన్యంలో కుట్ర జరిగింది. కాప్ పుష్ అని చరిత్రలో పేర్కొంటున్న యీ కుట్ర 1920 మార్చిలో జరిగింది. సైన్యంలో ఒక దళం బెర్లిన్ పైకి పోయి నగరాన్ని ఆక్రమించుకున్నారు. దిక్కుతోచక ప్రభుత్వం పారిపోయింది. కార్మికులు పరిస్థితిని కాపాడారు. వారు సమ్మె చేశారు. సమ్మెతో పూర్తిగా జరగడం నగరంలో జీవితం స్తంభించింది దీనిని ఎలా ఎదుర్కోవాలో తెలియని సైన్యం వెళ్ళిపోగా, ప్రభుత్వం వెంట బడింది. సైన్యం

రావడం, పోవడం, హోటల్ గదిలో నుంచి రాయ్ తిలకించాడు. కార్మిక వర్గ శక్తి ప్రదర్శితమైనట్లు అతను భావించాడు.

ఐరోపా సోషలిస్టు పార్టీలలో జర్మనీ సోషల్ డెమోక్రాటిక్ పార్టీ బాగా సంఘటితమైనది. కార్మికోద్యమ మద్దత్తు దీనికి వున్నది. ఈ వుద్యమం బలమైనదే గాక బాగా ఉల్లుకు పోయినది కూడా. వీరి నాయకత్వంలో అనుభవం గల, పరిణితి చెందిన సోషలిస్టు చింతనా పరులున్నారు. వారంతా మార్క్సిస్టులు. కాని వీరు చెప్పే కార్ల మార్క్స్ బోధనల వ్యాఖ్యానాలకూ, రష్యాలో అధికారాన్ని హస్తగతం చేసుకున్న బోల్షివిక్‌లు చెప్పే దానికీ చాలా తేడా వున్నది. మార్క్సిస్టులుగా సాంఘిక విప్లవం తప్పదని వీరు నమ్ముతారు. కార్మిక విమోచన ఆదర్శాన్ని కూడా వీరు ఆచరిస్తారు. స్వేచ్ఛా, సమానత్వంతో కూడిన కొత్త సాంఘిక వ్యవస్థ స్థాపించాలంటారు. తప్పనిసరైనప్పటికీ, సోషలిజం వైపుకు అభివృద్ధి క్రమంగా పెరగాలని వీరు నమ్ముతారు. హింసాయుత కార్యకలాపాలూ, సాయుధ తిరుగుబాటూ వీరు సమ్మతించరు. అధికారంలో వుండగా యీ ధోరణిలోనే దేశాన్ని సోషలిజం వైపుకు నడపించటానికి వీరు ప్రయత్నించారు. ఒక వైపు సామ్రాజ్యవాద పాలనలో మళ్ళీ స్థాపించాలని సైనికవాద శక్తులు కోరుకుంటున్నాయి. మరొకవైపు వ్యవస్థలనూ, స్వార్థ శక్తులనూ విడిచిపెట్టి సోషలిజం వైపుకు సాగిపోవాలని కమ్యూనిస్టులూ తదితరులూ కోరుతున్నారు. ఇటువంటి బలవత్తర శక్తులకు దీటుగా ప్రభుత్వం నిలబడవలసివచ్చింది. రాయ్ జర్మనీలో వుండగా సిద్ధాంత పరంగానూ, ఆచరణ రీత్యాను వివిధ శక్తుల మధ్య తీవ్ర చర్చసాగింది. రాయ్ కమ్యూనిస్టుల వైపు తన సానుభూతిని చూపెట్టారు. కాని అన్ని పక్షాలనూ వినే వివేచన అతనికున్నది. దీని వలన మాస్కోలో నేర్చుకున్న మార్క్సిజాన్ని యింకా లోతుపాతులతో తెలుసుకునే అవకాశం కలిగింది. సోషలిస్టు నాయకుల మానవత అతనికి ఆశ్చర్యాన్ని గొలిపింది, బెర్లిన్‌లో వుండగా వారిలో చాలా మందిని కలిశాడు. అందులో బెర్న్‌స్టెన్, కాట్‌స్కీ, హిల్‌ఫెర్‌డింగ్ ముఖ్యులు.

కమ్యూనిస్టు నాయకులు జైలులోనో, రహస్య స్థావరాలలోనో వుండడం వలన రాయ్ వారిని కొంచెం ఆలశ్యంగా కలిశాడు. వారితో కలియడానికి వీలుగా ఏర్పాటు చేసిన వ్యక్తిని సైతం పోలీస్ పట్టుకపోయారు. త్వరలోనే సంబంధాలు ఏర్పడగా, జర్మనీ కమ్యూనిస్టు పార్టీ ప్రముఖ నాయకులందరినీ రాయ్ కలుసుకోగలిగాడు. మార్క్సిజాన్ని గురించేగాక, జర్మనీ తదితర ఐరోపా దేశాల సమకాలీన రాజకీయ సాంఘిక స్థితి గురించి సుదీర్ఘంగా వారితో రాయ్ చర్చలు జరిపాడు. చర్చల వలన రాయ్ జ్ఞానపరిధి విస్తరించింది. కమ్యూనిస్టు సిద్ధాంతం ఆచరణ గురించి రాయ్‌కు గట్టి పట్టు చిక్కింది. జర్మనీ కమ్యూనిస్టు నాయకులలో హెన్రిచ్ బ్రాండ్లర్ అగస్ట్ థైమర్‌తో మంచి స్నేహం ఏర్పడింది. జీవితాంతం ఆ స్నేహం నిలిచింది. ఇది వ్యక్తిగతమేకాక రాజకీయపరం కూడా. వీరు ముగ్గురూ కొమింటర్న్ లోపలా బయటా కలిసి వున్నారు.

1920 ఏప్రిల్ చివరలో రాయ్ మాస్కో చేరాడు, అతని కంటే ముందే ఖ్యాతి వ్యాపించింది. బరోడిన్ అతనికి స్వాగతం పలికి తాను వున్నచోటే రాయ్ వుండడానికి ఏర్పాట్లు చేశాడు. ఆ సాయంత్రమే విదేశ వ్యవహారాల కమిసార్ చిచెరిన్, వైస్ కమిసార్ కొరఖాన్‌కు రాయ్‌ను పరిచయం చేశారు. వారిరువురూ రాయ్‌తో తూర్పు దేశాలలో భారతదేశంతో సహా విప్లవసంస్థాగత కృషి విషయమై చర్చించారు. ఆఫ్ఘనిస్తాన్ ఆధారంగా మనదేశంలో విప్లవకృషి కొనసాగించవచ్చునని, రాయ్‌ను ఆఫ్ఘనిస్తాన్‌కు రాయబారిగా నియమించవచ్చునని సూచించారు. కానీ ఆ దేశంలో రాజకీయ పరిస్థితి మారడంవలన యీ విషయం ముందుకు సాగలేదు. బ్రిటిష్ వ్యతిరేకిగా వున్న అమానుల్లా రాజు త్వరలోనే బ్రిటిష్ అనుకూలుడుగా మారాడు. కాబుల్‌లో శరణు కోరిన భారత విప్లవకారులను వెళ్ళిపొమ్మన్నారు. ఇది వెంటనే కాకున్నా కొంత కాలం తరువాత జరిగింది. అయితే కాబూల్‌నుంచి కార్యకలాపాలుసాగించాలనే పథకాన్ని కొమింటర్న్ విరమించింది. కానీ తూర్పు దేశాలలో రాయ్ సేవలను వినియోగించే పథకాన్ని మానుకోలేదు. ఇది తరువాత చూద్దాం.

అచిరకాలంలోనే కొమింటర్న్ ప్రముఖ నాయకులందరినీ లెనిన్, జినోవివ్, ట్రాటస్కీలను రాయ్ కలుసుకున్నాడు. అప్పట్లో స్టాలిన్ అంత ముఖ్య వ్యక్తి కాదు. అతను మాస్కోలో లేడు. ఒక సంవత్సరం తరువాత రాయ్ స్టాలిన్‌ను కలిశాడు. ద్వితీయ సమావేశం నిమిత్తం లెనిన్ సిద్ధం చేసిన జాతీయ, వలస విషయంపై ముసాయిదా సిద్ధాంతాన్ని రాయ్‌కు అందచేశారు. దానిపై కామ్రేడ్ రాయ్ విమర్శ, సూచనల నిమిత్తం అని వ్రాసి వున్నది. అప్పట్లో లెనిన్ మహోన్నతుడు కావడంతో అతనే స్వయంగా రాయ్‌ను యిలా అడగడం వలన, రాయ్ ఉబ్బిపోయాడు. ఇటువంటి ముఖ్య సమస్యలపై తన సూచనలు అడగడం. తనను పరిగణనలోకి తీసుకోవడం రాయ్‌కు సంతోషాన్ని కలిగించాయి అదే రోజున లెనిన్‌ను కలిశాడు. రాయ్ పేర్కొన్నట్లు, లెనిన్ మొదట చేసిన వ్యాఖ్యానం 'నీవు యింత చిన్నవాడివే ప్రాచ్య దేశం నుంచి తెల్లగడ్డంలో ఒక వివేకి ఎవరో వస్తున్నారని వూహించుకున్నాను.' అది సరదాగా అన్నమాట లెనిన్‌తో ప్రథమ సమావేశం గురించి రాయ్ తన స్మృతులలో హత్తుకపోయేట్లు వ్రాశాడు. మెక్సికోలో రాయ్ కృషిని లెనిన్ మెచ్చుకున్నాడు. ఆ కృషి వలన, అర్ధవలస దేశాలలో కమ్యూనిస్టు కృషికి యిది దారి చూపగలదన్నాను. రాయ్‌కి అంతకు ముందే అందజేసిన సిద్ధాంతంపై లెనిన్ అభిప్రాయం అడిగాడు. ఇంకా చదవనందున రాయ్ వెంటనే ఏమీ చెప్పలేదు. తరువాత యీ విషయం చర్చించడానికి లెనిన్‌తో అనేక సమావేశాలు జరిపాడు.

1920 జులై 23 నుంచి ఆగస్టు 7 వరకు మాస్కోలో కొమింటర్న్ ద్వితీయ సమావేశం జరిగింది. ప్రతినిధులందరినీ ముందు లెనిన్‌గ్రాడ్‌కు తీసుకు వెళ్ళారు. అక్కడ ఉత్సాహ భరితంగా ప్రారంభోత్సవం జరిగింది. మెక్సికో కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులుగా రాయ్ అతని భార్య ఎవిలిన్ ట్రెంట్ సమావేశంలో అధికారపూర్వకంగా పాల్గొన్నారు. భారతదేశ ప్రతినిధులుగా అవని ముఖర్జీ, ఎం.పి.బి.టి. ఆచార్య పాల్గొన్నారు. అయితే అన్ని విధాలా రాయ్‌నే మనదేశం ప్రతినిధిగా పరిగణించారు, అదేవిధంగా రాయ్ సమావే

శంలో పాల్గొన్నాడు, వివిధ సంఘాలకు ఎన్నికయ్యాడు. తొలి సర్వసభ్య సమావేశం అనేక కమిషన్లను ఎంపిక చేసింది. అందులో అతి ముఖ్యమైన జాతీయ, వలస కమీషన్‌లో రాయ్‌ను ఎన్నుకున్నారు.

జాతీయ, వలస కమిషన్‌లో లెనిన్ జాతీయ వలస విషయమై ప్రతిపాదించిన సిద్ధాంతం ప్రధానంగా చర్చకు వచ్చింది సిద్ధాంతంలోని కొన్ని భాగాలపై లెనిన్‌తో రాయ్ తీవ్రంగా భేదించాడు జాతీయ విప్లవ పోరాటంలో జాతీయ బూర్జువాల పాత్రపై అభిప్రాయభేదం వచ్చింది. జాతీయ బూర్జువా వర్గం కేవలం కొన్ని అవకాశాలు, విశేషాధికారాలని ఆశిస్తున్నదే తప్ప, సామ్రాజ్య వాదాన్ని నాశనం చేయాలన్న ధోరణి వారికి లేదని రాయ్ అభిప్రాయం. లెనిన్‌తో చర్చలలో యీ అభిప్రాయాన్ని రాయ్ వ్యక్తం చేశాడు. ఇరువురూ చర్చించినప్పుడు మాట్లాడడం వేరు.కమిషన్ సమావేశంలో బాహాటంగా లెనిన్‌వంటి స్థాయి, ప్రాముఖ్యత గలవ్యక్తికి వ్యతిరేకంగా అభిప్రాయ భేదాన్ని చెప్పడం వేరు. ఇందుకు సాహసం, సిద్ధాంతపరమైన విశ్వాసబలం వుండాలి. తొలి ఇంటర్నేషనల్ కమ్యూనిస్టు నాయకుల సమావేశంలో రాయ్ యీ లక్షణాలను ప్రదర్శించాడు. లెనిన్‌ను ఎదుర్కొన్నప్పటికీ రాయ్‌పట్ల లెనిన్ దయతోనూ అవగాహనతోనూ వున్నాడు. రాయ్ ప్రత్యామ్నాయ సిద్ధాంతం వ్రాయాలని సూచించి, లెనిన్ రాయ్‌ను ఆశ్చర్యపరిచాడు. కొంత నచ్చజెప్పిన అనంతరం, అనుబంధ సిద్ధాంతాన్ని వ్రాయడానికి రాయ్ అంగీకరించాడు. రెండు సిద్ధాంతాలను కలిపి పరిశీలించమని లెనిన్ అడిగినట్లే, కమీషన్ చేసింది. రాయ్ సిద్ధాంతంలో కొన్ని సవరణలు చేశారు. లెనిన్ తన సిద్ధాంతంలో బూర్జువా ప్రజాస్వామికుల బదులు జాతీయ విప్లవకారులనే మాటను చేర్చడానికి అంగీకరించాడు. [డాక్యుమెంట్స్ఆఫ్ ది హిస్టరీ ఆఫ్ ది కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియా, మొదటి భాగం, జి. అధికారి పరిష్కరించినది పేజీలు 178-199, 189-205] లెనిన్ సిద్ధాంతం ప్రధానంగానూ, రాయ్ సిద్ధాంతం అనుబంధంగానూ ఆమోదించగా, కమీషన్ సూచించినట్లే మహాసభ కూడా ఆమోదించింది.

వలస దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు జాతీయ బూర్జువాలకు, వాటి వ్యవస్థలకు ఏ మేరకు సహాయం అందించాలనే విషయంపై లెనిన్ రాయ్ వివాదం కేంద్రీకృతమైంది. బూర్జువా ప్రజా స్వామ్యంతో తాత్కాలిక పొత్తును లెనిన్ సూచిస్తూ, స్వతంత్ర కార్మికోద్యమాన్ని కోరాడు. స్వతంత్రంగా కార్మికోద్యమాన్ని పెంపొందించడం పై కొమింటర్న్ కేంద్రీకరించాలని రాయ్ పట్టుబట్టాడు. అటువంటి ఉద్యమాలు లేనిచోట ఏమి చెయ్యాలి? జాతీయ విప్లవోద్యమంతో కలసి పని చేస్తుంటే అవి రూపొందు తాయని పరిణితిగల లెనిన్‌కు తెలుసు. కొత్తగా కమ్యూనిజానికి మారిన రాయ్, భారతదేశంలో స్వతంత్ర కార్మికోద్యమ బలం గురించి అతిగా వూహించాడు. లెనిన్‌తో చర్చించిన ఫలితంగా, ఎత్తు గడలలో వ్యూహంలో లెనిన్ సరైన పంథాలను అనుసరిస్తున్నట్లు రాయ్ గ్రహించాడు. రెండు సిద్ధాంతాలను కాంగ్రెస్ ఆమోదించిన అనంతరం రాయ్ లెనిన్‌ల మధ్య అభిప్రాయ భేదాలు లేకుండా పోయాయి. సిద్ధాంతపరంగా గాని, ఆచరణరంగంలోగాని కొమింటర్న్ నాయకుల మధ్యభేదాలు లేవు. భారతదేశంలో కమ్యూనిజం పెంపొందించడానికి రాయ్ కృషిని కొమింటర్న్ పూర్తిగా సమర్థించి, ఆమోదించింది. 1928లో అభిప్రాయ భేదాలు వచ్చాయి అయితే అవి లెనిన్ సిద్ధాంతానికి కొమింటర్న్ తిలోదకాలిచ్చి సాహసోపేతమైన వామ పక్ష పంథాను అనుసరించిన కారణంగా వచ్చాయి.

వలస, అర్థవలస దేశాలలో జాతీయ, కమ్యూనిస్టు శక్తుల మధ్య ఎలాంటి సంబంధం వుండాలనేది, లెనిన్ రాయ్ సిద్ధాంతాల ఆమోదంతోనే పరిష్కారం కాలేదు. తరుచూ యీ సమస్య తలెత్తడం, కొమింటర్న్ సమావేశాలు ఎప్పటికప్పుడు దీనిని పరిశీలించవలసి రావడం జరుగుతూనే వున్నాయి. ఒకే పర్యాయం తుది నిర్ణయం తీసుకొనడానికి వీల్లేని విషయమిది. వివిధ శక్తుల మధ్య సంబంధాలను బట్టి యిది వుంటుంది. వివిధ దేశాలలో విభిన్న సమయాలలో యీ సంబంధాలు మారుతూ పోయాయి. చైనా విప్లవ సందర్భంగా, యిరు

వురి సిద్ధాంతాన్ని తరుచు ఉదహరిస్తుండేవారు. 1927 మేలో రెండు పర్యా యాలు స్టాలిన్ వీటిని ప్రస్తావించాడు. లెనిన్ కంటె రాయ్ అనుబంధ సిద్ధాంతం సందర్భోచితంగా వున్నదన్నాడు స్టాలిన్. ఈ వివాదం యిలా కొనసాగింది. 1943లో కొమింటర్న్‌ను రద్దుకావించే వరకూ విషయం తేలనేలేదు. "చైనాలో నా అనుభవాలు'' అనే పుస్తకంలో రాయ్ యిలా ప్రస్తావించాడు. వివాదం పరిష్కారం కాలేదు. జాతీయ స్వేచ్ఛా పోరాటంలో వలస ప్రజలను సమర్థిం చాలని సూత్రప్రాయంగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అంగీకరించింది. వలస దేశాలలో అణచివేతకు గురై దోపిడీ చేయబడిన వారి విప్లవ సంస్థల సహా యంతో యీ పని సమర్థవంతంగా నిర్వహించవచ్చు. ఆ విధంగా జాతీయ బూర్జువా పట్ల ధోరణి ఎలా వుండాలనేది స్పష్టంచేయలేదు. వలస ప్రజలలో భాగంగా వారిని సమర్థించాలి. ఏ మేరకు సహాయపడాలనేది అనుభవం వల్ల నిర్ధారించాలి. జాతీయ స్వేచ్ఛా పోరాటంలో వారి స్థితిని బట్టి దీనిని నిర్ణయిం చాలి [మై ఎక్స్‌పీరియన్స్ ఇన్ చైనా, పేజీ 28,1938]

రెండవ కాంగ్రెస్ సమావేశం వలన కొమింటర్న్‌లో రాయ్ స్థితి బాగా వ్యవస్థాపితమైంది. మాస్కో సాధారణ ప్రతినిధిగా అతను వెళ్లాడు. లెనిన్‌తో చర్చ, మార్క్సిస్టు సిద్ధాంతం ఆచరణ క్షుణ్ణంగా అవగాహన చేసుకోవడం అనేది చర్చలో బయట పడడం, కాంగ్రెస్‌లో జరిగిన యితర చర్చలలో కూడా యీ విషయం నిర్ధారణ కావడంతో. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఒక ప్రముఖ నాయకుడి స్థానం రాయ్‌కు లభించింది. అది ఎవరైనా అసూయ పడే స్థానం 1928లో హఠాత్తుగా మార్పువచ్చే వరకూ, ఏటా రాయ్ స్థానం మెరుగుపడుతూ వచ్చింది

కాంగ్రెస్ సమావేశం ముగింపులో రాయ్‌ను కొమింటర్న్ కార్యవర్గానికి ఎన్నుకోవలసి వున్నది. తాను తూర్పు దేశాలకు వెడుతున్నందున, బహుశః మళ్ళీ ఎన్నడూ తిరిగి రాకపోవచ్చు కనుక, రాయ్ ఆ స్థానాన్ని నిరాకరించాడు. తూర్పుదేశాలలో ముఖ్యంగా భారతదేశంలో విప్లవాన్ని కొనసాగించే కృషి

అతనికి అప్పగించారు. ప్రపంచ విప్లవంలో రెండవ రంగాన్ని అతను ప్రారంభించవలసి వున్నది. అది అతనికి యిష్టమే. ఉత్సాహంతో ఆ పనికి పూనుకున్నాడు.

మనదేశంలో విప్లవాన్ని గురించి రాయ్ భావాలలో పూర్తి మార్పు వచ్చింది. ఈ కొత్త భావాల్ని స్మృతులలో యిలా వ్రాశాడు. కొత్త విశ్వాసాన్ని అనుసరించి, ఆవశ్యకతవలన విప్లవం వస్తుంది. ఏ వ్యక్తీ తప్పనిసరి కాదు. కొత్త సాంఘిక శక్తుల వలన వారు వస్తారు. విప్లవానికి తగిన పరిస్థితులు వుంటే సాంఘిక శక్తులలో పరిణతి వస్తుంది. ఈ ప్రాథమిక స్థితిని సృష్టిస్తేగాని, సాయుధ తిరుగుబాటు చేబట్టరాదు. లేకుంటే వైఫల్యం తప్పదు. వ్యవస్థకు వ్యతిరేకంగా వున్న సాంఘిక శక్తులను రాజకీయంగా సమీకరించి, విప్లవానికి సంఘటిత పరచాలి. అప్పుడే సైన్యానికి ఆయుధాలివ్వడం, విమోచనకై పోరాడడం అనే ప్రశ్న జనిస్తుంది.

విప్లవం అంటే లోగడ ఆయుధాలకు ప్రాధాన్యత యిచ్చే వాళ్లం. ఆయుధాల సేకరణకు అనుకూలత కనిపించగానే, విప్లవం మలుపు తిరిగిందనుకునే వాళ్లం. ఆయుధాలు తీసుకెళ్ళడానికి మనుషులు కావాలని ఆలోచించనే లేదు. విప్లవాన్ని సాగించడానికి రహస్య పార్టీ సభ్యుల సంఖ్య ఇసంకల్పంగా వుండేది. [మెమోయర్స్ పుట 28].

ఇప్పుడు విప్లవదళాన్ని సిద్ధం చేయడానికి రాయ్ ఉపక్రమించాడు.

5వ అధ్యాయం

# భారతదేశంలో కమ్యూనిజం

రెండవ కాంగ్రెస్ సమావేశానంతరం కొద్ది రోజులకే రాయ్ తూర్పు దేశాలలో విప్లవాన్ని వ్యాపింపజేసే నిమిత్తం తాష్కెంటులో వున్నాడు. (ఈ అధ్యాయం ప్రథమ భాగం 'రాయ్ స్మృతుల' పైనా, రెండవభాగం సర్ సిసిల్ కేయి వ్రాసిన 'కమ్యూనిజం ఇన్ ఇండియా' పైనా, ఆధారపడింది) తూర్పు దేశాలంటే భారతదేశం మాత్రమే కాక, రష్యాలో ఆసియా ప్రాంతం, టర్కీ నుంచి ఆఫ్ఘనిస్తాన్ వరకూ విస్తరించిన విశాల మధ్య ఆసియా భూభాగంఅంతా వున్నది. రష్యాలో ఆసియా ప్రాంతంతో సహా ఈ భూభాగాలన్నీ నాడు అస్థిర పరిస్థితిలోనే వున్నాయి. ఈ విశాల భూభాగ మంతటా చాలా వెనుకబడిన ప్రజలు నివసిస్తూండేవారు. వీరిలో ఎక్కువమంది ముస్లింలు. వారికి మత భావాలు దెబ్బతినకుండా విప్లవం వైపుకు వారిని ఆకర్షించవలసివున్నది. విప్లవం వలన టర్కిస్తాన్ అనే కొత్త రిపబ్లిక్ ఏర్పడింది. కానీ ప్రజలపై యింకా అదుపు వహించే స్థితి రాలేదు. చాలా సంచార జాతులు, వారి నాయకులను అదుపులో పెట్టవలసి వున్నది. కొత్త రిపబ్లిక్‌లో అలజడి చేయమంటూ విప్లవానికి శత్రువులు, ముఖ్యంగా బ్రిటిష్ సామ్రాజ్య వాదులు వీరిని ప్రోత్సాహిస్తున్నారు. ముఖ్యంగా ముస్లిమేతర, మతేతర బోల్షివిక్ స్వభావాన్ని ఆధారంగా రెచ్చగొట్టడం జరిగింది.

రాయ్ తాష్కెంట్‌కు వెళ్ళక ముందు, కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ కార్యవర్గ సంఘం స్థాపించిన మాలి బ్యూరోలో యితన్ని ఒక సభ్యుడుగా చేర్చుకున్నారు. మధ్య ఆసియా బ్యూరోలో కూడా రాయ్ ఒక సభ్యుడే. ప్రథమ

త్వంలోనూ పార్టీలోనూ ప్రముఖులుగా వున్న యిరువురు రష్యనులు సొకొలింకొవ్, నఫరోవ్‌లు ఈ బ్యూరోలో సభ్యులు. వారు అప్పటికే తాష్కెంట్‌లో వున్నారు. అయితే వారు యితర పనులలో నిమగ్నులైనందున బ్యూరో ప్రధాన కృషి అంతా రాయ్ పైనే పడింది.

రెండు రైళ్ళ నిండా వివిధ ఆయుధాలు, ధనంతో సహా రాయ్ తాష్కెంట్‌కు వెళ్ళాడు. రాయ్ వెళ్ళినప్పుడు, ఆఫ్ఘనిస్తాన్‌లో స్థావరం ఏర్పర్చి ఆయుధాలు డబ్బు సహాయంతో సరిహద్దు తెగలను ఆకట్టుకొని, వారిద్వారా భారతదేశంలోని విప్లవ కారులతో సంబంధాలు పెట్టుకోవాలని పథకం వేశారు. ఆఫ్ఘనిస్తాన్‌లో ప్రభుత్వ సహకారం లభించినందున యీ పథకానికి స్వస్తి పలక వలసి వచ్చింది. అయితే ఆయుదాలు, వెంట వచ్చిన సైనికాధికారులు చాలా ఉపయోగ పడ్డారు. బ్రిటిష్‌వారు రెచ్చగొట్టిన తిరుగుబాట్లను కాదని, మనదేశం నుంచి వచ్చిన ముహాజిర్లకు శిక్షణ యివ్వడానికి వీరు తోడ్పడ్డారు.

తాష్కెంట్‌లో జీవన పరిస్థితులు దుర్భరంగా వున్నాయి. విప్లవంరాగానే జారిస్టు అధికారులు, ఇతర ఉన్నత వర్గరష్యనులు అక్కడినుంచి పారిపోయారు. పోతోయేముందు సాధ్యమైనంత మేరకు విధ్వంసం చేసి పోయారు. చాలా భవనాలలో నీటి గొట్టాలను పగుల గొట్టారు, సామానులు నాశనం చేశారు, విద్యుత్ తీగలు తెంచేశారు. భవనాలు నివాసయోగ్యం కాకుండా చేశారు. అటువంటి ఒక భవనాన్ని రాయ్ నివాసానికి, కార్యాలయానికి యిచ్చారు. లోగడ అందులో బొఖారా ఎమిర్ ప్రతినిధి వుండేవాడు రాయ్ ప్రవేశించినప్పుడు సామాన్లు ఏమీ లేవు-ని, కుప్పలుగా తివాచీలు మాత్రం వున్నాయి. చలికాలంలో తాష్కెంట్‌లో విపరీతంగా చలి వుంటుంది. కట్టెలు కరువుగా వున్నందున చలిమంట కూడా ఏర్పాటు చేయలేకపోయారు. ఆహారం కూడా అంతంత మాత్రంగానే వుంది. అంతా గడ్డుకాలం అని రాయ్ వర్ణించాడు.

ఆ ప్రాంతంలో బొఖారా, ఖీవా అనే రెండు సంస్థానాలూ బ్రిటిష్‌వారి సైనిక స్థావరాలమీద సోవియట్ వ్యతిరేక ప్రచారానికీ, కార్యకలాపాలకూ వినియోగిస్తున్నారు. రష్యాలో విప్లవం వచ్చిన తరువాత బొఖారా, ఎమీర్‌కూ, ఖీవా ఖాన్‌కూ రష్యా స్వతంత్రాన్ని యిచ్చింది. అయినప్పటికీ వారింకా బ్రిటిష్ నాటకాన్ని కొనసాగిస్తున్నారు. ఈ సమస్యలు రాయ్ పరిష్కరించవలసి వచ్చింది. ముస్లింల మత భావన ప్రధాన ఆటంకంగా వున్నది. దీనికి గాను రాయ్ ఖురాన్‌ను యితర యిస్లాం గ్రంథాలను అధ్యయనం చేసాడు. ప్రజల మత భావాలు నొప్పించకుండానే, యిస్లాం ప్రబోధించిన సమానత్వ ప్రాతిపదికపై విప్లవాన్ని సమర్థించనారంభించారు అంతటితో ప్రజలలో వున్న దురభిప్రాయాలు తొలగిపోయాయి సైనిక చర్యల వలన ఎమిర్, ఖాన్‌లు లొంగిపోగా, బొఖారా ఖీవాలకు విప్లవం వ్యాపించింది

ఆదే సమయంలో చాలామంది భారతీయులు ఖిలాఫత్ పోరాటానికై టర్కీ వెళుతూ అక్కడికి వచ్చారని వార్త అందింది. వారంతా ముహాజిరులు మత నాయకుల పిలుపుతో, ఖిలాఫత్ ఉద్యమ నాయకుల అతిశయోక్తులతో దేశాన్ని వదలి వచ్చారు. వారంతా 30 నుంచి 40 వేల వరకూ వున్నారు అందులో కొందరిని టర్కీమన్ తిరుగుబాటు దారులు పట్టుకొని హింసించారు. బొఖారాకు యీవార్త చేరగానే విప్లవ సైన్యంలో ఒక దళాన్ని వారిని కాపాడే నిమిత్తం రాయ్ పంపించారు. విడిపించిన వారిని బొఖారాకు తీసుకురాగా వారితో రాయ్ మాట్లాడారు. చాలామంది టర్కీకి పోవాలనే మత ఛాంధసులే. కొద్దిమందే చదువుకున్నవారున్నారు. రాయ్ యిస్తానంటున్న సైనిక విద్య ఆకర్షించగా సుమారు 50 మంది టాష్‌కెంట్‌కు వచ్చారు.

తనతోపాటు వచ్చిన ముహాజిరులకు భోజన వసతి సదుపాయాలు టాష్‌కెంట్‌లో రాయ్ ఏర్పాటు చేయవలసి వచ్చింది. వారుండే భవనాన్ని భారత నివాసం అనేవారు. వారి కోసరం సైనిక రాజకీయ పాఠశాలలు రాయ్ ప్రారంభించాడు. తనతో తెచ్చిన సాధన సంపత్తి ఆధారంగా సైనిక శిక్షణ మొదలు

పెట్టాడు. సామాగ్రితో పాటు రష్యా అధికారులు శిక్షణ యిస్తుండేవారు. బ్రిటిష్ ప్రభుత్వం వ్యతిరేకత వలన ఈ పాఠశాలలు మూసివేయవలసి వచ్చింది. 1921 మార్చిలో చేసుకున్న వాణిజ్య ఒడంబడిక చెడిపోకుండా వుండే నిమిత్తం రష్యా ప్రభుత్వం యిందుకు అంగీకరించవలసి వచ్చింది. 1920 అక్టోబరు నుంచి 1921 మే వరకూ యీ శిక్షణశాల వున్నది. రాజకీయ పాఠశాలకు కూడా యిదే గతి పట్టింది. ఉత్తరోత్తరా మనదేశంలో అభివృద్ధి చెందిన కమ్యూనిస్టు వుద్యమం దృష్ట్యా రాజకీయ పాఠశాలకు చాలా ప్రాధాన్యత వున్నది ఉద్యమానికి చురుకైన కార్యకర్తలను యీ పాఠశాల యివ్వగలిగింది. ఇందులో పేర్కొనదగిన వారు షౌకత్ ఉస్మానీ, రఫీక్ అహమద్, అక్బర్ షా, ఫజల్ ఇలాహీ కుర్బాచ్, అబ్దుల్ మజీద్, ఫిరోజుద్దీన్ మన్సూర్. యిందులో చాలామంది భారతదేశానికి తిరిగి వెళ్ళగానే అరెస్టుఅయ్యారు. పెషావర్ కమ్యూనిస్టు కుట్రకేసులో ప్రమేయం వున్నందున చాలాకాలం వీరికి శిక్షలు విధించారు. విడుదల అయిన తరువాత వీరు కమ్యూనిస్టు పార్టీలో చేరారు. షౌకత్ఉస్మానీ కాన్పూర్, మీరట్ కుట్ర కేసులలో కూడా వున్నాడు

తాష్కెంట్‌లో జరిగిన మరొక ముఖ్య సంఘటన భారత కమ్యూనిస్టు పార్టీని ఏర్పరచటం. 1920 అక్టోబరులో యిది జరిగింది. దేశంలో కమ్యూనిస్టు కార్యకలాపాలు ఏమీ లేనప్పుడు దేశం వెలుపల పార్టీని ఏర్పరచటం రాయ్‌కి అంతగా యిష్టం లేదు. సహచరుల వత్తిడి వలన రాయ్ అంగీకరించాడు. 7 గురు సభ్యులతో పార్టీ ప్రారంభమయింది. మాస్కోకు మార్చిన తరువాత మరి కొందరిని చేర్చుకున్నారు. దేశంలో పార్టీ ఏర్పడిన తరువాత, యిక్కడ విదేశీ బ్యూరోగా పార్టీ పనిచేసింది. రాయ్‌ను మినహాయిస్తే దీనికేమీ ప్రాధాన్యత లేదు.

1921 ప్రారంభంలో రాయ్ మాస్కోకు వెళ్ళవలసి వచ్చింది, బెర్లిన్‌లో వున్న భారత విప్లవ కారుల ప్రతినిధి వర్గాన్ని కలియడానికి అతను వెళ్ళాడు, మన దేశంలో విప్లవానికి సహాయమంతా తమద్వారానే పోవాలని కొమింటర్న్

తమను గుర్తించాలని వారు అభిలషించారు. ఈ ప్రతినిధి వర్గానికి వీరేంద్ర నాథ్ ఛటోపాధ్యాయ నాయకత్వం వహించాడు. ఇతను సరోజినీ నాయుడు సోదరుడు. భూపేంద్రనాథ్ దత్తా, ఖంకోజీ కూడా ప్రతినిధి వర్గంలో వున్నారు. రాయ్ ప్రాతినిధ్యాన్ని వీరు ప్రశ్నించారు. తానెవరికీ ప్రతినిధిగా లేనని రాయ్ సమాధానమిచ్చాడు. కొమింటర్న్ నాయకత్వాన్ని అంగీకరించి వారి కేంద్రాన్ని మాస్కోకు మారిస్తే తాను కూడా వారితో పాటే పని చేస్తానన్నాడు. రెండు మాసాలకు పైగా మాస్కోలో వున్న యీ ప్రతినిధి వర్గం అనేకమంది కొమింటర్న్ నాయకులను కలుసుకున్నది. అయితే వీరి స్థితి అంతా జాతీయవాదంతో కూడినది అయినందువలన చర్చల ఫలితం ఏమీ లేకపోయింది. కొమింటర్న్‌లో రాయ్ స్థితికి చలనం కలుగలేదు.

రాయ్‌ను తాష్కెంట్‌లో అట్టిపెట్టడం వలన ప్రయోజనం లేదని తేలింది. ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వం వ్యతిరేకత వలన, అటునుంచి భారతదేశానికి చేరే అవకాశం లేదు. తాష్కెంట్‌లో శిక్షణాలయాలు మూసేసి, రాయ్‌ను మాస్కో పిలిపించారు. మాస్కోలోనే స్వదేశం కోసరం కృషి చేయమని రాయ్‌ని కోరారు. తరువాత కేంద్రాలన్నీ బెర్లిన్‌కు మార్చారు. అక్కడనుంచి స్వదేశంతో సంబంధం పెట్టుకొని, కొనసాగించడం సులభమని గ్రహించారు. రాయ్ అనుమతితో యీ నిర్ణయాలన్నీ తీసుకున్నారు.

మాస్కోలో వుండగా రాయ్ తన కాలాన్ని "ఇండియా ఇన్ ట్రాన్సిషన్" అనే ముఖ్యమైన గ్రంథం వ్రాయడానికి వినియోగించాడు. మార్క్సిస్టు దృక్పధంతో భారతీయ స్థితిగతులను వివరించిన తొలి గ్రంథం గనుక దీనికి చాలా ప్రాధాన్యత వున్నది. దీనిని ఇంగ్లీషులో వ్రాయగా వెంటనే రష్యన్, జర్మన్, ఇంకా అనేక భాషలలోకి అనువదించడం జరిగింది. ఐరోపా, అమెరికాలలో దీనికి విపరీతంగా అమ్మకాలు జరిగాయి. స్వదేశానికి రాకుండా యీ గ్రంథాన్ని నిషేధించారు రహస్యంగా అనేక ప్రతులు భారతదేశానికి రాగా, మేధావులు చదివారు. గాంధేయవాదం నుంచి సోషలిజానికి, కమ్యూనిజానికి దారి కోసరం

అన్వేషిస్తున్న యువకులకు ఈ గ్రంథం ఆలోచన కల్పించింది. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం అభివృద్ధిపై యీ గ్రంథం ఎంతో ప్రభావాన్ని చూపెట్టింది. ద్వితీయ కాంగ్రెస్‌లో లెనిన్‌తో రాయ్ చేసిన వాదనకు చారిత్రక, గణాంక వివరాలతో యీ గ్రంథం వివరణ యిచ్చింది. రాయ్ తలపెట్టిన బృహత్తర పథకానికి యిదొక భాగం మాత్రమే బ్రిటిష్ సామ్రాజ్యవాద దిగజారుడు, పతనం గురించి ఆతను వ్రాయదలిచాడు. దీనికిగాను తగినంత సమాచారాన్ని సేకరించి, బెర్లిన్‌లో ఒక ప్రచురణ కర్తవద్ద సమాచారాన్ని సేకరించి భద్రంగా దాచి వుంచాడు హిట్లరు హింసాకాండకు యిది కూడా గురిఅయింది వేదాలకు పూర్వంనుంచి ఆధునిక యుగం వరకూ భారత ప్రజల గురించి రాయ్ సాంఘిక చరిత్ర వ్రాయదలంచాడు. ఆర్యులు హిందూ నాగరికత గురించి రాయ్‌కు కొన్ని సొంత భావాలున్నాయి కానీ రాజకీయాలలో నిమగ్నుడై సందున వ్రాయదలచిన యీ గ్రంథాలు పూర్తి చేయలేకపోవడం విచారకరం.

భారతదేశం నిమిత్తం పత్రికలు, వ్యాసాలు, ప్రణాళికలు, వ్యక్తిగత లేఖలు వ్రాసి చాలామందికి పంపడం వంటి కార్యక్రమానికి పూనుకున్నాడు. ఇంప్రెకార్ అనే కొమింటర్న్ పత్రికకు అప్పటికే రాయ్ వ్యాసాలు వ్రాశాడు. 1922లో వాన్‌గార్డు అనే సొంత పత్రిక ప్రారంభించాడు. పోలీసుల బారినుంచి తప్పించుకోవడానికి తరుచు పత్రిక పేరు మార్చేవాడు. అనేక పర్యాయాలు ప్రచురణ స్థలంకూడా మార్చివేశాడు. ఐరోపాలో సైతం పోలీసునుంచి, రాయ్‌కు స్వేచ్ఛలేదు. ఒకసారి జర్మనీనుంచి పంపివేస్తే, ఫ్రాన్స్ శరణుజొచ్చాడు. ఫ్రాన్స్‌లో కూడా ఎక్కువకాలం అతన్ని అహ్వానించలేదు. మళ్ళీ జర్మనీవెళ్ళగా యీసారి అదృష్టవశాత్తు అతన్ని వుండనిచ్చారు. పాత విప్లవ కార్యకలాపాలకై జారీచేసిన వారంట్లు యింకా వున్నందున, బ్రిటన్‌కు రాయ్ వెళ్ళే సమస్యలేదు. ప్రణాళికలు, బహిరంగలేఖలు తరుచు విడుదల చేస్తుండేవాడు. కాని కార్మికోద్యమంలో, విప్లవోద్యమంలో వున్నవారికి, రైతు కార్యకర్తలకు, వ్యక్తులనేకులకు తన అభిప్రాయాలు వెల్లడిస్తూ ప్రజల కోర్కెలపట్ల సానుభూతి చూపుతూ వ్రాశాడు.

ఇందులో చాలా లేఖలు పోలీసులకు చిక్కాయి. వాటిని వ్రాసుకొని పోలీసులు మళ్ళీ చిరునామా దారులకు అందజేస్తుండేవారు. తరువాత కుట్ర కేసులలో వీటిని దాఖలు చేశారు.

1921 డిసెంబర్‌లో అహమ్మదాబాదులో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశానికి రాయ్ తన ప్రణాళిక పంపడంలో పరంపరగా ప్రణాళికలు ప్రారంభమయ్యాయి గౌహతి, గయ, కాకినాడ, బెల్గాం కాంగ్రెస్ మహాసభలకు తన ప్రణాళికలు పంపాడు. సి. ఆర్. దాస్ అధ్యక్షత వహించిన గయా సమావేశాలకు పంపిన ప్రణాళిక వీటిలో ముఖ్యమైనది. దాస్ మాట్లాడిన వాటిలో కొన్ని విషయాల వలన రాయ్‌లో చాలా ఆశలు జనించాయి. సహాయ నిరాకరణోద్యమం విఫలమైన తరువాత ప్రజల ప్రత్యక్షపై పుష పోవాలని రాయ్ ఆశించాడు. ఇందుకు నిర్దుష్ట పథకాన్ని సూచించాడు. ఇందుకు విరుద్ధంగా జరిగింది. రాజ్యాంగ పథంలో కాంగ్రెస్ పయనించింది. దేశంలో జరుగుతున్న సంఘటనలు రాయ్‌కు ఎప్పటికప్పుడు తెలుస్తుండేవి. తన ప్రణాళికలో తదనుగుణంగా తగిన మార్పులు చేశాడు. కాని ధోరణి మాత్రం మార్చలేదు. ప్రజల కోర్కెల పట్ల దృష్టి సారించమనీ, ఖాదీ, చరఖా నిర్మాణ కార్యక్రమాలలో ప్రజలకు స్వరాజ్యం రాదని హెచ్చరిస్తుండేవాడు. శాసన సభలలో ప్రవేశిస్తే ప్రయోజనం లేదనేవాడు. కొత్త నాయకత్వం కోసరం ప్రోత్సహిస్తుండేవాడు. బూర్జువారాజకీయ పక్షంగా కాంగ్రెస్‌ను రాయ్ ఎన్నడూ పరిగణించలేదు. ఇదొక ప్రజా ఉద్యమం. ఇందులో తీవ్రమైన శక్తి వున్నది. కాని నాయకత్వం మాత్రం తిరోగమనంతో వున్నది. ఈ నాయకత్వాన్ని కూలదోయాలి. విప్లవనాయకత్వం రావాలి. కాంగ్రెసు గురించి తన రచనలన్నింటిలోనూ రాయ్ యిదే పేర్కొన్నాడు, కాంగ్రెసును వశం చేసుకునే ప్రయత్నంలో కమ్యూనిస్టుపార్టీ సఫలం అవుతుందని రాయ్ నమ్మాడు. ఈలోగా కార్మిక, కర్షక సంస్థలను నిర్మిస్తూ పోరాటాలను సాగించ వచ్చుననుకున్నాడు.

రాయ్ చేసిన తీవ్ర ప్రచారంవలన, పుస్తకాలూ, కరపత్రాలూ ఉత్తరాల మూలంగా 1922 నాటకి బొంబాయి, మద్రాసు, కలకత్తా, లాహోరు, అలహాబాద్ లాంటి చోట్ల చిన్న కమ్యూనిస్టు ముఠాలు తలెత్తాయి. నళినీగుప్త, అవనీముఖర్జీ, షౌకత్ఉస్మానీ, ఛార్లెస్‌యాష్లే వంటి ప్రతినిధులు కూడా మనదేశానికి వచ్చారు. అయితే యీ ముఠాలు చిన్నవి కావటమే కాక పరస్పర సంబంధం కూడాలేకుండా సాగాయి. వీటి మధ్య సమన్వయం సూచిస్తూ చట్టబద్ధమైన ఒక వ్యవస్థను ముసుగుగా ఏర్పరచుకోమని రాయ్ సూచించాడు. సమన్వయ కారుడుగా డాంగే వుండాలని రాయ్ అభిలషించినా, యీ సూచనకు డాంగే అంగీకరించలేదు. నాలుగవ కొమింటర్న్ కాంగ్రెసుకు వీరంతా రావాలని, ఆ తరువాత ఐరోపాలో ఎక్కడో ఒకచోట ప్రత్యేక సమావేశం జరిపి కార్యాచరణ పథకాన్ని రూపొందించుకోవచ్చునని రాయ్ సూచించాడు. కొంతడబ్బు కూడా పంపాడు. ముజఫ్ఫర్ అహమద్ వెళ్ళడానికి అంగీకరించాడు. డాంగే, సింగరవేలు చెట్టియార్ ఇందుకు ఒప్పుకోలేదు. ఆ పథకాన్ని అంతటితో విరమించారు.

గాంధేయవాదం పట్ల భ్రమలు తొలగి పోతున్నాయి. వేలాదిగా జైళ్ళకు వెళ్ళిన యువకులకు ఖాదీ, చరఖా విధానం ఆకర్షణీయంగా కనిపించలేదు. వారంతా చైతన్యవంతమైన కార్యక్రమం కోసరం చూస్తున్నారు. కార్మిక, కర్షక పోరాటాల ఆధారంగా తక్షణ ఆర్థిక కోర్కెల నిమిత్తం ఆచరణకుపక్రమించాలనే రాయ్ కార్యక్రమం వారిని ఆకర్షించింది. కమ్యూనిజం లక్ష్యాలు కూడా యువకుల్ని ఆకర్షించాయి. కాని రాయ్ దూరంగా ఎక్కడో ఐరోపాలోవున్నారు. అతను సంబంధం పెట్టుకున్న వ్యక్తులకు ముందుకు వచ్చే సాహసంలేదు. యువకులకు నాయకత్వం సమకూర్చలేక పోయారు. అవకాశం లభించినా చేజిక్కించుకోలేక పోయారు.

ఈలోగా కమ్యూనిస్టుల కార్యకలాపాలను ప్రభుత్వం దేశంలో శ్రద్ధగా పరిశీలిస్తున్నది. ఐరోపాలో రాయ్, అతని సహచరుల చర్యలపై కూడా కన్ను

వేసి వుంచింది. అసంతృప్తి చెందిన కాంగ్రెసువాదుల నుంచి, తన పాత సహచరులనుంచీ కొన్ని వార్తాపత్రికల నుంచీ రాయ్‌కు చాలా సహకారం లభిస్తున్నట్లు ప్రభుత్వం కనుగొన్నది. కమ్యూనిస్టు ఉద్యమం పెద్దగా తక్షణమే వచ్చే ప్రమాదం లేదని ప్రభుత్వానికి తెలుసు. కానీ వేరులు పాతుక పోకముందే దేశంలో కమ్యూనిజంపై దెబ్బతీయాలని ప్రభుత్వం నిర్ణయించుకుంది. కమ్యూనిస్టు ఉద్యమంలో చురుకుగా వున్నవారిపై కుట్ర నేరారోపణ చేసి అరెస్టులు మొదలు పెట్టింది. షౌకత్ ఉస్మానీ ప్రప్రథమంగా అరెస్టు అయ్యాడు. తరువాత ముజప్పర్ అహమద్, నళినీగుప్తలు నిర్బంధించబడ్డారు. 1924 మార్చిలో డాంగే అరెస్టు అయ్యాడు. కాన్పూర్ కమ్యూనిస్టు కుట్రకేసు పెట్టారు. సింగరవేలు చెట్టియార్ నిందితుల జాబితాలో వున్నప్పటికీ, వృద్ధాప్యం, అనారోగ్యం వలన అతన్ని అరెస్టు చేయలేదు. తరువాత అతనిపై ఆరోపణ ఉపసంహరించుకున్నారు. మిగిలిన యిద్దరు నిందితులూ రాయ్, శర్మ. రాయ్ ఐరోపాలో వుండగా శర్మ పాండిచేరీలో వున్నాడు. బ్రిటిష్ ఇండియా న్యాయస్థానాల పరిధి యిక్కడలేదు. రాయ్‌ని కుట్రకు మూలపురుషుడుగా భావించారు. 1931 లో అతను భారత దేశానికి తిరిగి వచ్చినప్పుడు కుట్రలో అతని పాత్రకు పరిహారం చెల్లించవలసి వచ్చింది. నిందితులపై మోపిన అభియోగంలో వారంతా పరస్పరం కుట్ర పన్నారనీ, కొమింటర్న్‌తో కలసి చక్రవర్తికి భారతదేశంపై సార్వభౌమత్వాధికారం పోగొట్టటానికి ప్రయత్నించారని భారత శిక్షాస్మృతిలో 12. ఎ విభాగం క్రింద శిక్షార్హులనీ పేర్కొన్నారు. కుట్రకు ఆధారంగా కొమింటర్న్ తీర్మానాలూ, యితర ప్రకటనలూ, రాయ్‌కూ, నిందితులకూ మధ్య ఉత్తరప్రత్యుత్తరాలూ ఆధారంగా చూసారు. నేరం రుజువయినట్లు న్యాయసానం తీర్పు చెపుతూ, నిందితులకు నాలుగేళ్ళపాటు కఠిన శిక్ష విధించింది.

నిందితులు తమను సమర్థించుకొనటానికి చెప్పిన దానితో రాయ్ తృప్తి చెందలేదు. అదంతా న్యాయశాస్త్ర రీత్యానూ, సాంకేతిక పరంగానూ, క్షమాపణ కోరటంలోనూ వున్నవి. 7 సంవత్సరాల అనంతరం యిదే నేరానికి రాయ్‌ను

శిక్షిస్తున్నప్పుడు, కమ్యూనిజంలో విశ్వాసంగల వ్యక్తి ధైర్యంగా రాజకీయ పరమైన సమర్థన ఎలా చేసుకోవాలో రాయ్ చూపెట్టాడు.

దేశంలో కమ్యూనిస్టు కార్యకలాపాలకు కాన్పూరు కేసు నిరుత్సాహాన్ని కలిగించింది. కొత్తమార్గాలను అన్వేషించి కార్యకలాపాలకు ప్రోత్సాహం యివ్వడానికి మార్గాలను చూపడానికి రాయ్‌కు కొంతకాలం పట్టింది. 1925 డిశంబరులో కమ్యూనిస్టు పార్టీని స్థాపించే నిమిత్తం కాన్పూరులో జరిగిన మహాసభ, వెనుకంజ తాత్కాలికమేనని రుజువుచేసింది. చట్టబద్ధమైన కమ్యూనిస్టు పార్టీని ఏర్పరచాలని వ్యవస్థాపకులు పథకం వేశారు. అయితే వారిని బయటకు త్రోసివేసి వాస్తవమైన కమ్యూనిస్టు పార్టీని స్థాపించటంలో కమ్యూనిస్టులు సఫలీకృతులయారు. చిరకాలం తాను ఆశించిన పథకం నెరవేరినట్లు రాయ్ యీ సంఘటనను ఆహ్వానించారు.

1925లో దేశంలో కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలను నిర్వహించటంలో దారిచూపే బాధ్యతను గ్రేట్ బ్రిటన్ కమ్యూనిస్టు పార్టీకి అప్పగించారు. దైనందిన కార్యక్రమాన్ని గ్రేట్ బ్రిటన్ పార్టీ పర్యవేక్షిస్తుండగా, స్థూల మార్గాన్ని రాయ్ చూపాడు. వాన్‌గార్డు పత్రిక కొనసాగుతూనే వున్నది. దేశంలో కమ్యూనిస్టు నాయకులతో రాయ్ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాడు. ఎత్తుగడలూ, వ్యూహాలను గురించి తన ఉత్తరాలలో రాయ్ వారితో చర్చించేవాడు. 1927-28లలో దేశంలో పెంపొందిన కార్మిక కర్షక పార్టీల పాత్ర యిందులో ఒకటి. ఈ కాలంలో అసెంబ్లీ లేఖగా పేరొందిన ఒకలేఖ సుప్రసిద్ధమైనది 1928లో కేంద్ర శాసనసభలో యీ వుత్తరాన్ని చదవటం వలన ఆ పేరు వచ్చింది. 1927 లో 8 మాసాలపాటు రాయ్ చైనాలో వున్నందున భారత కమ్యూనిస్టులకు మార్గదర్శకత్వం యివ్వలేక పోయాడు. రాయ్ సూచించిన దానికీ, గ్రేట్ బ్రిటన్ పార్టీ పంథాకూ సర్వసాధారణంగా తేడాలేదు. రాయ్ వ్రాసిన "ఫ్యూచర్ ఆఫ్ ఇండియన్ పొలిటిక్స్", గ్రేట్ బ్రిటన్ పార్టీ మేధావి పామీదత్తు వ్రాసిన 'మోడరన్

ఇండియా''కు, ప్రపంచ పరిస్థితి గురించిగానీ, దేశంలోని స్థితిగతుల గురించి గానీ ఒకే అభిప్రాయం వున్నట్లు గమనించవచ్చు.

ఆరవ కొమింటర్న్ కాంగ్రెసు అనంతరం తేడాలు వచ్చాయి. రాము నిర్మించినదంతా భారతదేశంలో నాశనం చేయడాన్ని రాయ్ గమనించాడు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజా వుద్యమం రూపురేఖలు దిద్దుకుంటున్నప్పుడు కాంగ్రెసు పార్టీలో ఉన్మత్తతతో కూడిన వ్యతిరేకతతో ఈ పని చేశారు. అంతటితో రాయ్ కొమింటర్న్‌తో తెగతెంపులు చేసుకున్నాడు. ఈ విషయాన్ని తరువాత అధ్యాయంలో చర్చిద్దాం.

6 వ అధ్యాయం

# ప్రత్యేక పనిమీద చైనాకు పయనం

1927 ప్రారంభంలో కొమింటర్న్ తన ప్రతినిధిగా తానామోదించిన కొత్త సిద్ధాంతాన్ని అమలుపరచే ధోరణిని పర్యవేక్షించటానికి రాయ్‌ను చైనాకు పంపింది. 1926 నవంబరులో మాస్కోలో జరిగిన కొమింటర్న్ కార్యవర్గ సమావేశంలో కొత్త సిద్ధాంతాన్ని రూపొందించటంలో రాయ్ పాత్ర చాలా వున్నది. [రాయ్ వ్రాసిన ఎక్స్‌పీరియన్స్ ఇన్ చైనా, రెవల్యూషన్ అండ్ కౌంటర్ రెవల్యూషన్ ఇన్ చైనా, రాబర్టు సి. నార్తు, జె. యూడిన్ వ్రాసిన యం. యన్. రాయ్స్ మిషన్ టు చైనా అనే గ్రంథాలు ఈ అధ్యాయానికి ఆధారాలు] చైనా విప్లవం ఇకనుంచి వ్యవసాయ విప్లవంగా పెంపొందించాలనీ కొమింటాంగ్‌తో పొత్తుకై అనవసరంగా కాలాన్ని వృథా చేయరాదని యీ సిద్ధాంతపు సారాంశం.

చైనాలో మార్పులను గురించి కొమింటర్న్, రష్యా ప్రభుత్వం చాలా కాలంగా తీవ్ర ఆసక్తి చూపెడుతున్నాయి. తన వ్యతిరేకులైన సామ్రాజ్య వాద శక్తులను బలహీన పరచాలని రష్యా ప్రభుత్వం ఆసక్తి చూపుతున్నది. సామ్రాజ్యవాదశక్తులు సైనిక కార్యకలాపాలతోనూ, వాణిజ్యం ద్వారానూ, స్పర్ధలతో వున్న యుద్ధాధిపతులకు సహాయం అందించటంతోనూ చైనాపై పట్టు చిక్కించుకున్నాయి. ఇందుకు భిన్నంగా 1919 జూలైలో చైనాపై జారిస్టుప్రభుత్వ అవకాశాలన్నిటినీ రష్యా ప్రభుత్వం వదులుకున్నది. దేశాన్ని ఐక్యపరచటానికీ, సామ్రాజ్య వాద అణచివేతనూ, దోపిడీని వదిలించుకొవటానికీ జాతీయోద్యమం చేసే కృషిని రష్యా ఆహ్వానించి సమర్థించింది. 1920 నుంచి చైనాపట్ల ఆసక్తి చూపటం కొమింటర్న్‌తో మొదలయింది. రెండేళ్ళ అనంతరం కొమింటాంగ్‌ను

గుర్తించారు. మాస్కో సలహాపై కమ్యూనిస్టులు కొమింటాంగ్‌లో ప్రవేశించారు. తొలుత ట్రాట్‌స్కీతో సహా రష్యా నాయకులందరూ దీన్ని సమర్థించారు. రాయ్ కూడా అదే అభిప్రాయంతో వుండేవాడు.

కొమింటాంగ్‌లో ప్రవేశించటం వలన కమ్యూనిస్టులకు కార్మిక, కర్షకుల మద్దత్తు విస్తారంగా లభించింది. ఈబలంతో కమ్యూనిస్టులు ప్రజాసంఘాలలోనూ ప్రభుత్వం, సైన్యంలోనూ ముఖ్యమైన స్థానాలను పొందగలిగారు.

1926 లో చిక్కులు తలెత్తాయి. కొమింటాంగ్‌లో భూస్వాముల పెట్టుబడి దారుల ప్రతినిధులు చాలామంది కమ్యూనిస్టులతో కలసి వుండటాన్ని ఇష్టపడ లేదు. జాతీయ సైన్యానికి సర్వసేనాధిపతి చాంగ్‌కై షేక్ కమ్యూనిస్టులకు వ్యతి రేకి. 1926 మార్చిలో కేంటన్‌లోనూ, 1927 ఏప్రిల్‌లో షాంఘైలోనూ కమ్యూ నిస్టులకు వ్యతిరేకంగా అతను కుట్రపన్నాడు. కొమింటాంగ్ మితవాదం, వామ పక్షం అనే రెండు చీలికలై పోయింది,

కమ్యూనిస్టులు వామపక్ష కొమింటాంగ్‌ను సమర్థించారు కానీ రెండు కొమింటాంగ్‌లకూ అట్టే తేడా లేదని తరువాత తెలుసుకున్నారు 1926 నవం బరు సమావేశంలో కొమింటర్న్ అంతవరకూ జరుగుతున్న మార్పులను శ్రద్ధగా పరిశీలించినందువలన తాము అనుసరిస్తున్న పంథాలో మార్పు అవసరమని భావించి, రాయ్‌ను పంపారు. అయితే వామ పక్ష కొమింటాంగ్‌తో పొత్తుమాత్రం కొనసాగించాలన్నారు

రాయ్ పాతస్నేహితుడు బరోడిన్ అప్పుడు చైనాలో వున్నాడు. 1923 నుంచీ అతనక్కడే వుంటున్నాడు. చైనా కమ్యూనిస్టు పార్టీకి జాతీయ ప్రభు త్వానికీ అతను ప్రధాన సలహాదారు. అతనితో పాటు జనరల్ గాలెన్ వురప్ బ్లుచర్, యింకా అనేకమంది రష్యా సలహాదారులు కూడా వున్నారు. కొమిం టర్న్ కొత్త పంథా బరోడిన్‌కు నచ్చలేదు. ఈ విషయమై రాయ్‌తో అతనికి తీవ్ర విభేదం రాగా కొత్త పంథాను అమలు పరచటంలో రాయ్ కే పాత్రం

సహాయపడలేదు. డబ్బంతా బరోడిన్ అదుపులో వున్నది. చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకుడు ఛంటూషూ మద్దత్తు, విశ్వాసం కూడా బరోడిన్‌కు లభించింది.

రాయ్ వెంట అంతర్జాతీయ కార్మిక ప్రతినిధి వర్గం వెళ్ళింది. ఇంగ్లండ్ నుంచి టామ్‌మన్, ఫ్రాన్స్ నుంచి జాక్ డోరియో, అమెరికా నుంచి యర్ల్ బ్లూడర్ వున్నారు. కేంటన్‌లో మే 1 న జరుగనున్న పాన్, పసిఫిక్ కార్మిక మహాసభకు ఈ ప్రతినిధి వర్గం హాజరు కావలసి వున్నది. భారతదేశం నుంచి ఒక ప్రతినిధివర్గం రావాలని పట్టుదల చూపాడు. కాని దీనికి హాజరు కాదలచిన భారత కార్మిక నాయకులకు భారత ప్రభుత్వం పాస్‌పోర్టు లివ్వ నిరాకరించి నందువలన రాయ్ కోరిక తీరలేదు మే చివరలో యీ మహాసభ హాంకోలో జరిగింది.

1927 ఫిబ్రవరిలో రాయ్, అతని ప్రతినిధివర్గం కేంటన్ చేరుకున్నది. అప్పటికి జాతీయ ప్రభుత్వం హాంకోకు మారింది. ఊహాన్‌పేరిట మూడుజరుగు-పొరుగు నగరాలలో ఇదొకటి. రాయ్ అక్కడకు పోవలసి ఉన్నది, కాని మూడు వారాలపాటు కేంటన్‌లోనే ఆగిపోయాడు. హాంకోకు వీరు వెళ్లవలసిన విమానం యింజన్ లోపం వలన పోలేక పోగా, కూలీలు మోసుకు వెళ్లే కుర్చీలలో కూర్చొని వీరు ప్రయాణం సాగించవలసి వచ్చింది ఈ ప్రయాణానికి 6వారాలు పట్టింది. ఏప్రిల్‌లో హాంకోకు చేరుకున్నారు. ఇంత సుదీర్ఘ ప్రయాణం వలన స్వయంగా గ్రామీణ పరిస్థితిని రాయ్ పరిశీలించగలిగాడు. ఇంతకంటే ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీ నాయకులనూ, కొమింటాంగ్ ప్రముఖులనూ కలుసుకున్నాడు. రాకపోకలఏర్పాటులో ప్రతిష్టంభనవలనఈ పని ఆలస్యంగా జరిగింది.

రాయ్ కేంటన్ చేరుకునేసరికి కొమింటాంగ్‌లో కుడి ఎడమ పక్షాలకు మధ్య విభేదాలు తీవ్ర స్థాయికి వచ్చాయి. వామ పక్షాన్ని కమ్యూనిస్టులు బల పరుస్తున్నారు. ప్రభుత్వ కేంద్రం నాన్‌కింగ్‌లో వుండాలా, ఊహాన్‌లో వుండాలా, పాంగ్‌చిన్‌వై ను తిరిగి రమ్మని ఆహ్వానించాలా, ముఖ్యంగా కమ్యూనిస్టులతో పొత్తు కొనసాగించాలా అనే విషయాలలో అభిప్రాయ భేదాలున్నాయి. వామపక్ష

కొమింటాంగ్, కమ్యూనిస్టులా వీటిని గురించి మాట్లాడటానికి విముఖత చూప టం అసక్తికరంగా వున్నది. చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ కొమిం టాంగ్‌లో వచ్చిన కమ్యూనిస్టు వ్యతిరేకతను గమనించింది. మితవాద పక్షా లను తన వైపు తిప్పుకోవటంతో కొమింటాంగ్ కుడిపక్షం జయంపొందే ప్రమాదం కూడా వున్నది. కేంటన్‌లో యీ ప్రమాదాన్ని గమనించిన రాయ్ హెచ్చరిక చేసాడు కూడా. చాంగ్‌కై షేక్‌కు వ్యతిరేకంగా బయటపడి మాట్లాడ టానికి చైనా కమ్యూనిస్టు పార్టీకి యిష్టంలేనందున రాయ్ హెచ్చరిక తొంక తిరుగుడుగానూ, సాధారణంగానూ చేయవలసి వచ్చింది రాయ్ చేసిన హెచ్చ రిక వాస్తవమని అతను హాంకోకు చేరిన కొద్ది రోజులకే ఏప్రిల్ 12నషాంఘైలో కమ్యూనిస్టులను చాంగ్‌కైషేక్ మూకుమ్మడిగా చంపించినప్పుడు గ్రహించారు. కొమింటాంగ్‌లో చీలిక వాస్తవరూపం దాల్చింది. రెండు జాతీయ ప్రభుత్వాలా ఏర్పడినాయి. హాంకోలో వామపక్షం వుండగా చాంగ్‌కైషేక్ నాయకత్వాన నాన్‌కింగ్‌లో మితవాద ప్రభుత్వం వున్నది.

కొమింటాంగ్ చీలిక అనంతరం రాయ్ బరోడిన్ మధ్య, చైనా కమ్యూ నిస్టు నాయకులు మధ్య అభిప్రాయ భేదాలు తీవ్రతరమైనవి. తేడాలు చాలా విషయాలపై వున్నప్పటికీ మూడు సమస్యలపై కేంద్రీకరించాయి. రెండవసారి ఉత్తరాదికి దండయాత్ర పోవడం, రైతుల తిరుగుబాటూ, వామపక్ష కొమిం టాంగ్‌తోసంబంధాలూ అనేది మూడుప్రధానసమస్యలు.రాయ్ ప్రకారం వామపక్ష కొమింటాంగ్‌తో పొత్తు అనేది జూన్‌లో కీలక సమస్యగా పరిణమించింది. వామ పక్ష కొమింటాంగ్ పొత్తు లేకపోగా శత్రువుగానూ, ప్రతి విప్లవ సాధనగానూ, మారింది. కార్మిక-కర్షకులపై యుద్ధం మొదలు పెట్టింది. చాంగ్‌కైషేక్ అధ్వార్యానగల మితవాద పక్షంతో అవగాహనకు సిద్ధపడింది. అంతకుముందు వామపక్ష కొమింటాంగ్‌తో కలసివుండాల్సిన ఆవశ్యకతను బరోడిన్ తదితరు లతో పాటు రాయ్ కూడా అంగీకరించాడు. అయితే యీ పొత్తు కేవలం ఒక

ప్రయోజనార్థమేననీ, అది తీరిపోగానే కలయిక అంతం కావాలనీ గట్టిగా చెప్తుతూ వచ్చారు.

ఏప్రిల్ 27 నుంచీ రెండు వారాలపాటు హాంకోలో జరిగిన చైనా కమ్యూనిస్టు పార్టీ 5వ మహాసభ చర్చలలో తేడాలు విషయం ప్రస్తావనకు వచ్చింది. బరోడిన్, చంటూషూ అభిప్రాయానికి భిన్నంగా రాయ్ తన అభిప్రాయాన్ని వ్యక్తంచేసాడు. అన్ని సమస్యలపైనా మహాసభ రాయ్‌ను సమర్థించింది. అతని సూచనల మేరకు నిర్ణయాలు తీసుకున్నది. రాయ్ సంతోషించినప్పటికీ యిది ఆట్టేకాలం నిలువలేదు. నిర్ణయాలు అమలు పరచటం లేదనీ నిర్ణయాలపై భిన్న అభిప్రాయాలు చేస్తున్నారనీ తెలుసుకున్నాడు, బరోడిన్, చంటూషూల చేతులలో అధికారం అంతా వున్నందున రాయ్ నిస్సహాయుడయ్యాడు. రాయ్ మాస్కోకు విజ్ఞప్తి చేసాడు. వారి సమాధానం అస్పష్టంగా వున్నది.

రెండవసారి ఉత్తరాది దండయాత్రకు రాయ్ వ్యతిరేకత చూపారు. సైనికంగా, ఆచరణ యోగ్యంకాదనీ, రాజకీయంగా ప్రమాదకరమని సామాజికంగా తిరోగమనంతో కూడినదని రాయ్ దీన్ని వర్ణించాడు. ఈ అభిప్రాయాన్ని పార్టీ సమావేశం ఆమోదించింది. అయితే ఊహాన్ ప్రభుత్వం దండయాత్రలు ప్రారంభించినపుడు, బరోడిన్, చైనా కమ్యూనిస్టు పార్టీ సమర్థించాయి. అలా చేయకపోతే వామపక్ష కొమింటాంగ్ తెగ తెంపులు జరుగుతాయని వారు భావించారు. చివరకు దండయాత్ర విఫలంకాగా కొమింటాంగ్ ఉభయ పక్షాలు మళ్ళీ చేరువయ్యాయి. దండయాత్రపై జరిగిన చర్చల్లో విప్లవాన్ని తీవ్రతరం చేయాలా, లేక విస్తృతం చేయాలా అనే దానిపై చర్చ కేంద్రీకృతమైంది. ఊహాన్ ప్రభుత్వ ఆధ్వర్యాన వున్న భూభాగాలలో వ్యవసాయ విప్లవాన్ని ముందుకు తీసుకెళ్ళి విప్లవాన్ని తీవ్రతరం చేయాలని రాయ్ అన్నాడు. కొమింటాంగ్‌లోని భూస్వాములు, సైనిక వాదులు వ్యతిరేకులవుతారనే ఉద్దేశ్యంతో రాయ్ ప్రతిపాదనను బరోడిన్, చైనా కమ్యూనిస్టు పార్టీ వ్యతిరేకించారు.

చైనాలోని సైనిక రాజకీయ, సాంఘిక పరిస్థితిని అద్భుతంగా గ్రహించినట్లు రాయ్ చెప్పిన దానిని బట్టి తెలిసింది

రాయ్ వూహించినట్లుగా దండయాత్ర ప్రారంభం కాగానే అన్ని కార్య కలాపాలను ఆపి వేయవలసినదిగా ప్రభుత్వం ప్రజలకు పిలుపు యిచ్చింది. హామీలను నెరవేర్చే బదులు ప్రజలను యింకా త్యాగాలు చేయమని ప్రభుత్వం కోరింది. పారిశ్రామికుల కార్మికులు సమ్మెకు దిగ రాదని నిషేధిస్తూ సైన్యా నికి సరఫరాను బాగా అందటానికి వీలుగా వారిని యింకా ఎక్కువ గంటలు పని చేయమన్నారు. అంతర్జాతీయ చిక్కులు లేకుండా వుండటానికి గాను, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని నిలిపివేశారు. దండయాత్రల వలన కొమింటాంగ్‌లో సైనికవాదుల స్థితి బలపడింది.

ఈలోగా తిరుగుబాటు ధోరణి పల్లెలకు వ్యాపించి రైతులు కూడా సాయు ధులై తాము చిరకాలంగా అణచి వేస్తున్న వారిపై, భూస్వాములపై, వారు విని యోగించే రౌడీలపై తిరుగుబాటు చేసారు. కొన్నిచోట్ల భూస్వాముల కోసరం తాము సాగుచేస్తున్న భూములను స్వాధీనం చేసుకొన్నారు. మరికొన్నిచోట్ల భూస్వాములను వెళ్ళగొట్టారు ఇదంతా రైతుల అతి పోకడగా భావించారు. ఇటు వంటి అతివాద ధోరణిని అదుపులో పెట్టి రైతులను క్రమశిక్షణలో వుంచవలసిన దిగా కొమింటాంగ్ నాయకులు కమ్యూనిస్టు నాయకులను కోరారు. రాయ్‌రైతుల చర్యలను అతివాద పోకడలుగా భావించలేదు. రైతులను సమర్థించాలని ఒక నిర్మాణయుత పద్ధతిలో రైతులు భూములను స్వాధీనం చేసుకోవాలని అన్నాడు. రైతు సంఘాలు స్థాపించి వారికి రాజకీయ అధికారం యిస్తే భూస్వాముల వద్ద వున్న రౌడీలను నిరాయుధులను గావించి విప్లవసైన్యానికి అవసరమైన దళాలను సృష్టించవచ్చునని రాయ్ ఉద్దేశ్యం. ఈ విషయంలో కూడ రాయ్‌కు బరోడిన్ చైనా కమ్యూనిస్టు పార్టీకి అభిప్రాయభేదాలు వచ్చాయి.

వామపక్ష కొమింటాంగ్‌తో సంబంధాలు ఎలా వుండాలనే విషయంపై అభిప్రాయ భేదాలన్నీ కేంద్రీకరించాయి. బరోడిన్, చక్‌టూషూల అభిప్రాయాల

ననుసరించి వారితో సంబంధం ఆట్టిపెట్టి బలపరచాలని అన్నారు. కాని జూన్ నాటికి ప్రయోజనం తీరిపోయింది కనుక ప్రజలకు సంబంధించిన విప్లవోద్యమాన్ని అభివృద్ధి పరచే నిమిత్తం వామపక్ష కొమింటాంగ్‌తో తెగతెంపులు చేసుకోవాలని రాయ్ నిర్ధారణగా చెప్పారు. కొన్ని రోజులపాటు చర్చ జరిగింది. మాస్కో మాత్రం పరస్పర విరుద్ధ మార్గదర్శక సూత్రాలను తప్పించుకునే ధోరణిని కనబరుస్తూ వచ్చింది.

ఈలోగా కొందరు సైనికవాదులు కమ్యూనిస్టులపైన, వారి వ్యవస్థలపైన దాడి జరిపారు. సియా-టావోయు తిరుగుబాటు జరిపారు. ప్రభుత్వాన్ని పడకొట్టే నిమిత్తం రాజధానిమీదకు వచ్చాడు. అతన్ని ఓడించి వెనక్కు తరిమికొట్టారు. ప్రజలు కూడా తలవని తలంపుగా యీ దాడిని తిప్పికొట్టారు. అతనిపై ప్రభుత్వం ఎలాంటి చర్య తీసుకోలేదు. ఒకపక్షం రోజుల తరువాత చాంగ్‌షాలో తీవ్రమైన తిరుగుబాటు జరిగినది. జనరల్ సూ-కే-సియాంగ్, అతని కాధికార్లు కుట్ర పన్నారు. చైనాలో విప్లవం ప్రతి విప్లవం అనే గ్రంథంలో యీ విషయాన్ని యిలా వర్ణించాడు. వారు రాష్ట్ర ప్రభుత్వాన్ని పడగొట్టి, సభ్యులను జైలులో పెట్టి కొమింటాంగ్ రైతుశాఖ నిర్వహించే రాజకీయ పాఠశాలను మూసివేసి కమ్యూనిస్టుల పైన ప్రజాసంఘాలపైన అణచివేసేచర్యలను ప్రారంభించారు (రెవల్యూషన్ అండ్ కౌంటర్ రెవల్యూషన్ యిన్ చైనా, యం. ఎన్. రాయ్; రినైజాన్స్ పబ్లిషర్స్, కలకత్తా, 1946 పేజీ 517). అయినా ప్రభుత్వం ఉదాసీనంగా వుంది. స్థానిక కమ్యూనిస్టులు కొమింటాంగ్ ఆచరణ వాదులు కుట్రను నిరోధించ దలచారు ఇరవై వేల మంది రైతులు చాంగ్‌షాను చుట్టుముట్టారు. నగర ప్రాకారాల వద్దకు చేరేసరికి వారందరినీ వెనక్కు పోవలసినదిగా ఊహాన్‌లో కమ్యూనిస్టు కేంద్రం ఉత్తర్వులు యిచ్చింది. కొమింటాంగ్ నుంచి కమ్యూనిస్టులను వెళ్ళగొట్టటానికి సైనికవాదులు సిద్ధపడుతున్నారని యీ సంఘటనలు స్పష్టంగా చూపుతున్నాయి

పరిస్థితి బాగాలేదు కానీ ఆశ వదులుకోనక్కరలేదని అభిప్రాయపడ్డాడు. కృతనిశ్చయంతో ఎదురుదెబ్బ తీయటానికి అతను సుముఖత చూపాడు. రాయ్ సలహాను నిరాకరించారు కొన్ని సంవత్సరాల తరువాత "చైనాలో నా అనుభవాలు" అనే గ్రంథంలో రాయ్ యిలా వ్రాశారు. నిస్పృహతో కమ్యూనిస్టు పార్టీ పొలిటికల్ బ్యూరోకు నచ్చచెప్పటం అసంభవం అని తెలిసి కూడా ప్రయత్నం చేసి చూశారు. కేంద్ర సంఘ సర్వసభ్య సమావేశం స్థానిక నాయకులతో సహా జరగాలని కోరారు. గడ్డు రోజులలో తమ స్థావరాలు వదలి ముఖ్యమైన పార్టీ సభ్యులు రాలేదంటూ నా కోరికను వ్యతిరేకించారు. స్థానిక కార్యకర్తలు అసహనంతో కచ్చితమైన చర్య కోసం చూస్తున్నారు. అగ్రనాయకుల సర్వసభ్య సమావేశాన్ని వ్యతిరేకించారు. చివరకు చైనా, రష్యా మిత్రుల సహకారంతో ఆచరణకు పూనుకున్నారు. జాతీయ ప్రభుత్వానికి ముఖ్యమైన సైనిక సలహాదారైన గాలెన్ పూర్తిగా నాతో ఏకీభవించాడు. అప్పటికి చాలామంది మిత్రులు నా అభిప్రాయాన్ని ఆమోదించారు. కానిఅధికారమంతా బరోడిన్ చేతుల్లో కేంద్రీకృతమై వుంది. అతని అవకాశవాదనకు వ్యతిరేకంగా మాస్కో రాజకీయంగా నన్ను బలపరిచింది. అయినప్పటికీ అతనింకా అదుపు వహించగల స్థితిలోనే వున్నాడు, కమ్యూనిస్టు పార్టీ నియంతగానే వ్యవహరించాడు. చాలావరకు అతని శిష్యులు కావటం సిద్ధాంతరీత్యా అతని మార్గానికి చేరువగా వుండటం వలన చైనా కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకులు అతనినే అనుసరించారు. అంతర్జాతీయ పార్టీ సూచనలను లెక్క చేయకుండా చైనాలో వున్న దాని ప్రతినిధిని ధిక్కరిస్తూ వ్యవహరించారు. (మై ఎక్స్‌పీరియన్స్ యిన్ చైనా పుటలు 65,66)

ఈ పరిస్థితిలో రాయ్,బరోడిన్ యిరువురు పరిస్థితిని ఆదుకోవటానికి వామపక్ష కొమింటాంగ్ నాయకుడు జాతీయ ప్రభుత్వ అధిపతి అయిన వాంగ్ చింగ్‌వైని సమీపించారు. కమ్యూనిస్టుల గురించి అతనికి అనుమానాలున్నాయి. వారు తనను సమర్థించటంలేదని శక్తివంతమైనసైనికాధిపతి టంగ్-పెంగ్-చి ని బలపరుస్తున్నారని అనుకొన్నారు. బరోడిన్, చైనా కమ్యూనిస్టు పార్టీ చర్యలు

కొన్ని అతనిలోయిటువంటి అనుమానాలకు తావిచ్చాయి కమ్యూనిస్టులకు మద్దతు ప్రకటిస్తూ రాయ్ తీసుకున్న చర్యలు పాంగ్-చింగ్-వై కి యిచ్చిన హామీగురించి రాయ్ యిలా వ్రాశాడు. చైనాకు తిరిగివస్తూ యితను మాస్కో ద్వారా పయనించాడు. అక్కడ సోవియట్ ప్రభుత్వం, అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ తమ పూర్తి మద్దతును ప్రకటించాయి. ఇటువంటి హామీను కోరుతూ మాస్కోకు నేనొక రేడియో సందేశాన్ని పంపించగలిగాను. ఊహాన్ ప్రభుత్వంలో తిరిగి అతని నాయకత్వం స్థాపించటానికి నిర్దుష్టమైన కార్యాచరణ పథకాన్ని అతనికి సూచించారు. హామీ యిచ్చిన ప్రకారం సహాయం అందితే పథకాన్ని అమోదిస్తానన్నారు.

కొన్నిరోజుల తరువాత కోరిన హామీని ఇస్తూ మాస్కోనుంచి తంతి వచ్చింది. అందులో సూచనలు యిలా వున్నాయి—భూములను స్వాధీనం చేసుకోండి. నమ్మటానికి వీలులేని సైనికాధిపతులను నాశనం చేయండి. 20 వేలమంది కమ్యూనిస్టులను సాయుధులను చేయండి. 50 వేల కార్మిక కర్షకులను కొత్త సైన్యం నిమిత్తం ఎంపిక చేయండి. పాతసభ్యుల స్థానే కొమింటాంగ్ కేంద్ర కార్యవర్గంలో నూతన కార్మిక కర్షకులను ప్రవేశపెట్టండి. కొమింటాంగ్‌లో బాగా తెలిసిన సభ్యుడను అధ్యక్షుడుగా ఒక విప్లవ న్యాయస్థానాన్ని, తిరోగమన అధికారులపై విచారణ జరిపటానికి ఏర్పాటు చేయండి.

అత్యవసరంగా కావలసిన హామీ చాలా ఆలస్యంగా అందింది. ఈలోగా కమ్యూనిష్టులు తమకు ద్రోహం చేశారనుకొని వాంగ్-చిన్-వై మితవాదపక్షంతో సంప్రదింపులకు దిగాడు వారంతా చాంగ్‌కై షేక్‌ను తృప్తిపరచే నిమిత్తం కమ్యూనిష్టుల రక్తాన్ని చిందించటానికి తహతహలాడుతున్నారు. ఇటువంటి సన్నివేశంలో తుది ప్రయత్నంగా వాంగ్-చింగ్-వై లో తిరిగి విశ్వాసాన్ని నెలకొల్పే ఉద్దేశ్యంతో మాస్కోనుంచి వచ్చిన సందేశాన్ని అతనికి అందించారు.

సందేశపు ప్రతిని రాయ్‌నుంచి అడిగి తీసుకొని వాంగ్-చింగ్-వై తన సహచరులకు చూపాడు. వారు అప్పటికే చాంగ్‌కైషేక్‌తో సంబంధం పెట్టు

కొన్నారు. వెంటనే చర్యకు పూనుకొని కమ్యూనిస్టులపై దెబ్బతీయటం ప్రారంభించారు వాస్తవానికి యిటువంటి నిర్ణయం అప్పటికే జరిగిపోయింది ఫెంగ్-యు-చియాంగ్ అనే క్రైస్తవ సైనికాధిపతి జాతీయ దళాల ఐక్యతదృష్ట్యా రష్యా సలహా దారులను తీసివేయమని కమ్యూనిస్టు పార్టీని అణచమని ఊహాన్ ప్రభుత్వానికి తాకీదు యిచ్చినప్పుడే నిర్ణయం జరిగిపోయింది. ఈ తాకీదును ఆమోదించక పోతే ఉత్తరాదినుంచి ఊహాన్‌పై దాడి జరుపుతామని బెదిరింపు కూడా చేసారు. ఈ తాకీదు ఊహాన్ నాయకుల సమ్మతం చాంగ్-కై-షేక్‌తో చేతులు కలపటానికి తోడ్పడింది. అంతేగాని మాస్కో నుంచి వచ్చిన టెలిగ్రాము వాంగ్-చింగ్-వైకు రాయ్ అందజేసినందువలన యిలా జరగలేదు.

కొమింటాంగ్‌లో ఉభయ పక్షాలు చేరువయ్యాయి. కలసికట్టుగా కమ్యూనిస్టులపై దాడి జరిపారు. చైనా కమ్యూనిస్టు పార్టీని నిషేధించారు. వేలాది కమ్యూనిస్టులను అరెస్టు చేశారు. అనేక మందిని చంపేశారు. కార్మిక సంఘాల్ని, రైతు సంఘాన్ని నాశనం చేశారు. భయానక రాజ్యాన్ని సృష్టించారు రష్యా సలహా దారులను తొలగించారు. బరోజన్ జూలై 27న హాంకో వదిలి వెళ్లారు. జూలై ఆఖరునో అగస్టు మొదటలోనో రాయ్ కూడా వెళ్ళిపోయాడు.

చైనాలో రాయ్ ప్రయత్నం విఫలమైంది. ఇది వ్యక్తి వైఫల్యం కాదు. సంస్థాగత వైఫల్యం పూర్తిగా. వేలాది మైళ్ల దూరంలో వుంటూ కొమింటరన్, చైనా వంటి క్లిష్టమైన ప్రజా బాహుళ్యంతో కూడిన దేశంలో విప్లవానికి మార్గం చూపాలని ప్రయత్నించింది. అవగాహన లేని సాహసోపేత విధాన మది. స్టాలిన్, ట్రాటస్కీల మధ్య కొమింటాంగ్‌లో ముఠా తగాదాల వలన పరిస్థితి యింకా జటిలమైంది. ఎప్పటికప్పుడు అందుతున్న మార్గదర్శక సూత్రాలను చేతనైనంత మేరకు ప్రయత్నించాడు. ప్రతికూల పరిస్థితులలో అతను పని చేయవలసి వచ్చింది. వాస్తవాధికారంగల చైనా కమ్యూనిస్టు పార్టీ, బరోజన్‌లతో రాయ్‌కు తీవ్రమైన అభిప్రాయ భేదాలున్నాయి. బాహ్య పరిస్థితులు

కూడా రాయ్‌కు వ్యతిరేకంగా వున్నాయి. ఎదేశీ సామ్రాజ్యవాదం మద్దతుతో ఫ్యూడల్ సైనిక వాదులు, బూర్జువా వర్గాలు విపరీతమైన శక్తివంతంగా వున్నారు. వారితో పోల్చిచూస్తే కార్మిక, కర్షక సంఘాలు చాలా బలహీనంగా వున్నాయి.

మాస్కో టెలిగ్రాం పాంగ్-చింగ్-వైరు చూపినందుకు చాలా మంది రాయ్‌ను విమర్శించారు. ఇది ద్రోహం అని ఖండించేటంత వరకు కొందరు పూనుకున్నారు. కొన్ని సంవత్సరాల తరువాత రాయ్ భారత దేశానికి తిరిగి వచ్చినప్పుడు కమ్యూనిస్టులు అతనికి వ్యతిరేకంగా ఈ ప్రచారం చేశారు. అధమం యిది విచక్షణా రహితం కావచ్చు. దీనివల్ల ఏమీ జరగలేదు. వామపక్ష కొమింటాంగ్ నాయకులు తాము చేయదలచుకున్నదేదో అప్పటికే నిర్ణయించేశారు. కొమింగ్‌టరన్ అధికార పత్రాలలో రాయ్‌కు వ్యతిరేకంగా యిటువంటి ఆరోపణ ఏమీ లేదు.

చైనాలో తన కృషి విఫలం కావటంతో కొమింటాంగ్ నాయకత్వంలో రాయ్ పతనం ప్రారంభమైంది. రెండేళ్ళకు దానితో రాయ్ చివరిసారిగా తెగ తెంపులు చేసుకున్నారు.

# 7 వ అధ్యాయం

## కొమింటాంగ్‌తో అభిప్రాయ భేధాలు.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీలో వచ్చిన అభిప్రాయభేధాలే కొమింటాంగ్ అభిప్రాయభేధాలుగా ప్రతిబింబించాయి. మొదటినుంచీ కొమింటరన్ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఆధిపత్యాన వున్నది. విప్లవాన్ని సాధించిన ఏకైక దేశం కావటం, ప్రపంచవ్యాప్తంగా విప్లవ కార్యకలాపాలు పెంపొందించటానికి అవసరమైన వనరులు కేంద్ర సంఘానికి యివ్వగలిగేది రష్యా మాత్రమే చేయగలిగింది. ఈ ఆధిపత్యం రానురాను స్పష్టపడింది. కొమింగ్టర్న్‌లో ఏదైనా పాత్ర నిర్వహించదలచిన వారు సోవియట్ పార్టీ నాయకుల కనుసన్నలలో మెలగవలసి వచ్చింది. కొమింగ్టర్న్ యించుమించు సోవియట్ యూనియన్‌కు విదేశీ కార్యాలయంగా వున్నది. "కమ్యూనిస్టు యింటర్నేషనల్" అనే పుస్తకంలో కొమింటర్న్ ఎలా దిగజారిపోయిందో, రాయ్ బాగా చిత్రించారు.

1924 జనవరిలో లెనిన్ మరణానంతరం సోవియట్ కమ్యూనిస్టుపార్టీలో భేదాలు తీవ్రమైనవి. నాయకత్వం కోసరం ట్రాట్‌స్కీ, స్టాలిన్‌ల మధ్య పోటీ జరిగింది. సోవియట్ యూనియన్ అనుసరించవలసిన విధానాల గురించి అభిప్రాయభేధాలున్నాయి. శాశ్వత విప్లవం అని సోషలిజం ఒకే దేశంలో అని రెండు పరస్పర విరుద్ధ నినాదాలు యీ భేదాలను సూచిస్తున్నాయి. శాశ్వత విప్లవం అనేది ట్రాట్‌స్కీతో ముడిపడి వుండగా ఒకేదేశంలో సోషలిజం అనేది స్టాలిన్‌తో సంబంధం కలిగినది. తరుచు అనేక సున్నిత ఛాయాభేదాలు వీటిల్లో లేకపోలేదు. భిన్న మతాల స్థితి కూడా ఎప్పటికప్పుడు మారుతూవచ్చింది. ఈ భేదా

ఒలో రాయ్ మాత్రం స్టాలిన్‌కు అండగా వున్నారు. రష్యాలో సాధించిన విప్ల వాన్ని కట్టుదిట్టంగా ఎంచుకోవాలని స్టాలిన్ చెప్పిన విధానాలని రాయ్ కూడా విశ్వసించాడు. ఈ విధానాన్ని నమ్మని కమ్యూనిస్టులను చాలామందిని సోవియట్ కమ్యూనిస్టు పార్టీనుంచి కొమింగ్‌టర్న్ నుంచి గెంటి వేశారు.

1928 నాటికి తన శత్రువులను స్టాలిన్ పార్టీలో యింకా నాశనం చేయ లేదు. అందుకోసరం వామపక్షంగా మళ్ళడం అవసరం అని అతను భావించాడు. తదనుగుణంగా మొదటి పంచవర్ష ప్రణాళికలో భారీ పరిశ్రమలు వ్యవసా యాన్ని సమిష్టీకరణం చేయడం మొదలెట్టాడు. 1921లో క్రొత్త ఆర్థిక విధానం పట్ల లెనిన్ ఆర్థిక రంగంలో వేసిన వెనుకంజపై దెబ్బ తీయటం జరిగింది. జాతీయ రంగంలో యిలా దెబ్బతీసిన ఫలితం అంతర్జాతీయ రంగంలోను ప్రతి బింబించాలి. 6వ కొమింగ్‌టర్న్ కాంగ్రెసు 1928 సెప్టెంబరులో జరిగినప్పుడు, అప్పటి వరకు రాజకీయ, కార్మిక సంఘాలలో అనుసరించిన ఐక్య సంఘటన విధానాన్ని తల్లక్రిందులు చేసే నిర్ణయాలు తీసుకోవటంలో పెద్దమార్పు వచ్చింది. వర్గానికి వ్యతిరేకంగా వర్గం అనే విధానాన్ని అనుసరించాలని నిర్ణయించారు. దీన్ని అంగీకరించిన వార్ని ఫాసిస్టులని, ప్రతి విప్లవవాదులని ఖండించారు. పెట్టుబడిదారీ విధానం మూడవ, చరమ స్థాయికి చేరుకున్నదని యిది పతనా వస్థలో వున్నదని సిద్ధాంతీకరించి దీనికి వ్యతిరేకంగా ఎదురు దెబ్బ తీయాలని పిలుపు నిచ్చారు. సిద్ధాంత పరమైన విధాన నిర్ణయాలను రాయ్ అంగీకరించక, వీటికి వ్యతిరేకంగా అరమరికలు లేకుండా తన అసమ్మతిని తెలియ పరచాడు.

చైనాలో కృషి విఫలమైన తరువాత రాయ్ కరుణా కటాక్షాలను కోల్పో యాడు ట్రాటస్కీకి వ్యతిరేకంగా పోరాటంలో స్టాలిన్‌కు చైనాలో వాస్తవం గానూ, లేక ఊహా జనితమైన విజయమో కావలసి వచ్చింది. దానిని రాయ్ సాధించలేక పోయారు. కనుక స్టాలిన్, అతని అనుచరుల తీవ్ర అసమ్మతికి గురి అయ్యాడు. చైనానుంచి తిరిగి వచ్చిన తరువాత రాయ్‌ను కలుసుకోవటానికి

స్టాలిన్ నిరాకరించాడు. తన ఉపన్యాసాలు, ప్రకటనలు మొదలైన వన్నీ ఒక క్రమంలో పెట్టి బెర్లిన్ వెళ్ళి పోవలసివచ్చింది. 1928 ఫిబ్రవరిలో కమ్యూనిష్టు యింటర్నేషనల్ కార్యవర్గ సమావేశం చైనా సమస్యను చర్చించటానికి మాస్కోలో జరిగింది. తన దృక్పధాన్ని వెల్లడించటానికి రాయ్ నిశ్చయించాడు. సమావేశంలో పాల్గొనే నిమిత్తం మాస్కో వెళ్ళాడు. కానీ అతనికి అవకాశం లభించలేదు. సమావేశం జరుగుతుండగా చెవిపోటుతో రాయ్ తీవ్రంగా జబ్బు పడ్డాడు. కొమింటర్న్ సభ్యులు ఉద్దేశించిన ఆస్పత్రికి బదులు మాస్కో శివార్లలోవున్న చికిత్సకు తగినంత సాధన సంపత్తిలేని ఆస్పత్రికి పంపారు. అంతటితో రాయ్ మిత్రులకు అనుమానం కలిగింది. రహస్యంగా వెళ్ళిపోవడానికి వారు ఏర్పాట్లు చేశారు [కమ్యూనిజం, నేషనలిజంఇన్ఇండియా, ఎం. ఎన్. రాయ్ అండ్ కొమింటర్న్ పాలసీ 1920-1929 జె. పి. హైత్‌కాక్స్, ప్రిన్స్‌టన్ యూనివర్సిటీ ప్రెస్ 1971 పుట 86, 87]. బుఖారిన్ సహాయంతో యిదంతా జరిగిందనీ అనుమానం లేక పోలేదు. అదే రాయ్ మాస్కోకు వెళ్లడం ఆఖరుసారి. పారిపోకుంటే, రాయ్ కూడా స్టాలిన్ ఆగ్రహానికి గురైన అనేక మందిలో ఒకడై ఉండేవాడు.

ఆరవ కొమింటర్న్ కాంగ్రెస్‌లో రాయ్‌పై రాజకీయ దాడి ప్రారంభమైంది. బుఖారిన్ యధాలాపంగా వాడిన డీకాలనైజేషన్ అనే సమస్యపై చర్చ సాగింది. కాంగ్రెస్ జరిగిన కొన్ని వారాలకు రాయ్ కొమింటర్న్‌కు పంపిన సుదీర్ఘ వివరణలో యీ విషయం పేర్కొన్నాడు. ఈ పదానికి తప్పుడు అర్థాన్ని యిచ్చారు. రాయ్‌ను, గ్రేట్ బ్రిటన్ కమ్యూనిస్టు పార్టీ నాయకులలో మహామహులు పామీదత్త, ఎ. జె. బెన్నెట్‌లతో సహా అనేకమంది యీ సమావేశంలో ఖండించారు. అభియోగాలను తిప్పికొట్టడానికి రాయ్ యీ సమావేశంలో హాజరు కాలేకపోయాడు. అనారోగ్యం అడ్డొచ్చింది. ఇతరులు, ముఖ్యంగా గ్రేట్ బ్రిటన్ కమ్యూనిస్టు పార్టీ నాయకులు సమావేశంలో రాయ్ దృక్పధాన్ని సమర్థించారు. కానీ అంతా వృధా ప్రయాస అయింది. ఒక చరిత్రకారుడు

సూచించినట్లు, డీకాలనై జేషన్ అనే పదాన్ని భ్రష్టపదం గా భావించాలనీ, ఆ ప్రాతిపదికపై రాయ్‌ను ఖండించాలని రష్యా నాయకులు నిర్ణయించారు. యూజిన్ వర్గం అనే ఆర్థిక సిద్ధాంతకారుడు ప్రతి పాదించిన సిద్ధాంతం ఆధారంగా కుసినిన్ యీ దాడిని మొదలుపెట్టాడు. వర్గ సిద్ధాంతాన్ననుసరించి భారతదేశాన్ని తన వ్యవసాయ బంధ దేశంగా బ్రిటన్ భావిస్తున్నదనీ, ముడి పదార్థాలకు ఆధారంగానూ, బ్రిటిష్ ఎగుమతి పరిశ్రమ లకు మార్కెట్‌గానూ చూస్తున్నదనీ, కనుక పారిశ్రామికీకరణ కంటె గ్రామీ కరణ ఎక్కువగా వున్నదని సారాంశం.

వర్గ సిద్ధాంతాన్ని రాయ్ వ్యతిరేకించాడు. యుద్ధానంతర పరిస్థితుల వలన గ్రేట్ బ్రిటన్ తన పాత విధానాన్ని మార్చుకోవలసి వచ్చిందని, పరిశ్రమలు విస్తరింపడం అనే పద్ధతి అనుసరించడం లేదని రాయ్ సూచించాడు. రాయ్ భావించిన డీకాలనైజేషన్ బూర్జువాల దృష్ట్యా చెప్పిందే గాని, కార్మికుల, కర్ష కులను ఉద్దేశించింది కాదు. రాయ్ యిలా అన్నాడు: భారతదేశ బూర్జువా వర్గం కేవలం వలస అణచివేత నుంచి క్రమంగా స్వయం పాలన స్థితికి, బ్రిటిష్‌సామ్రా జ్యం ఆధ్వర్యాన పరిణమిస్తున్నారు. కనుక విప్లవం అనే చిక్కు మార్గాన పయ నించాల్సిన అవసరం వారికి లేదు. అంటే భారతీయ బూర్జువా వర్గం ఆర్థిక రాజకీయ అంతస్థులో క్రమేణా వలస స్థితినుంచి తప్పుకుంటుంటే విప్లవం వల్ల జుగుప్స కలగడమే గాక, భవిష్యత్తులో వలస రీతులు బాగాతొలగిపోయినప్పుడు వీరు ప్రత్యక్షంగా ప్రతి విప్లవకారులవుతారు వలస బూర్జువా వర్గానికి కొంత రాజకీయాధికారాన్ని సంక్రమింప చేసినంత మాత్రాన సామ్రాజ్యవాదం బల హీనం కాదు. దేశీయ బూర్జువా వర్గానికి యిటువంటి శక్తి వున్నది. కనుకనే సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని ముందుకు తీసుకుపోదు సరి కదా, విప్లవోద్యమాన్ని అణచివేస్తారు. ఇతర వలస దేశాలలో యిది అనుభవ రీత్యా రుజువైంది. కనుక భారతీయ బూర్జువా వర్గం వలస వాదం నుంచితప్పు

కోవడం భ్రమ కాదు. పరిస్థితి అంతటిలో యిదే కీలకమైనది. (అవర్ డిఫరెన్సెస్, ఎం.ఎన్. రాయ్, సరస్వతి లైబ్రరీ, కలకత్తా 1938 పుట 112,113).

1929లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గానికి సమర్పించినసమగ్ర ప్రకటనలో రాయ్ ఈ పరిశీలన చేశాడు. 'మా అభిప్రాయ భేదాలు' అనే గ్రంథంగా యిది ప్రచురితమైంది.

డీకాలనైజేషన్‌కు రాయ్‌కు వ్యతిరేకంగా జరిగిన దాడి ఏమంత ముఖ్యం కాదు. కొత్త పంథాను అనుసరించడమే ముఖ్యం. ఇదొక అతివాద వామపక్ష సాహసోపేత పంథా. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 10వ సర్వసభ్య సమావేశంలో విపులీకరించినట్లు, భారత జాతీయ కాంగ్రెస్‌తో సంబంధాలు తెంచుకోమని, ఇండిపెండెన్స్ లీగ్ వంటి వామపక్షాలతో కూడా తెగతెంపులు చేసుకోమని భారత కమ్యూనిస్టులను అడిగారు. వీరందరూ సామ్రాజ్య వాదానికి, పెట్టుబడి దారీ విధానానికి బంటులనీ, విప్లవానికి ద్రోహులనీ ప్రచారం చేయమన్నారు. కార్మిక కర్షక పార్టీలను హరించి వేయాలని, కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటన నిర్మించమని కూడా కోరింది. కార్మిక రంగంలో వ్యవస్థాపిత సంఘాలతో సంబంధం తెంచుకోమని, కమ్యూనిస్టు కార్మిక సంఘాలను నిర్మించమని, కార్మిక పోరాటాలను తీవ్రతరం చేయమని, దేశవ్యాప్తంగా రాజకీయ సమ్మెలు సిద్ధం చేయమని కూడా కమ్యూనిస్టు పార్టీకి పిలుపు యిచ్చింది. రాజకీయంగానూ, కార్మిక రంగంలో యిచ్చిన ఆదేశాలన్నీ అవాస్తవికాలేకాదు. విచ్ఛిన్నకరమైనవి కూడా. కమ్యూనిస్టులు యీ విధానం వలన అడవులపాలై, చిన్న ముఠాగా మారిపోయారు [అవర్ డిఫరెన్సెస్ పుట 180-185]. అంతవరకు రాయ్ మార్గదర్శకత్వాన కమ్యూనిస్టులు అనుసరిస్తున్న మార్గానికి భిన్నంగా కొత్తమార్గాన్ని తొక్కారు. కొత్త కొమింటర్న్ పంథా ఐరోపా దేశాలలో కూడా విచ్ఛిన్నకర ఫలితాలనే సృష్టించింది. ముఖ్యంగా జర్మనీలో ఫలితాలు పతనావస్థకు చెందినట్టివి. హిట్లర్ తలెత్తడానికి యివి భౌతికంగా దోహదం చేశాయనవచ్చు. సోషల్ డెమొక్రాట్లను సోషల్ ఫాసిస్టులు

ఆనేటంతవరకూ వ్యతిరేక ఉద్యమాన్ని సాగించడం, ఫాసిస్టుల కంటే వీరే కమ్యూనిస్టులకు బద్ధ శత్రువులనడం, అలాగే వ్యవస్థాపిత కార్మిక సంఘాలను చీల్చి నాశనం చేయడంతో, కార్మికులలో నైతిక స్థాయి పోయి, హిట్లర్ బెడద పెరుగుతుంటే నిరోధించలేనంతగా బలహీనపడ్డారు.

కాంగ్రెస్ సమావేశం జరిగిన కొంతకాలానికి, క్రమ శిక్షణకై ఉద్యమం మొదలు పెట్టారు. కొత్త పంథాను తరమరికలు లేకుండా ఆమోదించని వారిని పార్టీ నుంచి, కొమింటర్న్ నుంచి నెట్టేశారు. నిరసన వ్యక్తం చేసిన గ్రేట్ బ్రిటన్ కమ్యూనిస్టు పార్టీ సభ్యులను లొంగేటట్లుచేసి, ఒక సంవత్సరం తరువాత కొత్త నాయకత్వాన్ని తెచ్చి పెట్టారు. అమెరికాలో నిరసన తెలిపిన వారు అధిక సంఖ్యలోవున్నారు. 1929 జూన్‌లో వారందరినీ మితవాద ధోరణి అనుసరిస్తున్నందుకు పార్టీ నుంచి బహిష్కరించారు. జర్మనీలో రాయ్ స్నేహితులు, బ్రాండ్లర్, తాల్ హైమూర్‌లను యిదే కారణంతో పార్టీ నుంచి నెట్టి వేశారు. బుఖారిన్‌ను కూడా వదలలేదు. మరుసటేడే బుఖారిన్‌ను కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ పొలిట్ బ్యూరో నుంచి బహిష్కరించారు. కొమింటర్న్‌లో మితవాదులను బలపరుస్తున్నట్లు యితనిపై ఆరోపణ చేశారు. (హెత్‌కాక్స్, పుట 190, 197)

తీవ్ర నేరస్తుడు, కుసినిన్ ప్రకారం సామ్రాజ్యవాద బంటు డీకాలనైజేషన్ సిద్ధాంతానికి పితామహుడైన రాయ్‌పైచర్య తీసుకోవడానికి, ఆసక్తికరంగా ఒక సంవత్సరం జాప్యం చేశారు. 1929 జూన్‌లో జరిగిన సర్వసభ్య సమావేశంలో రాయ్‌ను దుర్మార్గుడు అని ఖండించారు. కానీ ఆరునెలల అనంతరం చర్య తీసుకున్నారు 1929 డిసెంబరు 13 ఇంప్రెకార్‌లో ఒక ప్రకటన చేశారు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సర్వసభ్య సమావేశం తీర్మానాన్ననుసరించి, (అంతర్జాతీయ పరిస్థితిపైన, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కృషిపైన-9వ పేరా) 1929 డిసెంబరు 19 కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రిసీడియం నిర్ణయం ప్రకారం, బ్రాండ్లర్ సంస్థకు అంటి పెట్టుకున్నవారు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్

సభ్యులు కాజాలరు. బ్రాండ్లర్ పత్రికకు వ్రాస్తున్న అతని వ్యవస్థను సమర్థిస్తున్న రాయ్, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు వెలుపల వున్నాడు. అతనిని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుంచి బహిష్కరించినట్లు భావించాలి? (కమ్యూనిజం ఇన్ ఇండియా, ఓవర్‌స్ట్రీట్ అండ్ విండ్ మిల్లర్ పుట 140, 141). ఈ చర్యకు ఇంత జాప్యం ఎందుకు జరిగిందో కారణం చెప్పలేదు. కొమింటర్న్ అధికారులు, రాయ్ తాను చెప్పిన దాని నుండి వెనక్కు జారుకుంటాడనో, కనీసం మౌనం వహిస్తాడనో ఆశించారు. కాని రాయ్ వెనుకంజ వేయలేదు. మౌనంగానూ వుండలేదు. తన భావాలు వ్యక్తం చేస్తూనేపోయాడు. జర్మనీ, అమెరికాలో నిరసన తెలిపిన వారితో రాయ్ కలసి, ఆరవ కాంగ్రెస్ అవలంబించిన పంథాను సరిదిద్దుకోమంటూ వత్తిడి చేశాడు. బ్రాండ్లర్ పక్షం వారి పత్రికలో యీ పంథాను తీవ్రంగా విమర్శిస్తూ వ్యాసాలు వ్రాశాడు. ఇది సహించలేక చివరకు కొమింటర్న్ నుంచి రాయ్‌ను బహిష్కరించారు.

కొమింటర్న్ సభ్యులకు వ్రాసిన బహిరంగ లేఖను తరువాత "అవర్ డిఫరెన్సెస్" పేరిట రాయ్ ప్రచురించాడు. 10వ సర్వసభ్య సమావేశంలో ఏం జరిగిందీ కళ్ళకు కట్టినట్లు రాయ్ వివరించారు. తన స్థితిని సమర్థించుకున్నాడు. ఇందులో నుంచి కొన్ని ప్రస్తావనలు ఆసక్తికరంగా వుంటాయి. కొంత కాలం పవిత్ర ఉరికంబం ముందు నేను వున్నాను దీనిని పిచ్చిగా అన్వయించడం వలననే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఉద్యమంలో బీభత్సం జరుగుతున్నది. ఒక ఏడాది పాటు నేను ఆ స్థితిలో వున్నాను. నాకు విపత్తు వస్తుందనే భయంతో కాదు. ఉద్యమ నాయకత్వాన్ని కాజేసిన వారి చేతకానితనం చూసి దిగ్భ్రమ చెందాను. బాధ్యతారహితమైన నాయకత్వం అసమర్థతతో ఉద్యమాన్ని ఎలా నాశనం చేస్తున్నదో చూసి ఆశ్చర్యపోయాను. ఎందుకు ఆలస్యమైందో గాని, చివరకు నా వంతు వచ్చింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ 10 వ కార్యవర్గ సమావేశంలో, కుసినిన్ బాధ్యత లేకుండా నా తల బలి కోరాడు. జర్మన్ ప్రతిపక్ష పత్రికలకు నేను వ్యాసాలు వ్రాయడం యిటీవలే చేసిన నేరంగా పేర్కొని

అటువంటి నీచమైన నేరం చేసిన తరువాత, యింకా తాను ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు పేర్కొన్న కామ్రేడ్లలో వుండదగడు, అన్నారు. జనం తంధానా అన్నారు. తల తీయండి అనే నినాదం ఒక మూల నుంచి వినిపించింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను యించుమించు స్థాపించినప్పటి నుంచి సంబంధం వున్న వ్యక్తిని, వామపక్ష ధోరణులలో పోతున్నాడని ఆరోపించి విమర్శించిన వ్యక్తిని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వెలుపల వుంచారు. (అవర్ డిఫరెన్సెస్ పుట 26).

డీకాలనైజేషన్ సిద్ధాంతానికి కుసినిన్ చేసిన వక్రభాష్యం గురించి రాయ్ యిలా వ్రాశాడు: నా సంపాదకత్వాన వెలువడిన వాన్‌గార్డ్ మాసెస్ పత్రికలలో యిన్నేళ్ళగా సోషల్ డెమొక్రటిక్ సిద్ధాంతాన్ని ప్రచారం చేశానని చెప్పేటంత దూరం వెళ్ళాడు. ఆ పత్రికలు తిరగేస్తే యీ విషయం కేవలం నిరాధారమని తెలుస్తుంది కుసినిన్ ఆరోపణ నిరూపించే ఒక్క ప్రకటన అయినా అందులో చూపమనండి. 1922 మే నుంచి 1929 ఆరంభం వరకు భారతదేశంలో కమ్యూనిస్టు ప్రచారం నిమిత్తం నా సంపాదకత్వాన ఆ పత్రికలు ప్రచురితమయ్యాయి. (నేను చైనాలో వున్న ఎనిమిది మాసాల కాలంలో 1927లో మాత్రం బాధ్యత నాది కాదు) అంతకాలం కూడా మితవాద మార్గం అనుసరించినందుకు ఒక్కసారైనా నన్ను అభిశంసించలేదు. ఇప్పుడు నేను యిన్నాళ్లుగా సోషల్ డెమొక్రాట్‌ననీ, సామ్రాజ్యవాద బంటుననీ కనుగొన్నారు అంటే, తార్కికంగా, ఆరవ కాంగ్రెస్ వరకూ, భారతదేశాన్ని గురించి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు తప్పుడు భావమే వున్నదన్నమాట. 6వ కాంగ్రెస్ సిద్ధాంతం, నివేదిక లెనిన్ విజంలో అత్యంత వివేచన చూపినదైతే, వలస విషయమై ముఖ్యంగా భారత దేశం గురించి, లెనిన్ జినోవీఫ్, బుఖారిన్, స్టాలిన్, అందరూ వరుసగా లెనిన్ వ్యతిరేకులే. సామ్రాజ్యవాదానికి బంట్లుగా వుండే సోషల్ డెమొక్రాట్లే. ఇదే ఆరవ కాంగ్రెస్‌లో వలస విషయమై తీర్మానం సారాంశం. లెనిన్ బోధనల ఎత్తుగడల నుంచి యిదంతా తీవ్రంగా దారి తప్పింది. [అవర్ డిఫరెన్సెస్ పుట 27-29].

ముగింపు యిలా చేశాడు. నాకు అంటగట్టిన నేరాలు నేను చేయలేదు. నేను స్వతంత్ర ఆలోచన అభిలషిస్తున్నాను. ప్రస్తుతం కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సంక్షోభ సమయంలో వుండగా, అటువంటి ధోరణి అనుమతించరు. నా భేదాభిప్రాయాన్ని బయటకు మాట్లాడనంతవరకు నన్ను ద్రోహి అనలేదు. అధికార ఇంటర్నేషనల్ పరిధికి వెలుపల వుంచలేదు. నన్ను బలవంతంగా మౌనం వహించేటట్లు చేశారు. సర్వశక్తి వంతమైన ప్రచార సాధనాలు నాకు వ్యక్తీకరణ లేకుండాచేశాయి. స్వతంత్ర ఆలోచన క్షమించరాని నేరానికి నన్నెప్పుడో అంధకారంలో వుంచేవారే. కాని నేను ధైర్యం చేసి నా అభిప్రాయం వినిపించాను. నిరంకుశ క్రమశిక్షణకు మించి పోయి విప్లవవాది కొన్ని పర్యాయాలు ప్రవర్తించవలసి వుంటుంది....ప్రసుతం ఇంటర్నేషనల్‌ను నాశనం చేసున్న నాయకత్వానికి వ్యతిరేకంగా ప్రతిపక్షంలో చేరడం నా విప్లవ కర్తవ్యంగా భావించాను.

భారతదేశం విషయమే గాక, 6వ కాంగ్రెస్ తీర్మానాలన్నిటితో నేను విభేదిస్తున్నాను. ఒకానొక విషయమై దోషం వుంటే, కాలానుగుణంగా సరిదిద్దుకుంటారని ఆశతో వేచి వుండవచ్చు. మనదేశంలో అనుసరించిన పంథా ఘోరమైన తప్పిదాలలో ఒక భాగం మాత్రమే. కనుక పూరకుండడం సాధ్యపడదు. ఇంటర్నేషనల్ సంక్షోభంలో వున్నది. ఆ విషయం దాని నాయకత్వంలోనే తెలుస్తున్నది. [అవర్ డిఫరెన్సెస్ పుట 42, 43].

ఈ బహిరంగ లేఖ ప్రభావం ఏమీ లేక పోయింది. ఉన్మత్త పంథాను 1935 లో కొమింటర్న్ కాంగ్రెస్ దిద్దుకొనేవరకూ కొనసాగించారు. ఈలోగా హిట్లర్ తన ఫాసిస్ట్ నియంతృత్వాన్ని జర్మనీపై విధించాడు. ఆరవ కాంగ్రెస్ పంథాను స్టాలిన్ తప్పనిసరిగా పునరాలోచించ వలసి వచ్చింది. రాయ్ కోరినట్లు పంథాను మార్చుకొన్నప్పటికీ, కొమింటర్న్‌లో రాయ్‌ను మళ్ళీ చేర్చుకునే విషయం పరిశీలించలేదు.

బహిష్కరణ అనంతరం, రాయ్‌పై కొమింటర్న్ అనేక అపవాదులు మోపింది. భారతదేశంలో కమ్యూనిస్టు బలాన్ని గురించి అతిశయోక్తిగా చెప్పాడని, అందులో తన ప్రభావపు గొప్పతనం చెప్పుకున్నాడని ఒక అభియోగం మోపారు. చాలా డబ్బు దుర్వినియోగ పరచాడని మరొక ఆరోపణ చేశారు. ఎటువంటి నివేదికలు రాయ్ పంపాడో, ఎంత డబ్బు అతనికి యిచ్చారో చెప్పనిదే యీ అభియోగాలను తీవ్రంగా పరిగణించడానికి వీల్లేదు. ఈ రెండు రహస్యాలను క్రెమ్లిన్ నేటికీ బయట పెట్టదలచ లేదు. అయితే క్రెమ్లిన్, కొమింటర్న్‌లు భారతదేశంలో ఒక్క రాయ్ ద్వారానే కృషి చేయలేదని మాత్రం చెప్పవచ్చును.

కొమింటర్న్‌తో విడిపోవడం రాయ్‌కు తీవ్ర విఘాతమైంది. భారత స్వేచ్ఛకై అతని కృషికి యిది ఆటంకం కలిగించింది. 1929 మధ్య వరకూ కమ్యూనిస్టు పత్రికలలో భారతదేశాన్ని గురించి వ్రాశాడు. తరువాత అది కూడా బిగుసుకపోయింది. భారత విప్లవానికి తోడ్పడడానికి అన్యమార్గాలు అన్వేషించుకోవలసి వచ్చింది. ఊహల ఉత్సాహం గల రాయ్, మార్గాన్ని త్వరలోనే కనుగొన్నాడు. వచ్చే అధ్యాయంలో ఆ మార్గాన్ని, దాని ఫలితాలను పరిశీలిద్దాం.

## 8 వ అధ్యాయం

# మళ్ళీ స్వదేశానికి-జైలుకు

స్వదేశానికి రావాలని, పోరాటంలో పాల్గొనాలని రాయ్ నిత్యం తహ తహ లాడేవాడు. మాస్కో భారతదేశానికి దారిలో వున్నది కనుక అక్కడికి వెళ్ళడానికి అంగీకరించాడు. రెండవ కొమింటర్న్ కాంగ్రెసు తరువాత, తాష్కెంట్‌లో తనను నియమిస్తే స్వదేశానికి దగ్గరలో వుంటున్నందుకు ఆ పదవిని ఆహ్వానించాడు, తరువాత స్వదేశానికి పోవాలన్న కోర్కెను లెనిన్ సలహాపై నిగ్రహించుకున్నాడు. తనతోబాటు పనిచేసే కొద్దిమందిని సిద్ధం చేయకుండే వెళ్ళరాదని లెనిన్ చెప్పాడు. కొన్ని కమ్యూనిస్టు ముఠాలను ఏర్పరిచిన తరువాత మళ్ళీ కోరిక పెల్లుబికింది. తనను పోనివ్వమని చాలా పర్యాయాలు స్టాలిన్‌ను కోరాడు. చైనాలో కృషి పూర్తి కాగానే పోవడానికి స్టాలిన్ ఒప్పుకున్నాడంటారు. అయితే చైనా కృషి విఫలమైంది. స్టాలిన్ వద్ద రాయ్ ప్రభావం పోయింది. కొమింటర్న్ వెలుపల రాయ్‌ను అట్టి పెట్టారు. స్వశక్తిపై వున్న రాయ్, స్వదేశానికి వెళితేనే తాను ఉపయోగ పడగలననుకున్నాడు. ఆరవ కొమింటర్న్ కాంగ్రెసు అతివాద పంథాను అనుసరించిన కమ్యూనిస్టులు తమను తాము నాశనం చేసుకోవడమే కాక, వామ పక్ష ఉద్యమాన్ని ధ్వంసం చేయడాన్ని విచారకరంగా రాయ్ గమనించాడు. గాంధీజీ ప్రారంభించిన ప్రజా ఉద్యమం ప్రబలడం గమనించాడు. కాంగ్రెసును విప్లవ మార్గాన నడిపే దివ్యమైన అవకాశం లభించిందనుకున్నాడు.

1930 మధ్యలో రాయ్ నిశ్చయించుకున్నాడు. అప్పటికి తన దృక్పథాన్ని అంగీకరించిన కొందరు యువకులు, తనకు వ్యక్తిగతంగా విధేయులుగా

వున్నవారు దేశంలో సిద్ధమయ్యారు. లోగడ తాను భారతదేశంలోనూ ఐరోపా లోనూ శిక్షణ యిచ్చిన కమ్యూనిస్టులు కొమింటర్న్ లోనే వుండదలచారు. వారు రాయ్‌తో తెగతెంపులు చేసుకుని, కొమింటర్న్ ముఠాతో చేరి రాయ్‌ను ఖండించడంలో వంత పాడారు.

స్వదేశానికి రావాలన్న తన ఆలోచనను రాయ్ మిత్రులతో సంప్రదించాడు. అందుకు అనుమతించి, వెంటనే ముగ్గురూ స్వదేశానికి వెళ్ళి రాయ్ రాకకు రంగం సిద్ధం చేయాలనుకున్నారు. బొంబాయికి చెందిన షేక్ తయ్యాబ్ సుందర్ కబడి, లక్నోకు చెందిన బ్రజేష్‌సింగ్ యీ కర్తవ్యానికి పూనుకున్నారు. రాయ్ ఒక ప్రణాళిక సిద్ధం చేశాడు. కాంగ్రెస్ ప్రారంభించిన ప్రజా ఉద్యమం అంచెల వారీగా విప్లవోద్యమంగా పెంపొందించవచ్చుననీ, సాంఘిక విప్లవంలో తొలిదశలో జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించవచ్చుననీ పేర్కొన్నాడు. ఆ ప్రణాళికతో వీరు ముగ్గురూ భారతదేశానికి వచ్చారు. కాంగ్రెసు కార్యకర్తలు, యూత్‌లీగ్ తదితరులు యీ ప్రణాళికకు అమోదాన్ని చూపేటట్లు చేయాలని ఉద్దేశించారు. (ఎ. కె. హింద్ వ్రాసిన ఎం. ఎన్. రాయ్ ది మాన్ హు లుక్డ్ ఎహెడ్, మోడరన్ పబ్లిషింగ్ హౌస్, అహమ్మదాబాద్ 1928, రాయ్ నడిపిన "ఇండిపెండెంట్ ఇండియా" అనే వారపత్రిక యీ అధ్యాయానికి ఆధారం )

స్వదేశానికి చేరగానే తన గతి ఏమౌవుతుందో రాయ్‌కు తెలుసు. జైలులో కనీసం కొన్నేళ్ళయినా గడపవలసి వుంటుందని తెలుసు. భారత స్వేచ్ఛా పోరాటాన్ని కావాలని ఎంపిక చేసుకున్నందుకు అతను చెల్లించవలసిన పరిహారం అదంతా. జర్మనీలో మిత్రులు యిందుకు యిష్టపడలేదు. ఈగడ్డు మార్గాన్ని అవలంబించనీయకుండా సాధ్యమైనంత వరకు వారు ప్రయత్నించారు. వారి అభిప్రాయాన్ని లెక్కచేయక, అనుకున్నట్లు చేయడానికి రాయ్ పూనుకున్నాడు. పోలీస్ తనను పట్టుకొనక ముందే నిర్దుష్టంగా కొంత కృషి చేయగలనను కున్నాడు. తన విడుదల అనంతరం నిర్మించడానికి వీలుగా పునాదులు వేయ

దలచాడు. తానుగా అరెస్టు కాదలచలేదు. అందుకని దూరంగా పారిపోదలచ లేదు కూడా. జాతీయోద్యమంలో వుంటూ కొంత మేరకైనా ప్రభావితం చేసి, తన ఆలోచన ఆచరణలో పాల్గొనేటట్లు సాధ్యమైనంత మందిని ఆకర్షించ దలచాడు.

ఏడు మాసాలపాటు రాయ్ అరెస్టు కాకుండా వుండగలిగాడు 1931 జూలై 21న బొంబాయిలో అరెస్టు అయ్యాడు. డాక్టర్ మహమూద్ పేరిట బొంబాయిలో వుండేవాడు. ఆ ఏడు మాసాలలో బొంబాయిలోనూ, ఉత్తర ప్రదేశ్‌లోని కొన్ని ప్రాంతాలలోను తిరిగాడు. జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయ్ పటేల్, ఎన్. ఎం. జోషి, బి. ఆర్. అంబేద్కర్ ఇంకా కార్మిక నాయకులను కలుసుకున్నాడు. కరాచిలో కాంగ్రెసు మహాసభకు వెళ్ళాడు. సుభాష్ చంద్ర బోస్‌ను కలిశాడు. కరాచి తీర్మానంగా సుప్రసిద్ధి గాంచిన తీర్మాన మౌలిక ప్రతిపాదనలను జవహర్‌లాల్ నెహ్రూతో చర్చించాడు. ఒకప్పుడు భావించినట్లు యీ తీర్మానం వ్రాయడంలో రాయ్ ప్రమేయంలేదు అయితే కాంగ్రెస్‌కు ఆర్థిక కార్యక్రమం వుండాలని నెహ్రూకు నచ్చచెప్పింది రాయ్ మాత్రమే. అరెస్టు కాక పూర్వం బొంబాయిలో రాయ్ వర్గం ఏర్పడడం ఇతరచోట్లకూడా యిలాంటివి తలెత్తడం రాయ్ కృషిలో ముఖ్యమైనవి. ఈ ముఠాలలో యువకులు, ఉత్సాహవంతులైన కాంగ్రెస్ కార్యకర్తలు, కార్మిక యువజన ఉద్యమాలలోని వారూ కొందరు వున్నారు. రాయ్ కార్యక్రమాన్ని అంగీకరించిన వాటితో ప్రభావితమైనందున వీరికి రాయ్ ముఠాలని పేరు వచ్చింది.

రాయ్ స్వదేశానికి తిరిగి వచ్చినప్పుడు పూర్తిగా కమ్యూనిస్టు మాత్రమే. కొమింటర్న్‌తో తెగతెంపులు చేసుకున్నాడేగాని, కమ్యూనిజంతో కాదు. వాస్తవమైన కమ్యూనిస్టు పార్టీని దేశంలో నిర్మించాలని, జాతీయ విప్లవం ఆధారంగా కమ్యూనిజం వైపుకు సాగిపోయే పార్టీగా వుండాలని, దేశ పరిస్థితుల దృష్ట్యా తగిన కార్యక్రమాన్ని వ్యూహాన్ని రూపొందించే పార్టీగా వుండాలని రాయ్ ఉద్దేశ్యం. తాను ఒకప్పుడు నిర్మించడంలో తోడ్పడిన కమ్యూనిస్టు పార్టీవున్నది

అయితే ప్రభుత్వ అణచివేత వలన చెల్లా చెదరై 1929లో అనుసరించిన అతి వాద పంథా వలన చిందరవందరై వున్నది. పార్టీ పెద్ద నాయకులు జైలులో వున్నారు వారంతా మీరట్ కుట్రకేసులో చిక్కుకున్నారు. నాయకత్వం అనుభవం లేని యువకుల చేతుల్లో వున్నది. తన సూచనలను ప్రశ్నించకుండా అమోదించాలని కొమింటర్న్ ఉత్తరువులిచ్చింది. జీవం లేని యీ పార్టీ స్థానే మళ్ళీ సజీవమైన వ్యవస్థ నెలకొల్పాలని రాయ్ సంకల్పించాడు. ''కమ్యూనిస్టు పార్టీని నిర్మించండి'' అని పిలుపునిస్తూ రాయ్ తొలి ప్రణాళిక విడుదలచేశాడు. భారత కమ్యూనిస్టు పార్టీ తన మనుగడకు యిదొక ఎదురుదెబ్బగా పరిగణించింది. రాయ్‌పైనా రాయిస్టులపైనా కొన్నేళ్ళపాటు విష ప్రచారం చేస్తూ అగ్రహాన్ని వెళ్ళగ్రక్కింది. ఇందుకు కావలసిన ధనాన్ని, మనుష్యులను కొమింటర్న్ అందించింది. ద్రోహి రాయ్‌ను దేశంలో సహించం కానివ్వరాదని భీష్మించుకు కూర్చున్నారు. రాయ్ భారతదేశానికి తిరిగి వచ్చిన అనంతరం భారత కమ్యూనిస్టు పార్టీ, కొమింటర్న్ తదితరుల శత్రుత్వాన్ని ఎదుర్కొనవలసి వచ్చింది. ఇంత తీవ్రంగా వుంటుందను కోకపోయి వుండొచ్చునేమో గాని రాయ్ యిటువంటి దాడికి సిద్ధపడక పోలేదు.

రాయ్ భారతదేశానికి తిరిగి రావడం కమ్యూనిస్టు పార్టీకి యిష్టంలేదు. ''కమ్యూనిజం ఇన్ ఇండియా'' యిలా పేర్కొన్నది. రాయ్ తన రాజకీయ కుశలతను, వ్యవస్థా సామర్థ్యతను, నాయకత్వ ప్రతిభను, వీటన్నింటినీ మించి తన విశేష వ్యక్తిత్వాన్ని ఉపయోగించి వామపక్షం వారిని ఆకర్షించి, అధికార కమ్యూనిస్టు ఉద్యమాన్ని బలహీన పరుస్తాడు. (కమ్యూనిజం ఇన్ ఇండియా, ఇంటిలిజెన్స్ బ్యూరో ప్రచురణ పుట 148) దీనిని ఎదుర్కొవడానికి గాను 1930లో, 1932 లో అనేకమంది ప్రతినిధులను భారతదేశానికి పంపారు. భారత కమ్యూనిస్టు పార్టీకి కావలసినంత నిధులు యిచ్చారు. అయినా కమ్యూనిస్టులు ముందుకు సాగిపోలేక పోయారు. వీరెవి అప్పుడు అధికార కమ్యూనిస్టులనేవారు. రాయిస్టులు కూడా కమ్యూనిస్టులే కనుక, తేడా కోసరం యిలా పిలిచేవారు,

రాయ్ తిరిగి వచ్చినప్పుడు, శాసనోల్లంఘనోద్యమం తీవ్రముఖం పట్టింది. దీనిని అరికట్టడానికి, రాయ్ ప్రణాళిక ఆధారంగా, కాంగ్రెస్ వారిలో, రాయ్ మితా, ఆందోళనకు, ప్రచారానికి తోడ్పడింది. ఇందుకోసరం యూత్ లీగ్, నవజవాన్ భారత్ సభలు, స్వతంత్ర భారత కమిటీలు స్థాపించారు. గాంధీ-ఇర్విన్ ఒడంబడిక వలన శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఉపసంహరించారు. కరాచి లో సమావేశమైన కాంగ్రెస్ యీ ఒడంబడికను ఆమోదించవలసి వున్నది. ఈ ప్రతిపాదనకు రాయ్ విముఖత చూపుతూ, దీనిని నిరాకరించమని ఒక సవరణ పెట్టాడు. సవరణకు అనుకూలంగా రాయిస్టు జయప్రకాశ్ గంభీరోపన్యాసం చేశాడు. కాని అతనికి మద్దత్తు లభించలేదు. తరువాత వీరైక ప్రతినిధిగా కాంగ్రెస్ పక్షాన గాంధీ రౌండ్ టేబుల్ సమావేశానికి వెళ్ళాడు. యీ సమావేశానికి వ్యతిరేకంగా రాయిస్టులు ప్రచారం చేశారు. ఈ ప్రచార ఫలితంగా, బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పరచిన సభ గాక, ప్రజలు ఎన్నుకున్న రాజ్యాంగ సభ దేశానికి రాజ్యాంగం రూపొందించడానికి అంగీకరించారు. తన ప్రచారం వలన వామ పక్ష కాంగ్రెస్ వారు అనేకులు ఆకర్షితులు కావడంపట్ల రాయ్ హర్షించాడు.

అప్పుడు ఉత్తర ప్రదేశ్ ఉడికిపోతున్నది. ధరలు పడిపోవడంతో రైతుల స్థితి దారుణంగా వున్నది. భూస్వాములకు పన్నులు చెల్లించే స్థితిలో రైతులు లేరు. జవహర్ లాల్ నెహ్రూ, తదితరుల కృషివలన కాంగ్రెస్ గ్రామీణులకు హెచ్చరికింది. రైతుల కోర్కెలకు అండగా నిలిచి, భూస్వాములకు ఒక స్థాయికి మించి పన్నులు చెల్లించవద్దని పార్టీ చెప్పింది. రాయ్ చేరుకునే సరికి కవున్లకు వ్యతిరేకంగా రాష్ట్రంలో ఉద్యమం సాగుతున్నది. రైతు ఉద్యమానికి అది మంచి అవకాశం అని, కాంగ్రెసును మార్చడానికి యిది తరుణమని రాయ్ తలచాడు. నెహ్రూ, ఇతరులు రాను తోడ్పడానికి సిద్ధపడ్డారు. వారితో బాటు చాలాచోట్ల పర్యటనలు చేశాడు. ఎందరో రైతులను కలిశాడు. బెనర్జీ, పేరుతో ఖాదీ వస్త్రాలతో రాయ్ తిరిగాడు.

రాయ్ వచ్చే నాటికి కార్మికోద్యమం అస్తవ్యస్తంగా వున్నది. అఖిల భారత కార్మిక సంఘాన్ని కమ్యూనిస్టులు వేరుచేశారు. సంఘాలను చీల్చే ఎత్తుగడలు, కమ్యూనిస్టు సంఘాలను ఏర్పరచడంలో ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ నిస్సహాయంగా మారింది. అనేక సమ్మెలు కూడా కమ్యూనిస్టులు జరిపినందున, కార్మికులు దిగజారి పోయారు, పరిస్థితిని మెరుగు పరచే నిమిత్తం, కార్మిక ఐక్యతకై రాయ్ ఒక ఉద్యమాన్ని ప్రారంభించాడు. ఈ ప్రయత్నం వెంటనే ఫలించలేదు. కాని యీ వేదిక, ఉత్తరోత్తరా వచ్చిన ఐక్యతతో ప్రముఖ పాత్ర నిర్వహించింది, కమ్యూనిస్టుల బారినుంచి అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును రాయ్ తప్పించడంలో కృతకృత్యుడయ్యాడు. ఇది అరెస్టు కాక పూర్వం అతడు సాధించిన ఘన కార్యం. 1931 జూలైలో జరిగిన కలకత్తా వార్షిక సమావేశంలో యిది సాధ్యమైంది. కమ్యూనిస్టులు బయటకు పోయి, రెడ్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ అనే కొత్త సంస్థను స్థాపించుకున్నారు. కొన్నేళ్ళ పాటు యిది దారుణావస్థలో కొనసాగింది.

భారతదేశంలో తాను చూచిన దానితో రాయ్ సంతోషించలేక పోయాడు. శాసనోల్లంఘనోద్యమ తీవ్రత, వ్యాప్తి గురించి పత్రికలు అతిశయోక్తులు ప్రకటించాయని గ్రహించాడు. అలాగే కార్మికుల తీవ్రత చైతన్యత గురించి కూడా అతిగా వూహించినట్లు తెలుసుకున్నాడు. వాస్తవాలకు అనుగుణంగా సర్దుకు పోవలసి వచ్చింది. ప్రజల మీద మహాత్ముడి ప్రభావం విపరీతంగా వున్నట్లు గ్రహించాడు, తన కృషి చాలా బలహీనమైనదని రాయ్ గమనించాడు. అంత మాత్రాన ఆశలు వదులు కోలేదు. చాలా ఆటంకాలు మార్గంనిండా వున్నాయి. ఇందులో అధికార కమ్యూనిస్టుల తీవ్ర వ్యతిరేకత, వారి ప్రభావం క్రింద ప్రజలు వున్నారు. నాడు కొమింటర్న్, కమ్యూనిజం అంటే వామ పక్షం వారిలో చాలా ఆకర్షణ వున్నది. గాంధేయ నాయకత్వానికి, కార్యక్రమానికి తన వ్యతిరేకత మరొక అవరోధంగా వున్నది. ఒక వైపు పోలీస్ వెంటాడుతున్నా, అవరోధాలున్నా, రాయ్ చాలా సాధించగలిగాడు.

చివరకు ఎలాగైతేనేమి పోలీసుల చేతుల్లో చిక్కాడు. ఇంతకు ముందే పేర్కొన్నట్లు 1931 జూలై 21న బొంబాయిలో రాయ్‌ని అరెస్టు చేశారు. కాన్పూరు కుట్ర కేసులో యితని పాత్రను విచారించే నిమిత్తం తక్షణం కాన్పూరు తీసుకెళ్ళారు. పాత సాక్ష్యం ఆధారంగా విచారణ జరిపారు. బహిరంగ ప్రదర్శన జరగరాదని ప్రభుత్వం అత్రుత వహించినందున, విచారణ జైలులో సాగింది. న్యాయస్థానంలో ప్రకటన చేయడానికి కూడా రాయ్‌ని అనుమతించలేదు. కమ్యూనిస్టులను మాత్రం మీరట్‌కుట్ర కేసులో సుదీర్ఘమైన ప్రకటనలు చేయనిచ్చారు. న్యాయస్థానం వారు ప్రతి మాటా అతి జాగ్రత్తగా వ్రాసుకున్నారు. 1924లో నాలుగేళ్లపాటు విధించిన జైలు శిక్షతో పోల్చితే, రాయ్‌పై 12 సంవత్సరాల శిక్ష విధించడం పాశవికంగా వున్నది. తరువాత విజ్ఞప్తి పై ఆరేళ్లకు తగ్గించారు. 1915 నుంచి వేటాడుతున్నందునఎలాగైతేనేమి సామ్రాజ్యవాదం తన పెద్ద శత్రువును పట్టుకోవడంలో కృతకృత్యురాలైంది. రాయ్ జైలు పాలయ్యాడు. 'కనీసం కొన్నేళ్ళపాటు ఎటువంటి జీతులూ వేయలేడ నుకున్నారు.

ప్రభుత్వం ఆశించినట్లు జరగలేదు. రాయ్ మేధస్సును, వార్డర్ల, జైలు అధికారుల, ఖైదీల సానుభూతి, మద్దతు పొందడంలో అతని శక్తిని వారు పరిగణనలోకి తీసుకోలేదు. రెండు వారాల లోపే బయటి ప్రపంచంతో రాయ్ సంబంధం పెట్టుకున్నాడు. జైలులో వున్నంత కాలం కూడా, ఒక చోట నుండి మరో చోటకు మారుస్తున్నప్పటికీ వార్డర్లను మార్చడం, బదిలీ చేయడం జరిగినప్పటికీ, రాయ్ ఎలాగో బయట ప్రపంచంతో సంబంధాలు కొనసాగించాడు. ఉత్తరాలు పంపడం, ప్రణాళికలు, వ్యాసాలు, కొన్ని పుస్తకాల వ్రాత- ప్రతులు బయటకు చేరవేసి ప్రచురించాడు. దీనినే 1941 లో 'మై ఎక్స్‌పీరియన్స్ ఇన్ చైనా' శీర్షికను రాయ్ పేరిట పునర్ముద్రణ చేశారు. ''అవర్ టాస్క్ ఇన్ ఇండియా'' అనేది కార్మిక వర్గ రాయిస్టు రివల్యూషనరీ పార్టీకి ప్రణాళికఅయింది. ఇది జైలునుంచి రహస్యంగా చేరవేశాడు, తనను సమర్థించుకుంటూ ప్రకటన

చేయడానికి ప్రభుత్వం కోర్టులో నిరాకరించగా అదే 'మై డిఫెన్స్' పేరిట బయటకు పంపి ప్రచురించాడు. తాను పంపిన లేఖలలో సుప్రసిద్ధమైనవి 'లెటర్స్ టు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ.' జవహర్‌లాల్ నెహ్రూకు కొన్ని లేఖలు పంపినట్లు ఆధారాలున్నాయి. మరి కొన్ని కూడా గమనింప తగినవి- పూనాలోని మహరాటలోనూ, బొంబాయిలోని ది అడ్వకేట్ లోనూ రాయ్ జైలునుంచి పంపిన కొన్ని వ్యాసాలు ప్రచురితమైనవి, ఒక్క సారి కూడా యితను గాని, అనుచరులు గాని యీ విషయంలో పట్టుబడక పోవడం విశేషం. జైలు సూపరింటెండ్లకు, యితరులు చాలామందిని అనుమానించారు. కొందరిని బదిలీ చేశారు. కాని వారిపై ఏదీ రుజువు కాలేదు. రాయ్ జైలు గదిని చాలా పర్యాయాలు సోదా చేశారు. వ్రాసే సౌకర్యాలను కొన్నిపర్యాయాలు ఉపసంహరించారు. కాని అతనికి వ్యతిరేకంగా ఏదీ రుజువు చేయలేక పోయారు. కొందరు ఖైదీలు రాజకీయ కారాగార వాసులు. వార్డర్లు రాయ్‌కు తోడ్పడ్డారు. వార్డర్లలో కొందరు ఉత్తరోత్తరా సమావేశాలలో రాయ్‌తో సంబంధం పెట్టుకున్నారు. వారికి ఆదరణ పూర్వకమైన స్వాగతం లభించింది.

సాధారణంగా రాయ్ జైలులో చక్కగా ప్రవర్తించాడు. నిబంధనలు పాటించాడు. తనకు కేటాయించిన పని తప్పక చేసేవాడు. కాని బయట ప్రపంచంతో సంబంధం పెట్టుకోరాదనే ఒకే ఒక నిబంధన మాత్రం పాటించలేదు. జైలులో వున్నంతకాలం యీ నిబంధన ఉల్లంఘిస్తూనే పోయాడు. తద్వారా బయటకు ప్రచురణ నిమిత్తం విషయం అందజేశాడు. నాయకత్వం కోసరం చూసే వారికి మార్గాన్ని చూపాడు.

అధికారికంగా రాయ్‌ను నెలకోలేఖ వ్రాసుకోనిచ్చేవారు. ఎంత వ్రాయాలో కూడా పేర్కొనేవారు. కొన్నిసార్లు కొన్నిభాగాలు కొట్టేసేవారు. ఈ లేఖలను తమ మిత్రురాలు, సహచరిణి ఎలెన్‌గోట్ షాక్‌కు వ్రాసేవాడు. రాయ్ విడుదల కాగానే ఆమె భారతదేశానికి వచ్చింది. అతన్ని వివాహమాడి, భారతదేశాన్ని మాతృదేశం చేసుకున్నది. ఎలెన్ యీ ఉత్తరాలను భద్రంగా దాచింది. 1941లో

వాటిని 'లెటర్స్ ఫ్రమ్ జైల్' అనే శీర్షికన ప్రచురించారు. ఇది చాలా ఆసక్తికరమైన గ్రంథం. అతనెంత సంస్కృతిపరుడో, మానవతావాదో ఎన్ని విషయాలలో పరిజ్ఞానం వున్నదో వీటివలన విదితమవుతుంది.

జైలు జీవితం రాయ్ ఆరోగ్యాన్ని పాడుచేసింది. తన ఉక్కుశరీరం గురించి రాయ్ గర్విస్తుండేవాడు. కాని జైలు విధించిన కఠినపథ్యాలకు తట్టుకోలేకపోయాడు. వేసవి ఎండ మరీ అతనికి దుర్భరంగా వుండేది. కాన్పూరు, బెరెల్లీ జైళ్ళలో మొదటి మూడేళ్లు యీ బాధలకు గురి కావలసి వచ్చింది. తాను తన స్నేహితులు ఎన్ని పర్యాయాలు విజ్ఞప్తిచేసినా, యూరోపా, అమెరికా మిత్రులు కోరినా, కొండలలోని చల్లని ప్రదేశాలకు తరలించడం జరుగనేలేదు. 1934 వేసవిలో ఆందోళనకరంగా పరిణమించిన ఆరోగ్యం గమనించి, అల్మోరాకు తీసుకెళ్ళి, వేసవి అయిపోగానే మళ్ళీ బెరల్లీకి తీసుకొచ్చారు. మరుసటేడు ఎండలు ముదరగానే డెహ్రాడూన్‌కు తరలించి, విడుదలయ్యేవరకూ అక్కడే అట్టిపెట్టారు.

రాయ్‌కు గుండె విస్తరించింది. ఛాతిలో నొప్పి వచ్చేది. తరచుకొద్దిగా జ్వరం తగులుతుండేది. ఆల్బర్ట్ ఐన్‌స్టీన్‌తో సహా ప్రపంచంలోనూ దేశంలోనూ ఎందరో సుప్రసిద్ధ వ్యక్తులు, రాయ్‌ను దయతో చూడమంటూ ప్రభుత్వానికి విజ్ఞప్తులు చేశారు. జవహర్‌లాల్ నెహ్రూ వ్యక్తిగతంగా యీ విషయమై శ్రద్ధవహించాడు కానీ యిదంతా వృథా అయింది. విచారణ జరుపుతుండగా రాయ్‌ను 'ఎ' తరగతి ఖైదీగా చూశారు. శిక్షపడిన తరువాత 'సి' తరగతి ఖైదీ అయ్యాడు. ఇతను, ఇతని స్నేహితులు ఎన్ని మార్లు కోరినా కనీసం వర్గీకరణ కూడా మార్చలేదు.

అనారోగ్యం అలా వున్నప్పటికీ, చట్టబద్ధమైన రచనలు జైలులో చాలా చేశాడు. వ్రాసుకోవడానికి ఒక బౌండ్ పుస్తకాన్ని పేజీ నెంబర్లు వేసి, అధికార ముద్రతో సరఫరా చేసేవారు. అది తమ దగ్గర అట్టిపెట్టుకొని మరొకటి యిచ్చేవారు. అధ్యయనానికి తీవ్ర ప్రతిబంధకంగా రాయ్‌కు పరిణమించింది.

ఇలాంటి కష్టం వున్నప్పటికీ వెయ్యి పేజీల వరకు 0 లౌండ్ పుస్తకాలను రాయ్ వ్రాశాడు. విడుదల కాగానే తనతో బాటు వాటిని వెంట తెచ్చుకున్నాడు. ఇందులో చాలా వరకు గ్రంథాలుగా ప్రచురించాడు. ఇలా నోట్ పుస్తకాంలో వ్రాసినవే, ఫాసిజం, మెటీరియలిజం, ఇస్లాం చారిత్రక పాత్ర 'ఐడియల్ ఆఫ్ ఇండియన్ వుమన్‌హుడ్' అనేవి కొంత భాగం యింకా ప్రచురితంకాలేదు. ఆధునిక విజ్ఞాన తాత్విక ఫలితాలు' అనే రాయ్ రచన యిందులో వున్నది.

రాయ్‌ను నిర్బంధించడంతో రాయ్ ముఠా అంతం కాలేదు. రాజకీయ, కార్మిక రంగాలలో యీ ముఠా పెంపొందినది. ఈ ముఠా కార్యకలాపాల గురించి 'హిస్టరీ ఆఫ్‌ది కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా' అనే గ్రంథంలో భారత ప్రభుత్వ గూఢచారి శాఖ యిలా పేర్కొన్నది, భారతదేశంలోనూ ఐరోపాలోనూ రాయ్ సిద్ధం చేసిన వారంతా అతన్ని వదిలి, కొమింటర్న్‌కు విధేయులుగా వున్నారు. 1934 చివరకు రాయ్ కొత్త అనుచరులు మంచి ఫలితాలు చూపెట్టారు. అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లో తమ స్థానాన్ని పొంది, 40 సంస్థలను అనుబంధంగావించి, కలకత్తాలో శాశ్వత కార్యాలయాన్ని స్థాపించారు. దేశంలో మళ్ళీ యీ ట్రేడ్ యూనియన్ తన లోగడ స్థానాన్ని పొంది, నాయకత్వం వహించింది. రాయ్‌కి జోహార్లు అర్పిస్తూ యిలా పేర్కొన్నారు: తిరిగి వచ్చిన తరువాత రాయ్ ఒక్కడుగా తన మేధస్సుతో యింత సాధించగలిగాడు. జైలు నుంచి కూడా తన అనుచరులను ఉత్తేజపరచి, మార్గ దర్శకత్వాన్ని చూపాడు. రాయ్ చూపిన ఎత్తుగడలు సరైనవని ఉత్తరోత్తరా దేశంలో కమ్యూనిస్టు ఉద్యమాభివృద్ధి వలన రుజువైంది. (పుట 148)

దేశంలోనూ బయటా కూడా రాజకీయ పరిస్థితి గురించి రాయ్ గమనార్హంగా తెలుసుకుంటుండేవాడు, ఇతను జైలులో వుండగా చాలా మార్పులు జరిగాయి. వాటిని గురించి ఆలోచించి, కొత్త పరిస్థితిలో తన పంథాను రూపొంద

ఊించుకున్నాడు. విడుదలకాగానే, మామూలుగా అడిగినట్లు, పరిస్థితిని పరిశీలించడానికి కాలవ్యవధి కావాలనలేదు. రాయ్ జైలు గోడలు ఆపలేని కార్యకలాపాలు కొనసాగించడానికి తక్షణమే రంగంలో, అరమరికలు లేకుండా ప్రవేశించాడు.

## 9 వ అధ్యాయం

# కాంగ్రెస్‌లోకి, బయటకూ

5 సంవత్సరాల 4 మాసాల జైలుశిక్ష అనంతరం, 1936 నవంబరు 20 ఉదయాన్నే డెహ్రాడూన్ కారాగారం నుంచి రాయ్ విడుదలయ్యాడు. జైలుగేటు దగ్గర అతన్ని కొందరు కాంగ్రెసు నాయకులు ఆహ్వానించారు. రాయ్ ఆరోగ్య స్థితి బలహీనంగా వుండటం వలన ప్రదర్శన వద్దనుకున్నారు.

విడుదల కాగానే రాయ్‌ను మునిసిపాలిటి అధ్యక్షుడు, కాంగ్రెస్ ప్రముఖ నాయకుడు ఖుర్షీద్‌లాల్ యింటికి తీసుకెళ్ళారు. రాయ్‌ను రాష్ట్ర రాజకీయ సమావేశానికి ఆహ్వానిస్తూ నెహ్రూ పంపిన సందేశం అక్కడ సిద్ధంగా వున్నది. తరువాత అలహాబాద్‌లో తన నివాసానికి వచ్చి విశ్రాంతి తీసుకొని కోలుకోవలసిందిగా నెహ్రూ కోరాడు. దేశంలో అనేకచోట్లనుంచి రాయ్ సహచరులు అక్కడ చేరారు. తమ మధ్యలో మళ్ళీ రాయ్ వుండడాన్ని వారు ఆహ్వానించారు, వీరిని కలుసుకోవడానికి రాయ్ చాలా సంతోషించాడు.

రాయ్‌ను కలుసుకోవడానికి ప్రతికా ప్రతినిధులు ఆత్రుత చెందారు. అతని లక్షణ విధానం, కార్యక్రమం తెలుసుకోవాలనుకున్నారు. వారంతా పట్టు బట్టగా రాయ్ యీ విధంగా ఒక సంక్షిప్త ప్రకటన చేశాడు- ఆరేళ్ళ సుదీర్ఘ జైలు శిక్ష అనంతరం, దేశ ప్రజలకు కొన్ని మాటలు చెప్పడానికి సంతోషిస్తున్నాను. సామ్రాజ్యవాదానికి బలి అవుతున్న వారికి నా సందేశం యిది: ప్రజా స్వామిక స్వేచ్ఛకై స్థిర నిశ్చయంతో పోరాడే సైన్యంగా జాతీయ కాంగ్రెస్ పతాకం క్రింద లక్షలాది ప్రజలు సమీకరణ కావాలి. మనం ఆశించే యీ లక్ష్యాన్ని సాధించడానికి, మనకు స్పష్టమైన దృష్టి వుండటమే

కాదు, నిర్దుష్టమైన కార్యాచరణ కూడా వుండాలి. స్వేచ్ఛ నిమిత్తం అవసరమైన యీ పరిస్థితులు సృష్టించడానికి నేను ప్రయత్నిస్తున్నాను కమ్యూనిజం, సోషలిజం, అంటే ఒకటే. కాని నేడు అది సమస్య కాదు. భారత ప్రజల స్వేచ్ఛా పోరాటంలో పాత్ర నిర్వహించదలచిన వాస్తవ సోషలిస్టులు, కమ్యూనిస్టులు కూడా దేశ స్వాతంత్ర్యం తక్షణ లక్ష్యమని గ్రహించాలి. సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులన్నీ ప్రజా స్వామిక స్వేచ్ఛనినాదంతో కూడాలి. ప్రజల యొక్క ప్రభుత్వాన్ని స్థాపించడానికి యివి జరగాలి. జాతీయ కాంగ్రెసు మనందరి వేదిక. లాంఛనంగా నేను కాంగ్రెస్‌కు సంబంధంలేని వాడిని. అయితే కాంగ్రెస్‌ను ప్రజాస్వామికం కొరకు, సమూలంగా మార్పు కోసరం యిన్నేళ్లుగా నేను ప్రయత్నిస్తూ పార్టీ బలపడడానికి కృషిచేస్తున్నాను. ఇక ముందు నా పని సులువుగా చేయడానికి లాంఛనంగా కాంగ్రెస్‌లో సభ్యుడిగా చేరుతాను. కమ్యూనిస్టులు భారత రాజకీయ రంగంలో విదేశీయులు కారనీ ప్రజలకు నేను చూపదలచాను. వీరు కూడా దేశంలో అంతర్భాగంగా, భారత జాతీయ కాంగ్రెస్ పతాకం క్రింద దేశ స్వాతంత్ర్యానికై పోరాడతారని చూపదలచాను. [ఐన్‌స్టెప్పింగ్ అవుట్ ఆఫ్ జైల్—బొంబాయిలో ప్రచురించిన చిన్న పుస్తకం].

ఆ సాయంత్రమే రాజకీయ సమావేశంలో పాల్గొనడానికి, నెహ్రూను కలియడానికి రాయ్ బయలుదేరి ఢిల్లీ వెళ్ళాడు. వెంటనే కాంగ్రెస్ సభ్యుడుగా చేరాడు. ఫైజ్‌పూర్ కాంగ్రెస్ మహాసభకు ప్రతినిధిగా ఎన్నుకోబడ్డాడు. అఖిల భారత కాంగ్రెస్ సంఘానికి, ఉత్తర ప్రదేశ్ కాంగ్రెస్ కార్యవర్గ సంఘానికి సభ్యుడుగా ఎన్నికయ్యాడు. కాంగ్రెస్‌లో అలా ప్రవేశించాడు రాయ్. కమ్యూనిస్టులను కాంగ్రెస్‌లో చేరమని, అందులో వుంటూ పనిచేస్తూ సమూల మార్పుకై ప్రయత్నించమంటూ సలహా చెప్పాడు. ఈ సమస్యపై కొమింటర్న్‌తో రాయ్ తెగతెంపులు చేసుకున్నాడు. కాంగ్రెస్‌ను బహిష్కరించి పోరాడమని కొమింటర్న్ యిచ్చిన ఆదేశం అతివాదపక్షపు సంకుచిత విధానమని రాయ్ ఉద్దేశ్యం

కాంగ్రెస్‌లో చేరి, లోనుంచి పనిచేసే అవకాశం ప్రప్రథమంగా రాయ్‌కు లభించింది.

1936 డిసెంబరులో జరిగిన ఫైజ్‌పూర్ కాంగ్రెస్ మహాసభలకు రాయ్ వెళ్ళాడు. నెహ్రూ అధ్యక్షత వహించాడు. అధ్యక్షోపన్యాసంలో రాయ్‌ను గురించి ప్రత్యేకంగా నెహ్రూ ప్రస్తావించాడు. స్వాతంత్ర్య యోధుడుగా రాయ్‌ను కాంగ్రెస్‌లోకి ఆహ్వానించాడు. వేదికపై రాయ్‌కు ప్రత్యేకస్థానం యిచ్చారు. నాయకుల శిబిరాలలో ఒకటి అతనికి కేటాయించారు. విషయ నిర్ణయ సమావేశంలో రాజ్యాంగ సభ గురించి రాయ్ మాట్లాడాడు. కాంగ్రెస్ ప్రజలకు అది అలవాటు లేని ఉపన్యాసం. ఇందులో ఉద్రేకాలు రెచ్చగొట్టే ప్రయత్నం లేదు. నెమ్మదిగా అతిజాగ్రత్తగా తూచి మాట్లాడాడు రాయ్. వివేచనకు విజ్ఞప్తిచేశాడు. సంస్కరణలను తృణీకరించడమనేది సరిగా వుండాలంటే, అధికారాన్ని హస్తగతం చేసుకునే ఆలోచన చేయాలని, కాంగ్రెస్‌లోనే అధికార సంస్థలుగా కాంగ్రెస్ కమిటీలు పనిచేస్తూ, రాజ్యాంగసభగా వ్యవహరించవచ్చునని రాయ్ సూచించాడు ప్రజల తక్షణావసరాలతో ప్రజా పోరాటంలో అత్యధిక సంఖ్యాక ప్రజలను చేర్చడానికి నిర్దుష్ట కార్యాచరణను రాయ్ పేర్కొన్నారు. ఈ వుపన్యాస ప్రభావం ప్రేక్షకులపై బాగా పనిచేసింది. వామపక్షకులపై బాగా పనిచేసింది. వామపక్ష మేధావులు చాలామంది సమావేశంలో పాల్గొని, యీ ఉపన్యాసంతో ముగ్ధులయ్యారు. తామనుకునే విప్లవ పంథాకు రాయ్ మార్గాన్ని చూపాడని వారు భావించారు.

ఫైజ్‌పూర్‌లో రాయ్ ముఖాముఖి గాంధీజీని తొలిసారి కలిశాడు. సుహృద్భావంతో సమావేశం జరిగింది. కాని వారి సంభాషణవలన యిరువురి మధ్య అఖాతం వున్నట్లు బయట పడింది. ప్రార్థనా సమావేశానికి ఆహ్వానించగా, రాయ్ మృదువుగా నిరాకరించాడు. కాంగ్రెస్‌ను పాలించిన గాంధేయ కుటుంబంలో రాయ్‌కు ప్రవేశం అంతటితో ముగిసింది. ఈ సమావేశం వలన, ప్రత్యామ్నాయ నాయకత్వం పెంపొందించవలసిన ఆవశ్యకతను రాయ్ ధృఢంగా నమ్మాడు.

ఫైజ్‌పూర్ కాంగ్రెస్ సమావేశం అనంతరం ఎన్నికల ప్రచారం ఆరంభమైంది. 1935 భారత ప్రభుత్వ చట్టాన్ని అనుసరించి కొత్తరాష్ట్ర శాసనసభలకు ఎన్నిక జరగవలసి వున్నది. సంస్కరణలు తృణీకరించాలని కాంగ్రెస్ కృత నిశ్చయంతో వున్నది. ఎన్నికలు బహిష్కరించే దానికంటే పోటీచేయాలని నిర్ణయించారు. మహారాష్ట్ర కర్నాటకలో రాయ్ ఎన్నికల ప్రచారంలో పాల్గొన్నాడు.

1937 ఏప్రిల్‌లో 'ఇండిపెండెంట్ ఇండియా' అనే వారపత్రికను రాయ్ ప్రారంభించాడు. జాతీయ అంతర్జాతీయ పరిణామాలపై ప్రతి వారం తన అభిప్రాయాలను స్పష్టంగానూ సూటిగానూ వెల్లడించడానికి యిది ఉపకరించింది. నెహ్రూ, బోసులు యీ ప్రచురణను ఆహ్వానించారు. గాంధీజీ మాత్రం మౌన సేవ చేయమని రాయ్ అడిగినప్పుడు సలహా యిచ్చాడు రాయ్ యిందుకు అంగీకరించలేదు. రాయ్ విడుదల తరువాత అతని ముఠా బాగా పెరిగిపోయి ఉత్సాహంగా పని చేయడం మొదలుపెట్టింది. సభ్యత్వం కూడా అధికమైంది. రాజకీయ, కార్మిక రంగాలలో యిదొక శక్తివంతమైన శాఖగా మారింది.

ఎలెన్‌గోట్ షాక్‌కు లేఖలు జైలునుంచి వ్రాస్తుండేవాడని రాయ్‌నుగురించి యింతకు ముందు ప్రస్తావించాము. ఆమె యిదే సమయంలో దేశానికి వచ్చింది. రాయ్‌కు శాశ్వత సహచారిణిగా వుండదలచి ఆమె ఇక్కడికి వచ్చింది. త్వరలోనే వారు పెళ్లి చేసుకున్నారు. అప్పటి నుంచీ ఆమె ఎలెన్ రాయ్ అయింది. ఆమెలో ప్రేమించే అర్ధాంగినే గాక, తెలివితేటలతో సహాయపడే వ్యక్తినీ సన్నిహితంగా కృషిచేసే ధోరణినీ రాయ్ చూశాడు.

తరువాత తాను అనుకున్నట్లు కాంగ్రెస్‌ను చైతన్యవంతం చేసి, ప్రజాస్వామికం చేయాలనే సందేశాన్నిస్తూ, రాయ్ తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లలో పర్యటించాడు. 1938 జనవరిలో బెంగాలు వెళ్ళాడు. 20 సంవత్సరాల అనంతరం స్వరాష్ట్రానికి మళ్ళీ పోయాడు. అతనికి పెద్ద స్వాగతం లభించింది. ఆయన ఉపన్యాసాలను అత్యంత శ్రద్ధాసక్తితో విన్నారు. అతని పిలుపు సను

సరించి వందలాదీ వామపక్ష మేధావులు కాంగ్రెసులో చేరారు. పిమ్మట బీహార్, ఉత్తర ప్రదేశ్‌లు పర్యటించాడు.

అప్పటికే డెహ్రాడూన్‌లో 13 మోహిని రోడ్‌లో ఒక యిల్లును ఏర్పరచు కున్నాడు. అదొక పాత భవనం. పెద్ద ప్రాకారంతో నిడువైన చెట్లతో విపరీతంగా పెరిగిన పొదంతో నిర్మానుష్యంగా వుండేది. త్వరలోనే యీ పొదలస్థానే చక్కని తోటను పెంచారు. అదే రాయ్ దంపతుల శాశ్వత భవనం అయింది. ప్రతి సంవత్సరం క్రమబద్ధంగా పర్యటనలు జరిపిన అనంతరం అక్కడకు చేరుకునేవారు. నగరానికి దూరంగా వుండడం వల్ల రాయ్ కోరుకున్న ప్రశాంతత ఆ యింట్లో లభించింది అచిరకాలంలోనే రాయిల్లు, దేశ విదేశాలలోని విభిన్న పండితులకు, సాంఘిక రాజకీయ కార్యకర్తలకు యిదొక నిలయమైంది. ప్రతివారికీ ఆహ్వానం లభించేది. యధాశక్తి ఆతిథ్యం వుంటుండేది.

కాంగ్రెసులో తన కృషి ప్రారంభించేముందు తాను అనుసరించదలచిన పంథాను రాయ్ ఒక ప్రకటనలో స్పష్టపరిచాడు నా ఆరోగ్యం యితర విషయాలు అనుమతించగానే, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా సమర్థవంతంగా పోరాడగల శక్తిగా జాతీయ కాంగ్రెసును బలపరచడమే నా రాజకీయ చర్య లక్ష్యంగా వుంటుంది. సామ్రాజ్యవాద భారం నుంచి విమోచన, దేశాన్ని ప్రజాస్వామికీకరణ గావించడం, భారత సమాజపు పునర్నిర్మాణానికి అత్యవసరం. అందులో ప్రజల పేదరికానికి తావుండరాదు. సాంస్కృతిక, మేధస్సుపరంగా నైతికంగా దారుణమైన వెనుకబడిన తనం వుండరాదు. ఉన్నత స్వేచ్ఛకై దేశ స్వాతంత్ర్యం తప్పనిసరి అని గ్రహించిన కాంగ్రెస్ శక్తులను బలపరచడానికి ఐక్యపరచడానికి ప్రయత్నిస్తాను.

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సమర్థవంతమైన పోరాటం జరపాలంటే, విప్లవ సామాజిక ఆదర్శాలతో ప్రేరేపితులైన వారి నాయకత్వాన పని చేయడం అవసరం, కేవలం స్వాతంత్ర్యాన్ని గురించి మాట్లాడితే ఆశించిన లక్ష్యాన్ని

చేరుకోలేము. సోషలిజం మన తక్షణ లక్ష్యం కాదు. చరిత్రలో రాజకీయ స్వాతంత్ర్యాన్ని సోషలిజం స్థాపననూ గిరిగీసి చూపడం తప్పు. ఉత్పత్తి చేసే వారి చేతుల్లోనే శ్రమ ఫలితం అధికంగా వుంటే తప్ప, భారత సమాజపు జీవనాడుల్ని తొలిచివేస్తున్న ఆర్థిక దోషాలను తొలగించలేమని, చిత్తశుద్ధితో ప్రజలను బాగు పరచాలనే వారంతా గ్రహించాలి. అంటే రైతుల, కూలీల శ్రమ వారికే దక్కాలి. కనుక దేశ స్వాతంత్ర్యం గనుక చారిత్రక ప్రయోజనాన్ని సాధించాలంటే, ప్రజలకు నిజమైన రాజకీయాధికారాన్నిచ్చే విధంగా ప్రభుత్వాని స్థాపించే పద్ధతిని నిర్వహించాలి. దేశ స్వాతంత్ర్యాన్ని సరైన ప్రజాస్వామిక స్వేచ్ఛగా భావించాలి. జాతీయోద్యమం ఎదుట స్పష్టమైన ప్రజాస్వామ్య విప్లవ కార్యక్రమాన్ని, అందుకు కావలసిన కార్యాచరణను వుంచుతాను. సామ్రాజ్యవాదంపై సమర్థవంతంగా పోరాడడానికి అదొక్కటే సరైన మార్గం. పోరాటంలో నిమగ్నమైన వారు దేనికోసరం పోరాడుతున్నారో గ్రహించాలి. ప్రచారం, ఆందోళనతో ఎక్కువ దూరం పోలేము. ప్రజలలో రాజకీయ చైతన్యత పెంపొందించాలి. స్పష్టమైన కోర్కెలతో పోరాడే సామ్రాజ్య వ్యతిరేక శక్తులను సంఘటితం చేయాలి. కాంగ్రెస్ వ్యవస్థను, నాయకత్వాన్ని ప్రజాస్వామికీకరణ గావించి, కార్యకర్తల ప్రభావం కిందకు తేవాలి అటువంటి ప్రయోజనంకొరకు కృషి చేస్తాను. (అన్ స్టెప్పింగ్ అవుట్ ఆఫ్ జైల్ పుట 4-8)

కాంగ్రెస్‌లో మితవాద నాయకులకు యీ ప్రకటన నచ్చలేదు. గాంధీ వాదానికి రాయ్ వ్యతిరేకత కూడా వారికి తెలుసు. రాయ్ కాంగ్రెస్‌లో ప్రవేశించడాన్ని వారు ఆహ్వానించలేదు. కొన్ని వారాలలోనే అతన్ని అనుమానించసాగారు అనుమానం కాస్తా వ్యతిరేకతగా మారింది. తాను వెళ్ళిన చోట్ల రాయ్ యిది గమనించాడు. అనేక సమస్యలపై రాయ్ చేసిన సూచనలు వాటి అర్హతను బట్టి గమనించనే లేదు. అవి మన మార్గానికి సరిపడవంటూ నిరాకరించేవారు.

విచిత్రమేమంటే, వామపక్ష ముఠాల నుంచి కూడా రాయ్‌కు యిటువంటి వ్యతిరేకతే ఎదురైంది. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ అప్పట్లో ఒక్క శక్తిగా

కాంగ్రెస్‌లో పెంపొందుతున్నది. ఇదొక ఆసక్తికరమైన రాజకీయ సంఘటన. మౌలిక సమస్యలపై నాయకత్వంలో తీవ్ర భేదాభిప్రాయాలున్నాయి. సోషలిస్టు పార్టీగా పిలుచుకుంటూనే, ఎన్నికలు, శాసన సభలు, పదవుల బహిష్కరణవంటి గాంధేయ ఎత్తుగడలను వీరు నమ్మేవారు. కాంగ్రెసులో మితవాద నాయకత్వంతో వీరికి మౌలిక తేడా లేదు గాంధేయ పథాన్నే యింకా శక్తివంతంగా అనుసరించాలనే వారంతే. సోషలిస్టు పార్టీగా కాక, కాంగ్రెసులో వామపక్షంగా, ప్రత్యామ్నాయ నాయకత్వం కోసరం పని చేయమంటున్నాడని రాయ్‌పై వీరికి కోపం. రాయ్ సలహాపై రాయిస్టులు మూతాలుగా పార్టీని వదలడం వలన వీరికి యింకా ఆగ్రహం వచ్చింది. కాంగ్రెసు సోషలిస్టు పార్టీపై రాయ్ అభిప్రాయం క్లుప్తంగా యిలా వుంది: కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కాంగ్రెసులో వామపక్ష వ్యవస్థ కాదు. పోనీ నిజమైన మార్క్సిస్టు సోషలిస్టు పార్టీ కూడా కాదు. మొదటిదైతే, నిజమైన సోషలిస్టు పార్టీ కాదన్న మాట. రెండవదైతే, కమ్యూనిస్టు పార్టీ కార్యాచరణ, వ్యవస్థ ఆచరించాలి. ప్రస్తుత రూపంలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సంస్కరణతో కూడిన సోషల్-డెమొక్రటిక్ పార్టీ అన్న మాట, అంటే ఇది కాంగ్రెసులో వామపక్షానికి తోడ్పడదు, పైగా కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధికి ఆటంకంగా వుంటుంది. (అవర్ డిఫరెన్సెస్, పుట 150)

తార్కికమైన, స్పష్టమైన యిటువంటి సూత్రీకరణ కాంగ్రెసు సోషలిస్టు పార్టీకి ఆమోదయోగ్యం కాదు. కాంగ్రెసు నుంచి గెంటివేసే వరకూ యీ రెండు మార్గాంతరాల మధ్య వూగిసలాడుతూ కొనసాగారు.

కమ్యూనిస్టు ముఠా రాయ్‌కు తీవ్ర వ్యతిరేకత చూపారు. కాంగ్రెసులో రాయ్ ప్రభావం పెరగడంవారికి యిష్టం లేదు, రాయ్ కాంగ్రెసులో ప్రవేశించే నాటికి, మాస్కో సూచనల మేరకు కమ్యూనిస్టులు కాంగ్రెసు పార్టీ వ్యతిరేకతను మానుకున్నారు, తోనుంచే పనిచేస్తూ పోయారు. ఏడవ కాంగ్రెసు పంథా వలన కొమింటర్న్‌తో తనకు అభిప్రాయ భేదం లేదని రాయ్ ప్రకటించాడు. అటువంటి

పరిస్థితులలో కమ్యూనిస్టు పార్టీ రాయ్‌కు సహకారాన్నివ్వాల్సింది. రాయ్ స్వతంత్ర ఆలోచనను మాస్కో సహించలేకపోయింది గనుక యిది జరుగలేదు. కాంగ్రెసులో తన కృషికి కమ్యూనిస్టు పార్టీ నుంచి రాయ్‌కు ఎటువంటి సహకారమూ లభించలేదు.

ఎత్తుగడలు, వ్యూహంపై కూడా తీవ్ర భేదాభిప్రాయాలున్నాయి. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీ, యితర వామపక్ష ముఠాలు పదవులను ఆమోదించడాన్ని నిరాకరించారు రాయ్ దృష్టిలో యిది స్వల్పవిషయం. ఒక ప్రయోజనార్థం అధికార పదవులను స్వీకరిస్తే, ప్రజలను సమీకరించి, వ్యవస్థీకరించడానికి ఉపయోగించవచ్చునని రాయ్ అభిప్రాయం. సమిష్టిగా అనుబంధం అనేది మరొక అభిప్రాయభేదం. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీ కూడా కార్మికులు కర్షకులు కాంగ్రెస్‌లో వ్యక్తిగతంగా చేరక, వ్యవస్థల ద్వారా సమిష్టిగా చేరాలంటారు. లోగడ సమిష్టిగా చేరడాన్ని అనుకూలించిన రాయ్ బాగా ఆలోచించిన మీదట అభిప్రాయాన్ని మార్చుకున్నాడు. కిసాన్ సభల వ్యవస్థ విషయమై తేడాలు వచ్చాయి. గ్రామాలలో కాంగ్రెస్ సంఘాలే కిసాన్ సభలుగా పనిచేయాలని రాయ్ అన్నాడు. వాటిని స్వతంత్ర సంస్థలుగా వుంచాలని యితరులన్నారు. నాయకత్వం విషయమై వచ్చిన తేడా అతి ముఖ్యమైనది. ప్రత్యామ్నాయ నాయకత్వం కావాలని రాయ్ కోరగా, ఉన్న నాయకత్వంలో కొన్ని మార్పులను మాత్రమే మిగిలిన వారు అడిగారు. ఈ తేడావలన రాయ్ పక్షానికి మిగిలిన కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ-కమ్యూనిస్టు పార్టీకి ఒకేవేదిక ఏర్పడకుండా పోవడానికి కారణమైంది. (అవర్ డిఫరెన్సెస్, పుట 146-152.)

1939 లో మహాత్మాగాంధి కోరికకు వ్యతిరేకంగా సుభాస్ చంద్రబోస్ రెండవసారి అధ్యక్షుడు కావడం కాంగ్రెస్‌లో సంక్షోభాన్ని సృష్టించింది పాత నాయకత్వం బోసుతో సహకరించటానికి నిరాకరించారు. కాంగ్రెసులో ప్రత్యామ్నాయ నాయకత్వానికి అదే అదను అని రాయ్ భావించాడు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీ దీనితో ఏకీభవించలేక, ఫలితంగా బోసు రాజీనామా

యిచ్చాడు. మళ్ళీ గాంధేయ వాదులు వ్యవస్థపై పట్టు చిక్కించుకున్నారు. అంతటితో తన వారందరినీ ఒక వ్యవస్థగా రాయ్ సంఘటిత పరచాడు. రాడికల్ కాంగ్రెస్ లీగ్ అని పేరు పెట్టాడు. 1938 జూన్‌లో పూనాలో ప్రారంభ మహాసభ జరిగింది. కాంగ్రెస్ కార్యక్రమాన్నే వీరూ స్వీకరించారు. శక్తివంతంగా ఆచరణకు ఉపక్రమించాలని, యిందు నిమిత్తం నాయకత్వంలో మార్పు రావాలని వారు కోరారు. దేశవ్యాప్తంగా లీగ్‌కు మద్దతు బాగా లభించింది. తరువాత బోస్ ఫార్వర్డ్ బ్లాక్ స్థాపించాడు. కాంగ్రెస్‌లో వామపక్షాలన్నీ బ్లాక్ ఐక్యపరుస్తుందనుకున్నారు. అది జరగలేదు. మరొక వామపక్షం ఏర్పడినట్లయింది.

1940లో కాంగ్రెస్ అధ్యక్ష స్థానానికి రాయ్ పోటీ చేశాడు. వ్యవస్థలో అత్యున్నత స్థానానికి పోటీచేసే అవకాశం అసమ్మతి వర్గానికి వుండాలని చూపదలచాడే తప్ప, గెలవాలని పోటీ చేయలేదు. ప్రత్యామ్నాయ నాయకత్వం వేదికననుసరించి రాయ్ పోటీ చేశాడు. ఇతర వామపక్ష ముఠాలు అతన్ని బలపరచలేదు. అయినా పోటీలో 10 శాతం ఓట్లు వచ్చాయి

కాంగ్రెస్‌లో తన కృషికి రాయ్ చాలా ప్రాధాన్యత యిచ్చాడు. అదొక్కటే అతని దృష్టిని ఆకర్షించలేదు. కార్మికోద్యమం, సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వం కోసరం ఉద్యమాల పట్లకూడా దృష్టి సారించాడు. విద్యార్థి యువజన సంస్థలతో సంబంధం పెట్టుకున్నాడు. మార్క్సిజం, కమ్యూనిజం, పరిణామంపై చాలా ఉపన్యాసాలిచ్చాడు. పునర్వికాసోద్యమంపై ప్రత్యేక శ్రద్ధ వహించాడు. రాజకీయోద్యమ విజయానికి వివేచనాత్మక, వైజ్ఞానిక దృక్పథం అవసరమని రాయ్ నమ్మాడు. తాత్కాలిక విప్లవ ఆవశ్యకత నొక్కి చెప్పిన ఏకైక రాజకీయ నాయకుడు నాడు రాయ్ ఒక్కడే. ఆ సమయంలో చాలా రాజకీయ రచనలు చేశాడు. అతని పుస్తకాలు చాలా ప్రచురితమయ్యాయి. అందులో "ఫాసిజం", 'హిస్టారికల్ అఫ్ ఇస్లాం', 'అవర్ ప్రాబ్లమ్స్', 'లెటర్స్ టు కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ' పేర్కొనదగినవి,

చాలా సంవత్సరాలుగా యుద్ధమేఘాలు క్రమ్ముకొని వున్నాయి. రాయ్‌తో సహా అనేకులు వీటిని గమనిస్తూ, యుద్ధాన్ని గురించి ప్రజలను హెచ్చరిస్తున్నారు. 1939 సెప్టెంబరులో యుద్ధం రానే వచ్చింది. రాయ్ ఇంకా అనేకులు వూహించిన యుద్ధం కాదిది. నాజీ జర్మనీ సోవియట్ రష్యాపై యితర సామ్రాజ్యవాద శక్తులైన ఇంగ్లాండు, ఫ్రాన్స్ సహకారంతో యుద్ధం ప్రకటిస్తుందని వీరనుకున్నారు. కాని ఒకవైపున నాజీ జర్మనీ, ఫాసిస్ట్ ఇటలీలు, మరొకవైపున ఇంగ్లండ్ ఫ్రాన్స్ తదితరుల మధ్య వచ్చిన సామ్రాజ్యవాదుల యుద్ధమే యిది, అది అనూహ్యయుద్ధం. దీని సాంఘిక స్వభావం, ప్రాధాన్యత గుర్తించడం అంత సులభం కాదు.

కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీ, ఫార్వర్డ్ బ్లాక్, దేశంలో యితర వామపక్షాల దృష్టిలో యిది స్పష్టంగా సామ్రాజ్యవాద యుద్ధమే. ఇంగ్లండ్ యిబ్బందిలో వున్నది గనుక వారలా అన్నారు. బ్రిటిష్ వ్యతిరేక భావన వలన, ఏమైనా సరే యుద్ధాన్ని ఎదుర్కోవాలన్నారు. భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందడానికి యిదొక అవకాశంగా తీసుకోవాలన్నారు. 1941 జూన్‌లో రష్యాపై హిట్లర్ దాడి చేసేవరకూ కమ్యూనిస్టు పార్టీ కూడా వీరితోనే వున్నది. యుద్ధ వ్యతిరేక ఉద్యమాన్ని ప్రారంభించాలని వీరు కాంగ్రెసువారిని అర్థించారు.

నాజీ జర్మనీకి వ్యతిరేకంగా జరిగే యుద్ధంలో ఇంగ్లండుకు ఎటువంటి షరతులు లేకుండా మద్దతు యివ్వాలని తొలుత గాంధీజీ భావించాడు. నెహ్రూ కూడా ఫాసిస్టు వ్యతిరేకిగా అలాంటి అభిప్రాయంతోనే వున్నాడు. ఇంగ్లండ్, ఫ్రాన్స్‌లు ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం చేయాలని ఆయన అర్థించాడు. కాని త్వరలోనే యీ తొలి భావాలు మారాయి. అహింస పేరిట గాంధీజీ, రాజకీయాల దృష్ట్యా నెహ్రూ తన అభిప్రాయాలు మార్చారు. ప్రజలలో బ్రిటిష్ వ్యతిరేక భావం ప్రబలంగా వుండడం అతను దృష్టిలో పెట్టుకోక తప్పింది గాదు. మిత్ర కూటమి ఓడిపోతుండగా, భారత ప్రభుత్వం ప్రజల మద్దతుకై ప్రయత్నించలేక పోవడంతో బ్రిటిష్ వ్యతిరేక భావం రోజురోజుకూ ఎక్కువైంది. ప్రజానాయకు

లను, కేంద్ర శాసన సభను సంప్రదించకుండానే దేశాన్ని వైస్రాయి యుద్ధంలోకి దించినందుకు నిరసనగా, మంత్రి పదవులకు కాంగ్రెసువారు రాజీనామాలిచ్చారు తరువాత కొన్ని పరిమితులలో సహకారాన్నిస్తామన్నారు. కాని వైస్రాయి, బ్రిటిష్ ప్రభుత్వం కూడా యీ నిబంధనలు పాటించడానికి నిరాకరించడంతో, చివరకు కాంగ్రెసు 1942 అగస్టులో 'క్విట్ ఇండియా' ఉద్యమాన్ని చేపట్టవలసి వచ్చింది. ఈ ఉద్యమానికి దారితీసిన చిత్రహింసను వర్ణించడం యిక్కడ అనవసరం.

కాంగ్రెసు యుద్ధం పట్ల అవలంబించిన విధానాన్ని రాయ్ ఆమోదించలేదు. 1939 సెప్టెంబరు 6న రాయ్ ఒక ప్రకటనలో యిలా పేర్కొన్నాడు అయిష్టంగానైనా సరే హిట్లర్ వాదాన్ని అంతమొందించడానికి బ్రిటిష్ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని స్వేచ్ఛాభిలాషులందరూ ఆహ్వానించారు. ఇంతవరకూ హిట్లర్ వాదాన్ని బ్రిటిష్ వారు ప్రోత్సహిస్తూ వచ్చారు. ఈ నిర్ణయం గనుక లోగడే తీసుకొని వుంటే, యూరోపులో చాలా దేశాల స్వేచ్ఛ కాపాడడానికి వీలయ్యేదే (ఇండియా అండ్ వార్, రాడికల్ డెమొక్రటిక్ పార్టీ 1942, పరిచయం పుట 1). యుద్ధ వ్యతిరేక ధోరణి అవలంబించవద్దని కాంగ్రెసువారికి నచ్చచెప్పడానికి రాయ్ కొన్ని మాసాల పాటు ప్రయత్నించాడు. అఖిల భారత కాంగ్రెస్ సభ్యుడుగా కాంగ్రెసు అధ్యక్షుడికి వ్రాశాడు. కాంగ్రెసు పోరాట ధోరణి ఆపడానికి అనేక చర్యలు తీసుకున్నాడు, కానీ సఫలుడు కాలేదు. అంతటితో కాంగ్రెసుతో రాయ్ సంబంధం ముగిసింది.

తన సహచరులకు నచ్చ చెప్పడానికి కూడా చాలా కష్టపడవలసివచ్చింది. ఇది సామ్రాజ్య వాద యుద్ధం కాదని అందుకు వ్యతిరేకంగా పోరాడాలని లెనిన్ చెప్పిన సూత్రం యిక్కడ అన్వయించదని చూపడానికి యుద్ధంపై రాయ్ ఒక సిద్ధాంతం వ్రాశాడు. యుద్ధం కొనసాగితే హిట్లర్ వాదం ఓటమి చెందుతుంది. కనుక హిట్లర్‌కు వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని నిరోధించే దేశాలకు హాని కలుగవచ్చు. అప్పటికి యుద్ధం కూడా పేలవ స్థితిలో పడింది. 1940 ఏప్రిల్‌లో

హిట్లర్ మెరుపు దాడులు ప్రారంభించాడు. జూన్ చివరకు పశ్చిమ ఐరోపా అంతా కబళించి వేశాడు. ఆ దేశాలలోని స్వేచ్ఛాయుత సంస్థలను అణచివేశాడు. కీలు బొమ్మ ప్రభుత్వాలను స్థాపించాడు. యుద్ధంలో గెలుపొందే నిమిత్తం ఆ దేశాల వనరులు వాడే నిమిత్తం యిలా చేశాడు. ఇంగ్లండ్ ఒక్కటే రంగంలో నిల బడింది ప్రపంచ వ్యాప్తంగా స్వేచ్ఛ, ప్రజాస్వామ్యాలకు అవసాన దశ వాటిల్లి నట్లనిపించింది.

ఐరోపాలో జరిగిన యీ ఘోర పరిస్థితులు రాయ్‌పై ఎంతో ప్రభావాన్ని చూపెట్టాయి. ఫాసిస్టు వ్యతిరేక ప్రజా యుద్ధంగా మారిందనీ, దీని విజయానికి సత్తానంతటినీ వినియోగించాలని అతను గుర్తించాడు. డెహ్రాడూన్‌లో మే చివర లో జరిగిన అధ్యయన శిబిరంలో రాయ్ చేసిన ప్రసంగం వలన ఎంత మాన సిక క్షోభకు గురైనాడో విదితమవుతుంది 'ప్రతిరోజూ ఉదయం వణికిపోతూ వార్తాపత్రిక చూస్తాను. సామ్రాజ్యవాద ఇంగ్లాండ్, ఫ్రాన్స్‌ల పట్ల నాకెలాంటి ప్రేమ లేదు. కాని ఐరోపా అంతా కూడా ఫాసిజంగా మారిపోవడం భయం కరంగా వుంటుంది వూహించుకుంటే. జర్మనీలో ఫాసిజం తలెత్తడంతో కనీసం ఒకతరం పాటు విప్లవం ఆలస్యమైంది. ఐరోపా అంతటా ఫాసిజం తన ఆధి పత్యాన్ని స్థాపించడంలో విజయం పొందితే ఇక విప్లవానికి స్వస్తి చెప్పవచ్చు. అలాగే భారతదేశ స్వేచ్ఛకు కూడా స్వస్తి పలకవచ్చు.' (ఇండియా అండ్ వార్ పుట 128)

జూలై 14న దేశవ్యాప్తంగా ఫ్రెంచి విప్లవ దినోత్సవం జరిపి, హిట్లర్ అక్రమణకు గురైన ఫ్రాన్స్ పట్ల సానుభూతి, అంత చూపాలని కాంగ్రెస్‌కు రాయ్ విజ్ఞప్తి చేశాడు. ఇది తగినది కాదని సూచనను తిరస్కరించారు. పూనాలో తరువాత ఎ. ఐ. సి. సి. సమావేశమైంది. ఫాసిజానికి వ్యతిరేకంగా పాల్గొనాలని రాయ్ తీర్మానం పెట్టాడు. ఈ తీర్మానాన్ని చర్చకు తీసుకోలేదు,

సెప్టెంబరు 1న ఫాసిస్టు వ్యతిరేక ప్రదర్శనలు జరపాలని రాడికల్ కాంగ్రెస్ లీగ్ నిర్ణయించింది. కాంగ్రెస్ పార్టీ వీటిని నిషేధించింది. రాడికల్స్ వీటిని జరపడంతో, క్రమ శిక్షణ చర్య తీసుకున్నారు. ఆ నెపంతో ఉత్తర ప్రదేశ్ కాంగ్రెస్ రాయ్‌ను బహిష్కరించింది. తరువాత బహిష్కరణ ఉపసంహరించి, రాజీనామాను ఆమోదించారు. ఆవిధంగా కాంగ్రెసుతో సంబంధం రాయ్‌కు రాడికల్స్‌కు తెగిపోయింది. కొమింటర్న్‌తో బంధం తెగిన 11 ఏళ్ళకు యిది జరిగింది. రెండు సందర్భాలలోనూ స్వయంగా ఆలోచించినందుకు, తాను సరైనదని భావించిన విషయం చెప్పినందుకే చర్య తీసుకున్నారు.

10 వ అధ్యాయం

# యుద్ధం-విప్లవం

కాంగ్రెస్‌తో తెగతెంపులు చేసుకున్న తరువాత, రాడికల్ కాంగ్రెస్‌లీగ్ కాస్తా రాడికల్ డెమొక్రటిక్ పార్టీగా రూపొందింది. 1940 డిసెంబరులో ప్రథమ సమావేశ ప్రారంభోత్సవం బొంబాయిలో జరిగింది. పార్టీకి రాయ్ స్నేహితుడు, తాత్వికుడు, మార్గదర్శకుడయ్యాడు. ఇదొక ప్రజా పార్టీగా మార్చాలని ఆయన ఉద్దేశ్యం. ప్రజల పార్టీ కావాలని చిరకాలంగా రాయ్ కోరుతున్నాడు. కాంగ్రెస్ అటువంటి స్వరూపాన్ని సంతరించుకుంటుందనుకొని, అందుకోసరం పని చేశాడు. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధాన్ని బలపరచడానికి కాంగ్రెస్ 1940లో నిరాకరించడంతో యీ ఆశ కాస్తా అంతరించింది. అయితే ప్రజా పార్టీ అవసరం అంతరించలేదు రాడికల్ డెమొక్రటిక్ పార్టీ ఆ పాత్రను నిర్వహించాలని రాయ్ ఆశించాడు.

యుద్ధంలో ఏ ధోరణి అవలంబిస్తారనే దానిని బట్టి వ్యక్తి లేక వ్యవస్థ అభ్యుదయ స్వభావం వుంటుందని, ఇదొక్కటే అగ్నిపరీక్ష అని రాయ్ ఉద్దేశ్యం. నాడు యుద్ధమే ప్రధాన సంఘటన. ప్రపంచ గతి దీనిపై ఆధారపడి వున్నది. యుద్ధాన్ని సమర్థించి, విజయానికి తోడ్పడిన వారు అభ్యుదయవాదులు. ఇతరులు తిరోగమనులు, అభ్యుదయానికి శత్రువులు. ఈ గీటురాయి ప్రకారం బ్రిటిష్ యుద్ధనాయకుడు విన్‌స్టన్ చర్చిల్ అభ్యుదయవాది, విప్లవకారుడు, గాంధీజీ, నెహ్రూ తదితరులు మిగిలిన వర్గానికి చెందినవారు. బ్రిటిష్ వారితో గాని, భారత ప్రభుత్వంతోగాని పనిచేయాలని రాయ్ తలచకపోయినా, కాంగ్రెస్‌ను ఆ పార్టీ నాయకులను విమర్శించడం, వారిదోషాలు చూపడం తన

కర్తవ్యమని అనుకున్నాడు. దీని వలన రాయ్‌కు కీర్తి కాస్తా పోయింది. దూషణలకు, నిందలకు గురైనాడు. అంతమాత్రాన రాయ్ ఆగలేదు. తనపై తిట్ల వర్షం కురుస్తున్నా లెక్కచెయ్యక విధి నిర్వహించాడు. యుద్ధారంభంలో రాయ్ రచనల నుంచి రెండు ప్రస్తావనలు అతడి తీవ్రభావాలను సూచిస్తాయి. మనం విప్లవకారులం. కనుక ఫాసిజం ఓడిపోవాలను కుంటాము. ఫాసిజాన్ని ఓడిస్తే సామ్రాజ్య వాదం బలహీనపడుతుంది. ఒక్క-క్షణం ఆలోచించండి, ఫాసిజం నెగ్గితే ఏం జరుగుతుంది? ప్రపంచ వ్యాప్తంగా విప్లవ శక్తుల్ని అణచివేసే పరిస్థితి ఏర్పడుతుంది భారతస్వాతంత్ర్య విషయం కూడా చిక్కులో బడుతుంది. కనుక ఫాసిజం నెగ్గాలని మనం కోరము. ఫాసిజం నాశనం కావాలనుకుంటే దాని వినాశనానికి చేయగలిగినదంతా ఎందుకు చేయరాదు? (ఇండియా అండ్ వార్, పుట 134).

మరొక సందర్భంలో యిలా వ్రాశాడు: స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం కోసరం పోరాడే వారంతా తక్షణం ఫాసిజంపై పోరాడాలి. ఇది అంగీకరించకపోతే దోషపరులే అనాలి. ప్రపంచంలో పతనమైన విధానాన్ని పునరుద్ధరించడానికి ఫాసిజం ఒక సాధనే. ఇది నాశనమైతే, విధానమంతా కూలిపోతుంది. అప్పుడు ఉన్నత నాగరికత నిర్మించే రీతులలో నిమగ్నమైన స్వేచ్ఛాపరుల మధ్య స్వేచ్ఛా భారతావనికి తగిన స్థానం వుంటుంది. మనపట్ల సామ్రాజ్యవాద బ్రిటిష్ విధానం ఎలా వున్నప్పటికి యీ పోరాటంలో దేశం పాల్గొనాలి. భారత స్వాతంత్ర్యం కోసరం పోరాడే వారు బ్రిటిష్ ప్రజాస్వామ్యానికి సహకరించాలి. ఇది బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి భిన్నమైనది. (ఇండియా అండ్ వార్ 30-32)

యుద్ధానికి రాయ్ మద్దతు ప్రకటించడంలో ఐరోపా ప్రజాస్వామ్యం, ఐరోపా నాగరికత గతిని దృష్టిలో పెట్టుకున్నాడు. నెహ్రూతప్ప జాతీయ నాయకులలో ఎవ్వరూ యీ భావాలను పంచుకోలేదు. జాతీయోద్యమ పోకడల పట్ల నెహ్రూ అసంతృప్తి చెందినా, దానితో తెగతెంపులు చేసుకోలేకపోయాడు. రాయ్ స్వేచ్ఛాపరుడుగా తన మార్గాన్ని అవలంబించాడు. ఫాసిజం నెగ్గితే ఐరోపా మళ్లీ

ఆటవికత్వంలోకి పోతుందని రాయ్ బాధ పడ్డాడు హిట్లర్ ముందు ఐరోపా మోకరిల్లుతుంటే, అవి అంధకారరోజులుగా రాయ్ భావించాడు. నాడు ఐరోపా స్థితిని చిత్రిస్తూ, మార్గాంతరాలను సూచిస్తూ రాయ్ వ్రాసిన వ్యాసాలను తరువాత విధర్ యూరోప్ అనే శీర్షికన ప్రచురించారు. తరువాత కొన్ని మార్పులతో వీటిని రష్యన్ రివల్యూషన్ అనే బృహద్గ్రంథంలో చేర్చారు.

భారతదేశ స్వాతంత్ర్యాన్ని గూర్చి రాయ్ ఉదాశీనత వహించలేదు. అయితే, స్వేచ్ఛా ప్రపంచంలోనే స్వదేశం స్వేచ్ఛగా వుండగలదని ఆయన వాదన ఫాసిజం నెగ్గితే భారతదేశం స్వేచ్ఛగా వుండజాలదు. బ్రిటిష్ యజమా నుల స్థానే జర్మన్ లేదా జపాన్ యజమానులు వస్తారంతే. ఫాసిజంపై జయ ప్రదంగా పోరాటం జరిపితే, సామ్రాజ్య వాదం బలహీన పడుతుంది. అప్పుడు వచ్చే సామాజిక శక్తుల వలన బ్రిటను యిక ఏమాత్రం భారతదేశాన్ని బంధించలేదు.

అప్పుడిలా వ్రాశాడు ఫాసిజం నెగ్గితే ప్రపంచం అధోగతి పాలవుతుంది. దానితో పాటే భారతదేశం కూడ ఆటవిక దశలోకి పోతుంది. ఫాసిజానికి గురైన వారి కోసమే గాక, మన స్వేచ్ఛా పోరాట విజయం కూడా, యీ బెడదను నాశనమయ్యేటట్లు చూడాలి.

[ఇండియా అండ్ వార్ పుట.240] ఫాసిజంపై యుద్ధం భారత స్వాతంత్ర్యం కోసం జరిగే పోరాటమే. భారతీయులు దీనికి పూర్తి మద్దత్తు యివ్వాలి. రాయ్ ముందే వూహించింది నిజమైంది. అప్పట్లో జాతీయ వాదులు యీ విషయాన్ని నమ్మలేదు.

నాడు దేశంలో బ్రిటిష్ వ్యతిరేక భావం, ఫాసిస్టు అనుకూల ధోరణి ప్రబలి వున్నది. కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ, కమ్యూనిస్టుపార్టీ ఫార్వర్డ్ బ్లాక్ తదితర వామ పక్షాలు ఈ ధోరణికి అనుకూలంగా వున్నాయి. కాంగ్రెస్‌లో తీవ్ర జాతీయవాదులు కూడ దీనినే బలపరచారు. గ్రేట్ బ్రిటన్ యుద్ధారంభంలో

తీవ్ర ఓటమికి గురి కావడం కూడా కలసి వచ్చింది. కాంగ్రెసు కోర్కెలను భారత ప్రభుత్వం అంగీకరించక పోవడం కూడా కొంత దోహదం చేసింది. కాంగ్రెసు పట్ల ప్రభుత్వం అనుమానంగా వున్నది. అంతేకాక యుద్ధానికి నిర్ని బంధంగా మద్దతు ప్రకటించిన రాడికల్స్‌ను కూడ అనుమానించింది. ఒక సందర్భంలో యీ విషయమై రాయ్ యిలా వ్రాశాడు: మాకు ముందు నుయ్యి వెనుక గొయ్యి వలె వున్నది సమస్యలు అర్థంగాని సంకుచిత జాతీయవాదులు మమ్మల్ని దూషిస్తున్నారు. ప్రమాదంలో బడిన విలువలు కూడా వారికి అవగాహన కావు. మరో ప్రక్కన మేము విప్లవ వాదులం గనుక ప్రభుత్వం కూడా అనుమానిస్తున్నది. ఇటువంటి ప్రమాదకర ప్రవాహంలో స్పష్టంగా చూస్తూ ముందుకు పోవడానికి మా విశ్వాసాల బలమే తోడ్పడుతున్నది. [ఇండియా అండ్ వార్ పుట 332] రాయ్‌ను వైశ్రాయి కార్యవర్గ సమితిలో చేర్చిన విషయమై వదంతులు వ్యాపించాయి. అవి అబద్ధమని ఋజువయ్యాయి. అయితే రాయ్ తన వ్యక్తిత్వం, తీవ్ర కృషి వలన ప్రభుత్వం లోని కొందరు మూల పురుషుల విశ్వాసం చూరగొన్నాడు. దీని వలన తన కృషిని తీవ్రంగానూ, స్వేచ్ఛగానూ సాగించ వీలయింది

1941 జూన్‌లో, రాయ్ ముందే చెప్పినట్లు, రష్యాపై జర్మనీ దాడి జరిపింది. యుద్ధం రష్యాకు వ్యాపిస్తుందని, పోరాటంలో రష్యా దిగక తప్పదని రాయ్ అన్నాడు. దీనివలన యుద్ధం పట్ల కాంగ్రెస్ ధోరణి మారలేదు. 1942 ఆరంభంలో యుద్ధం భారతదేశానికి సోకింది. జపాన్ యుద్ధంలో చేరి, ఆగ్నేయాసియాలో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని హరించి వేసింది. మద్రాసు, కలకత్తాపై బాంబులు పడగా, దేశవ్యాప్తంగా భయం ఆందోళన ప్రబలింది. దేశ రక్షణకు భారత ప్రభుత్వం తగిన పథకాలు వేయలేదు. ఏర్పాట్లు గావించలేదు. ఈ క్లిష్ట సమయంలో కాంగ్రెస్, ముస్లింలీగ్‌లను తిప్పుకోవడానికి గాను క్రిప్స్ రాయబారం వచ్చింది. అది విఫలమైంది. కాంగ్రెస్ నిరాకరణోద్యమం కొనసాగిస్తూ, 1942 ఆగస్టులో క్విట్ ఇండియా ఉద్యమం

ఆరంభించింది, ఇది చూసి రాయ్ చాలా బాధ పడ్డాడు. దేశ రక్షణ విషయం విస్మరించి ఫాసిస్టు వ్యతిరేక శక్తులకు ద్రోహం చేశారన్నాడు. క్విట్ ఇండియా ఉద్యమాన్ని రాయ్ వ్యతిరేకించాడు. ఇందుకు రాయ్, రాడికల్స్ తీవ్ర నష్టానికి గురి అయ్యారు. బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా యిది చివరి పోరాటమని చాలా మంది నమ్మారు. చాలా చోట్ల రాడికల్స్‌ను తిట్టి కొట్టారు, రాళ్ళు విసిరారు, వెలివేశారు.

దేశ రక్షణ విషయం ప్రజల బాధ్యత అని రాయ్ వాదించాడు. ఓడిపోతే విదేశ ప్రభుత్వం మన గతికి మనల్ని వదలి పోతుంది. కానీ ప్రజలు, వారి నాయకులు యిటువంటి ధోరణి అవలంబించలేరు.

భయాందోళనలు వ్యాపిస్తున్నప్పుడు రాయ్ కలకత్తాలో వున్నాడు. చాలా సమావేశాల్లో రాయ్ మాట్లాడాడు. ప్రజలకు చెప్పాడు. గెరిల్లా యుద్ధాన్ని గురించి, దేశ రక్షణకై ప్రజా సంఘాల గురించి వివరించాడు. దీని ప్రభావం కనబడింది. బాంబుల దాడి, శత్రువుల అణచి వేతకు భయపడి కార్మికులు కార్మాగారాలు వదలి పారిపోతున్నారు. ఉత్పత్తి కొనసాగడానికి వారికి ధైర్యం చెప్పడం, పారిపోకుండా పని చేసేటట్లు చూడడం అవసరం. ఇందుకు ప్రచారం కావాలి. ప్రభుత్వం కొంత ఆర్థిక సహాయం చేస్తానన్నది. ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్‌కు ఆర్థిక సహాయం యివ్వ ప్రయత్నించింది. ఈ కొత్త సంస్థ రాయ్ నాయకత్వాన ఏర్పడి, యుద్ధంలో ప్రభుత్వానికి పూర్తి మద్దత్తు ప్రకటించింది. ప్రభుత్వం యిస్తానన్న ఆర్థిక సహాయాన్ని ఫెడరేషన్ పక్షాన రాయ్ ఆమోదించాడు. నెలకు 13 వేల రూపాయలు యిస్తామన్నారు. రెండేళ్ళు యీ సహాయం యిచ్చారు. ఈ డబ్బును ప్రచారం కోసం,భయంవ్యాపించకుండా కార్మికసంఘాలు స్థాపించడానికి వినియోగించారు. ఖర్చులన్నీ వివరంగా అకౌంటెంట్ జనరల్ చూసి తృప్తిచెందాడు.

ఈ ధనాన్ని ఆమోదించడం వలన రాయ్ శత్రువులకు మరొక పూతం లభించింది. అతనిపైన అతని సహచరులపైన తీవ్ర వ్యతిరేక ప్రచారం సాగించారు.

తిట్లను, అక్రమ విమర్శను రాయ్ లెక్క-బెట్టలేదు. యుద్ధానికి తోడ్పడడం అనేది సామాజిక విప్లవానికి దోహదం చేస్తుందని అతను నమ్మాడు. జీవితమంతా యిటువంటి విప్లవం కోసమే కృషి చేశాడు. యుద్ధంలో నిమగ్నమైన దేశాలలో సాంఘిక విప్లవం వస్తున్నది. స్వార్థపరులు తుడిచి పెట్టుక పోతున్నారు. అన్యాయాలకు గురైన కార్మిక వర్గం అగ్రస్థాయికి వస్తున్నారు. గ్రేట్ బ్రిటన్‌లో యిలా జరగడం స్వయంగా రాయ్ గమనించాడు. భారతదేశంలోనూ అలాగే జరగాలనుకున్నాడు. ప్రజలు చైతన్య వంతంగా, ప్రయోజనాత్మకంగా యుద్ధానికి తోడ్పడితే యిది తప్పదు. కాంగ్రెస్ గనుక యుద్ధ ప్రయత్నానికి తోడ్పడే బాధ్యత స్వీకరిస్తే వారు కోరేవన్నీ తీర్చుకునే శక్తి లభిస్తుంది. ఇది అంతర్జాతీయ అంతర్యుద్ధమని రాయ్ ఉద్దేశ్యం. ఫాసిస్టు శక్తుల ఓటమి జరిగితే, ప్రతి దేశంలోనూ ఫాసిస్టు శక్తులు పోతాయన్నాడు. ఈ భావనతో యుద్ధంలో విప్లవకారులు బ్రిటిష్ వారికి తోడ్పడ్డారు. త్వరలోనే బ్రిటిష్ సామ్రాజ్య వాదం అంతరిస్తుంది, రాయ్ ముందే వూహించినట్లు వికాసంతోనూ, జాగురూకతతోనూ వుండే బ్రిటిష్ ప్రజాస్వామ్యం గెలుస్తుంది. రాయ్ సలహాను అంగీకరించనందున కొన్నేళ్ళు జాప్యం జరిగింది. 1947 ఆగస్టులో స్వాతంత్ర్యం శాంతియుతంగానూ రాజ్యాంగ పరంగానూ వచ్చింది. సామ్రాజ్య వాదం స్థానే ప్రజాస్వామ్యం రావడమే యిందుకు కారణం. రాయ్ జోస్యం చెప్పినట్లు సామ్రాజ్య వాదం హరించి పోతుంది. ఫాసిస్టు శక్తులు ఓడిపోగానే యిది సంభవిస్తుం దన్నాడు. యుద్ధానంతరం ఆగ్నేయాసియాలో దక్షిణాసియాలో బ్రిటిష్, ఫ్రెంచి, డచ్ సామ్రాజ్యవాదం హరించి పోవడంతో రాయ్ మాటలు నిజమయ్యాయి. తాను చెప్పిన వాటికి అంతకంటే మంచి ఆధారాలు చూపమని రాజకీయ శాస్త్రజ్ఞు డెవ్వడూ కోరడు,

1952 చివరకు, ఫాసిస్టు శక్తుల ఓటమితో యుద్ధం ముగుస్తుందనేది స్పష్ట పడింది. అది గ్రహించిన రాయ్, యుద్ధానంతరం దేశంలో అభివృద్ధి విషయం ఆలోచించసాగాడు. భారతదేశం స్వేచ్ఛ పొందుతుందనడంలో అతనికి అనుమానం లేదు. అయితే స్వేచ్ఛా భారతావనికి ఆర్థిక రాజకీయ చట్టాన్ని గురించి ఆలోచించడం అవసరమని రాయ్ భావించాడు ఇండిపెండెంట్ ఇండియాలో వ్యాసపరంపర ప్రకటిస్తూ, ఆర్థిక ప్రణాళికలో ఎటువంటి ఆర్థిక రూపురేఖలు వుండాలి అనే విషయం చూపాడు. ఈ భావాల ఆధారంగా, జి. డి. పరీఖ్, వి. ఎం. తార్కుండే, బి. ఎన్. బెనర్జీ అనే ముగ్గురు రాయ్ సహచరులు 1954 లో ఒక నిర్దుష్ట ప్రణాళికను, 15 వేల కోట్ల రూపాయలు వ్యయం కాగలదని, వ్రాసి చూపారు. అదే సమయంలో పారిశ్రామికవేత్తలు ముఖా తయారు చేసిన ప్రణాళికకు భిన్నంగా, దీనిని ప్రజలు ప్రణాళిక అనేవారు. రాయ్ ప్రణాళిక అయిన దీనిలో మౌలికమైన అంశాలేమంటే, వ్యవసాయం, సాంఘిక సేవ స్వయం ఆర్థిక వనరులపై ఆధారపడడం చూడవచ్చు. 1951 లో దేశ ప్రణాళిక శకం ఆరంభమైనప్పుడు, ప్రభుత్వం గాని ప్రణాళికా కర్తలు గాని దీనిని పట్టించుకోకపోవడం విచారకరం.

ఒక సంవత్సరం తరువాత దేశానికి రాజకీయ చట్టాన్ని రాయ్ సిద్ధం చేశాడు. ఆర్థిక పునర్నిర్మాణంవలె రాజకీయ పునర్నిర్మాణం కూడా అవసరం. ప్రజల ప్రణాళికకు యిదే ప్రాతిపదిక. దీనిని అనుసరించి, కొద్ది మాసాలకే స్వేచ్ఛా భారతావనికి ముసాయిదా రాజ్యాంగాన్ని సిద్ధం చేశారు. దీనినే ముసాయిదా రాజ్యాంగం అని పిలిచేవారు. రాడికల్ డెమొక్రటిక్ పార్టీ ఆమోదించిన 18 సూత్రాల ఆధారంగా యిది రూపొందించారు. తరువాత ప్రచారంలో పెట్టారు. రాయ్ దీనిని సిద్ధం చేశాడు. 1944 డిసెంబరులో ప్రజలు చర్చించే నిమిత్తం దీనిని విడుదల చేశారు.

ముసాయిదా కేవలం మౌలిక సమస్యలు, వివాదాస్పద విషయాలనే ప్రస్తావించింది చట్టాన్ని ఆమోదిస్తే వివరాలు తరువాత చూసుకోవచ్చుననుకున్నారు.

ప్రజాస్వామిక రాజ్యాన్ని భావించారు. మౌలిక సాంఘిక రాజకీయ సూత్రాలపై ఆధారపడి సిద్ధం చేశారు. స్వదేశీ సంస్థానాలు అంతం కావాలనీ, పొరుగు రాష్ట్రాలలో వాటిని చేర్చాలనీ, భాష సంస్కృతి ఆధారంగా యిది జరగాలనీ వ్రాశారు. ఇందులో అతి ప్రధానమైన మౌలిక సూత్రం: రాజ్యాంగాధికారానికి వ్యవస్థాగత ప్రజాస్వామ్యం వుంటుంది. ప్రజల సార్వభౌమత్వానికి యిదొక సాధన. ఏకాకిగా వున్న వ్యక్తులు ప్రజాస్వామ్యాన్ని అధిగమించేటట్లు చేయజాలరని చరిత్ర చెబుతున్నది. విశాల దేశంలో ఎన్నికలు నిర్వహించడానికి అడ్డొచ్చే యిబ్బందులను నిర్మాణయుత ప్రజాస్వామ్యం తొలగిస్తుంది. రాజ్యానికి చెందిన శాసన, పాలనాధికారాలను సాధ్యమేనని యివి రుజువు చేస్తుంది. ఈ రెండిటినీ విడదీయడం వలన ప్రజాస్వామ్యం ఆచరణలో దెబ్బ తిన్నది ప్రజల సార్వభౌమత్వం లాంఛనంగా మారింది. దీనికి యితర పరికల్పనలకు మద్దతుగా ముసాయిదా యిలా పేర్కొన్నది. యుద్ధానికి పూర్వపు ప్రపంచాన్ని మళ్ళీ నిర్మించలేమనే అభిప్రాయం ప్రబలివున్నది. ఆర్థికంగానూ, రాజకీయంగాను దీనిని పునర్నిర్మించాలి. ఈ పునర్నిర్మాణం వాస్తవం కావాలంటే, ఆర్థిక శక్తికీ రాజకీయ హక్కులకూ సంబంధం వుండాలి. అటువంటి సంబంధంతోనే వాస్తవమైన ప్రజాస్వామిక రాజ్యాంగం సాధ్యపడుతుంది. ముగింపులో యిలా అన్నారు- "ఉడికిపోతున్న యుద్ధలోకం నుంచి, కొత్త ప్రపంచం ఆవిర్భవిస్తుంది. భారతదేశం అందులో భాగం అవుతుంది. అటువంటి నవభారతావని గురించే ముసాయిదా పేర్కొంటున్నది. (కాన్స్టిట్యూషన్ అఫ్ ఇండియా ఎడ్రాఫ్ట్-పరిచయం)."

మిగిలిన యుద్ధకాలంలో ప్రజా ప్రణాళిక, ముసాయిదా రాజ్యాంగాన్ని గురించి బాగా ప్రచారం చేశారు. అందులో కొన్ని రాడికల్ హ్యూమనిజం లక్షణాలున్నవి. రాయ్ చివరి దశలో యిదే ప్రధాన కార్యకలాపంగా మారింది.

## 11 వ అధ్యాయం

# నవ్యమానవ వాదంలోకి

రాయ్ తన జీవితంలో చివరి దశలో కమ్యూనిజం నుంచి నవ్యమానవ వాదం వైపుకు పయనం సాగించారు. కమ్యూనిజంలో లోపాలనూ, దోషాలనూ కనుగొన్న అనంతరం జీవిత సమగ్ర తత్వంగా నవ్యమానవ వాదాన్ని రూపొందించాడు.

యుద్ధానంతరం, యుద్ధ సమయంలోనూ జరిగిన విషయాలు రాయ్ అన్వేషణ మనోఫలకంపై ఎంతో ప్రభావాన్ని కలిగించాయి. కమ్యూనిస్టు సిద్ధాంతాలనూ, సూత్రాలనూ మరొకసారి పరిశీలించవలసి వచ్చింది. కమ్యూనిజాన్ని స్వేచ్ఛా తత్వంగా అతను ఆమోదించాడు. కాని ఆచరణలో, రష్యాలో విజయానంతరం భయానక బానిసరాజ్య స్థాపన చూశాడు. స్టాలిన్ అభ్యుదయ శక్తుల నైతిక నాయకత్వాన్ని యుద్ధానంతరం తొలగించటాన్ని చూసి దిగ్భ్రమ చెందాడు. ఐరోపాలో సైనిక దండయాత్ర జరిపే ప్రయత్నాన్ని కనుగొన్నాడు. రష్యా నాయకత్వాన యుద్ధ సమయంలో స్టాలిన్ అనుసరించిన ఎత్తుగడలూ, విధానాలూ, కొన్నిటిని తానూ సమర్థించాడు. అవి సంకుచితమైనవనీ, అవకాశవాదంతో కూడినవనీ, రష్యాకూడా సంకుచిత జాతీయ రాజ్యంగా దిగజారిపోయిందనీ తెలుసుకున్నాడు. ఈ దోషాలకూ దుష్కృత్యాలకూ ఏ ఒక్క వ్యక్తినీ వేలుపెట్టి చూపేకన్నా, స్టాలిన్‌కూ, యితర కమ్యూనిస్టు నాయకుల చర్యలకూ, మౌలిక తత్వంగా వున్న విషయంలో మూలాన్ని పరిశీలించడం ప్రారంభించాడు.

కమ్యూనిజం మానవుడిని పరిగణించక జుగుప్సతో చూస్తున్నట్లు రాయ్ కనుగొన్నాడు. మానవుడు గ్రుడ్డి ఆర్థిక శక్తుల చేతుల్లో నిస్సహాయుడుగా మారినట్లు సమిష్టివరం పేరిట ప్రాధాన్యత లేని వాదయినట్లూ రాయ్ చూశాడు. మనిషికి స్వతంత్రం సార్వభౌమత్వం లేదు. పెట్టుబడి దారీ విధానం క్రింద దాకా యిలానే జరిగింది. ప్రపంచాన్ని ఎదుర్కొంటున్న సంక్షోభంలో యిదే మూలకారణంగా రాయ్ గమనించాడు. పెట్టుబడిదారీ విధానంగానీ కమ్యూనిజం గానీ, యీ సంక్షోభాన్నుంచి మార్గాన్ని చూపడంలేదు.

సుదీర్ఘ అనుభవం వలన ఐరోపాలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో లోపాలను రాజకీయ పరంగానూ, ఆర్థిక రంగంలో పెట్టుబడి దారీ విధానం లోప భూయిష్టంగానూ రాయ్ కనుగొన్నాడు. వీటికి ప్రత్యామ్నాయంగా కార్మిక నియంతృత్వాన్ని, కేంద్ర ప్రణాళికనూ సూచిస్తున్న కమ్యూనిజం కూడా లోపాలతో వుందని తెలుసుకున్నాడు మనిషికి విమోచన యిచ్చేబదులు, పార్టీ నాయకులు నియంతృత్వాన నడిచే సర్వశక్తి వంతమైన రాజ్యంలో మనిషిని బానిస చేస్తున్నారు. కనుక కమ్యూనిజానికి మించి పోయి వర్గంలోనూ జాతిలోనూ సభ్యుడుగా కాక మనిషిని మనిషిగా చూస్తూ అతని స్వేచ్ఛనూ, అభ్యుదయాన్ని కాపాడే రాజకీయ ఆర్థిక సంస్థలు అవసరం అనుకున్నాడు, ఈ సంక్షోభం నుంచి బయట పడడానికి, ప్రపంచాన్ని యుద్ధం వినాశనం వైపుకి తీసుకెళుతున్న పద్ధతుల నుంచి పరిష్కార మార్గంగా, నిర్మాణయుత ప్రజా స్వామ్యాన్ని సహకార ఆర్థిక విధానాన్ని రాయ్ ఆలోచించాడు.

సంఘటిత ప్రజాస్వామ్యానికీ, సహకార ఆర్థిక విధానానికీ తాత్విక పునాదులు కల్పించటం అవసరం. రాయ్ నవ్యమానవ వాదంలో యివి వున్నాయి. 1944 నుంచీ వీటిని రూపొందించటంలో రాయ్ నిమగ్నుడయ్యాడు. 1946 లో వ్రాసిన 22 సిద్ధాంతాలు స్పష్టమైన ప్రకటనల రూపంలో సూచన ప్రాయంగా వెల్లడించాడు. 1946 డిశంబరులో బొంబాయిలో జరిగిన మహాసభలో రాడికల్

డెమోక్రాటిక్ పార్టీ యీ సిద్ధాంతాలను ఆమోదించింది అంతకుముందు చాలా మాసాల పాటు వీటిని విపులీకరించాడు. 1848లో కార్లమార్క్స్ ప్రచురించిన కమ్యూనిస్టు ప్రణాళికవలె కాలాను గుణంగా నవ్యమానవ వాద ప్రణాళిక కూడా విప్లవ సాహిత్యంలో అదే స్థాయిని పొందవచ్చు.

నవ్యమానవ వాదానికి మౌలిక విలువగా స్వేఛ్ఛ వుంటుంది అన్ని మానవ విలువలు కూడా యీ మహోన్నత విలువ నుంచే వస్తాయి స్వేఛ్ఛా భావనపై యిలా నిర్వచనం చెప్పాడు: జీవిత ప్రయోజనం నివశించటమే. మనుగడ కోసరం పోరాడటం జీవికి బ్రతుకుతెరువు బాటగా వున్నది. జీవ పరిణామం అంతటిలోనూ యిది సాగుతూనే వుంటుంది. మానవ స్థాయిలో స్వేఛ్ఛా పిపాసగా-ఉన్నత మానవ విలువగా తెలిసి దీనిని కోరుకుంటాం. జంతువు మనుగడకోసం సాగించే పోరాటంలోనే మానవుడి అనంత స్వేఛ్ఛా పోరాటానికి ఆరంభదశ ఏర్పడింది. బ్రతకాలనే తృష్ణ మానవుడి చర్యాలకూ, సాంస్కృతిక ప్రగతికి వైజ్ఞానికంగా సాధించిన వాటికీ కళాత్మక సృష్టికి, మానవుడు చేసే ప్రతిదానికి దోహదం చేస్తుంది. మానవుడు పరిమితుడు. విశ్వం అనంతం మానవుడి పరిసరం అంతా విశ్వమే కనుక స్వేఛ్ఛా పోరాటం శాశ్వతమైనది మానవుడు విశ్వాన్ని ఎన్నడూ జయించలేడు. స్వేఛ్ఛా పిపాస ఒక్కటే మానవ లోకంలో శాశ్వతమైనది. ఈ పిపాస వలన జ్ఞానార్జన చేయగల్గుతున్నాడు. తెలుసుకోవడంతో తన పరిసరాలను జయించగలుగుతున్నాడు. [న్యూ ఓరియంటేషన్, యం. యన్. రాయ్, రెనైజాన్స్ పబ్లికేషన్స్, కలకత్తా, 1946, పుట28]

మానవునికి అంతటినీ, నైరూప్య భావన నుంచి సాంఘిక రాజకీయ పునర్నిర్మాణం వరకు ఆవరించే జీవిత తత్వమే నవ్యమానవ వాదం. పారలౌకిక వాదంలో దీనికి విశ్వాసంలేదు. ఈ తత్వం ప్రకారం మానవుడు ప్రకృతి సృష్టి. భౌతిక విశ్వంలో మానవుడు అంతర్భాగం. విశ్వం నియమబద్ధమైనది కనుక మానవుడి ఉనికీ, మార్పు, ఉద్వేగాలూ, ఇచ్ఛా, భావాలూ అన్నీ ముందే

నిర్ధారణ అయినాయి. అంటే మానవుడు ప్రాయికంగా హేతువాది. విశ్వంలోని పొందికకు ప్రతిధ్వనే మానవుడిలో వివేచనగా వున్నది. [రాడికల్ హ్యూమనిజమ్, ఎం.ఎన్. రాయ్, ఈ స్టరన్ ఎకానమిస్టు పేంప్లెట్స్, న్యూఢిల్లీ 1952, పుట 16] మానవుడు హేతువాది గనుక నీతిమంతుడు. వివేచన పెంపొందుతుంటే నీతి కూడా విస్తరిస్తుంటుంది. కనుక ఆదిమ మానవుడు మంచి నాగరికపౌరుడుగా అభివృద్ధి చెందటానికి బాహ్య, అలౌకిక శక్తి కోసరం పోవలసిన అవసరంలేదు. తన మనుగడను జయప్రదంగా సాగించుకోవడానికి మానవుడు సమాజాన్ని సృష్టించాడు. మానవ ప్రగతికై జరిగే సాంఘిక పోరాటం, మానవ పరిణామక్రమం అంతా ఉన్నత స్థాయిలో జరిగే మనుగడ పోరాటమే. అయితే యీ పోరాటం ప్రేరణవలన, సహజ ఎంపిక వలనాకాక తెలివితేటలనూ, ఎంపికనూ, వివేచన వలన జరుగుతున్నది. [సైన్స్ అండ్ ఫిలాసఫీ, యం. యన్. రాయ్, రెనైజాన్స్ పబ్లిషర్స్, కలకత్తా, 1947, 28].

నవ్యమానవ వాదం నవనాగరికత స్థాపకుల సంప్రదాయాన్ని దేవుళ్ల వారి బంటుల నిరంకుశత్వానికి ఎదురు తిరిగే మానవ స్వభావాన్ని అనుసరించినట్లు రాయ్ పేర్కొన్నాడు. [సైన్స్ అండ్ ఫిలాసఫీ, పుట 28]. పునర్వికాస ఆలోచనాపరుల నుంచి, 18వ శతాబ్దపు మానవతా తత్వవేత్తల నుంచీ ప్రేరణ పొందినందువలన నవ్యమానవ వాదం కేవలం కొత్తది కాదు అని రాయ్ చెప్పాడు. ఆనాడు మానవుని సంబంధాన్ని ప్రకృతిలో చూడటానికి వారికి సాధ్యపడలేదు. మానవవాదం యిప్పుడు మూలానికి వెళ్లగలదు. అందుకనే సమూల మానవ వాదమని రాయ్ తన తత్వానికి పేరు పెట్టాడు.

నవ్య మానవ వాదం వైపుకు ప్రయాణం సుఖంగా జరగలేదు. కమ్యూనిస్టు దశలో వాస్తవమని నమ్మిన వాటిని అనేకం రాయ్ వదిలేయవలసివచ్చింది, భావరంగంలో సాహసోపేత యాత్రవంటిదే యిది. ఇందులో మార్గాన్ని సూచించే చిహ్నాలు కూడా లేవు. కమ్యూనిజాన్ని వదిలిన తరువాత నిరాశ చెందిన చాలా మంది మతంలోకి వెళ్ళిపోయారు, ఉదారవాదం లేదా జాతీయ వాదంలోకి వెళ్ళి

పోయాక. రాయ్ ముందు కూడా ఆ మార్గాలే వున్నాయి. వెనక్కు పోయే బదులు రాయ్ ముందుకు పోవాలనుకున్నాడు. కమ్యూనిజానికి మించిపోయి నవ్య మానవవాదాన్ని కనుగొన్నాడు. తనంతట తానైతే రాయ్ ఎప్పుడో దీన్ని సాధించే వాడే. ఇందుకు అవసరమైన సాధన సంపత్తి, అధ్యయనం. ప్రకృతి సామాజిక శాస్త్రాల పరిశీలనలూ, తత్వం అతని వద్ద వున్నాయి. తనతోపాటు అనేక మంది స్నేహితులూ, అభిమానులూ, కార్యకర్తలను వెంటతీసుక పోవలసి వచ్చింది. అందులో చాలా మందిని తీసుకెళ్ల గలిగాడు. కొద్ది మందే వదిలేసారు. సుదీర్ఘ చర్చలూ, ఓర్పుతో వాదనలూ చేయవలసి వచ్చింది. డెహరాడూన్‌లో రెండు వేసవి అధ్యయన శిబిరాలు యిందు కోసరం ఉద్దేశించాడు ఇంకా వ్యక్తిగతంగా ఎందరికో లేఖలు వ్రాసాడు. బహిరంగ సమావేశాలలో మాట్లాడాడు. రాజకీయాలనుంచి విరమించి, డెహ్రాడూన్‌లో స్థిరపడి పూర్తిగా చదవటానికీ, వ్రాయటానికి వినియోగించాలని రాయ్ ఆతురత వహించాడు. కానీ రాజకీయాలు అతన్ని వదలలేదు 1946 లో రాష్ట్ర శాసన సభ ఎన్నికలకు పోటీ చేయాలని రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ నిర్ణయించింది. ఎన్నికల ప్రచారంలో రాయ్ ప్రధాన పాత్ర వహించవలసి వచ్చింది. ఆ సంవత్సరమే అధికార సంక్రమణ గురించి తీవ్రంగా చర్చలు జరిగాయి. ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్నామనే రాజకీయపార్టీలకుగాకప్రజలకు అధికారాన్ని సంక్రమింపజేయాలని రాయ్ ఆత్రుత చూపాడు. ఈ విషయంలో బ్రిటిష ప్రభుత్వానికి నచ్చ చెప్పడంలో రాయ్ విఫలుడయ్యాడు. ఇందుకు తగిన ప్రజా సంస్థను కూడా నిర్మించలేక పోయాడు. 1947 ఆగష్టులో స్వాతంత్ర్యం వచ్చినతరువాత 1946 డిశంబరులో రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ రద్దు చేసిన తరువాత రాజకీయాలనుంచి ఊపిరి పీల్చుకోవటానికి రాయ్‌కు అవకాశం చిక్కింది. అప్పుడు కూడపూర్తిగా రాజకీయాలతో తెగతెంపులు చేసుకోలేదు. తరచూ రాజకీయ సమస్యలుతలెత్తటం, వాటిపై తన అభిప్రాయం చెప్పవలసి రావటంజరిగింది. పార్టీని

రద్దుచేసిన తరువాత నిష్పాక్షికంగా సలహాలు చెప్పే అవకాశం వుంది కనుక అతని కాలాన్ని శక్తినీ అందుకు వినియోగించవలసిన అవసరం ఏర్పడింది. తన పత్రిక రాడికల్ హ్యూమనిస్ట్‌లోనూ అమెరికా, ఇంగ్లండు పత్రికలలోనూ జాతీయ అంతర్జాతీయ సమస్యలపై విస్తారంగా వ్రాసాడు. ఈ వ్యాసాలకు యింటా, బయటా గుర్తింపు వచ్చింది

రాయ్ రాజకీయ ఆలోచనా రంగంలో ప్రత్యేకంగా ప్రస్తావించవలసినవి రెండు విషయాలున్నాయి. పార్టీ రహిత రాజకీయాలకు అతను చాలా ప్రాధాన్యత చూపాడు. అధికారం వశం చేసుకోనిదే ఏమీ చేయజాలమని భావించినందున పార్టీలు అధికార కుమ్ములాటలో నిమగ్నమవుతాయన్నాడు. అధికారాన్ని హస్తగతం చేసుకోవటమే ఏకైక లక్ష్యంగా మారి ఏ మార్గాన్నయినా అనుసరిస్తారన్నాడు. అనుభవం వలనా, రాజకీయంగా వెనుకబడిన చోటా, అజ్ఞానం ప్రబలివున్న చోటా పార్టీ విధానాన్ని దుర్వినియోగ పరుస్తారని తెలుసుకోవచ్చు. ఒకానొక పార్టీకి చెందినంత మాత్రాన ప్రశ్నించదగిన స్వభావం కలవారు కూడా కీలక స్థానాలను ఆక్రమిస్తున్నారు. మేధస్సుకూ, నైతిక ప్రవర్తనకూ ప్రాధాన్యత యివ్వక అధికారాన్ని పట్టుకోగల వారికే పార్టీ గుర్తింపువుంటున్నది. కనుక వ్యక్తుల అధికార తృష్ణను, సంపాయించుకోవాల కోర్కెలు మాత్రమే పార్టీలు తీర్చగలుగుతున్నాయి. [రాడికల్ హ్యూమ నిజమ్, పుట31].

ఈ చర్చ అధికార కేంద్రీకరణ సమస్యకు దారి తీయగా, కొత్త సాంఘిక వ్యవస్థలో దీనిని ఎలా తొలగించగలం, రాజకీయంగానూ ఆర్థికంగానూ ఎలా వికేంద్రీకరించగలం అని రాయ్ సూచించాడు. ముగిస్తూ రాయ్ యిలా వ్రాశాడు: అధికారం హస్తగతం చేసుకోవడమే పార్టీల లక్ష్యమైనంత కాలం, పార్టీలు పోవు, అధికారాన్ని హస్తగతం చేసుకోదలచక పోతే, పార్టీలు లేని రాజకీయాలు ఆచరించవచ్చు. పార్టీలు లేనప్పుడు అధికార దత్తత సమస్య వుండదు. అధికార కేంద్రీకరణకు రాజ్యాంగ పరమైన ఆమోదమూ వుండదు. పొందిక అయిన సమాజం, వ్యక్తి స్వేచ్ఛ నాశనం చేయని స్వేచ్ఛా సంఘం సాధ్యపడుతుంది.

సమాజంలోని స్త్రీలు పురుషులు వ్యక్తులుగా స్వేచ్ఛను, సంక్షేమాన్ని సంపదను అనుభవిస్తారు. [రాడికల్ హ్యూమనిజం,పుట 44].

విప్లవానికి కూడా రాయ్ కొత్త మార్గాన్ని సూచించాడు. 1946లో జరిగిన డెహ్రాడూన్ అధ్యయన శిబిరంలో యీ విషయం చర్చించాడు. నచ్చచెప్పడంతోనూ, ఆమోదంతోనూ విప్లవం అని పేరు పెట్టాడు. ఆధునిక రాజ్యాల విపరీతమైన సైనిక శక్తివలన, లోగడవలె సాయుధ తిరుగుబాట్లతో విప్లవం యిప్పుడు సాధ్యపడదన్నాడు. కనుక కొత్త విప్లవ మార్గం కనుగొనడం అవసరం. నచ్చచెప్పడంలో, విప్లవాన్ని కేవలం కార్మికులేగాక, యావన్మంది ప్రజలు కూడా అభిలషిస్తారు. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని, ప్రజా సంఘాలు నగరాలలోనూ గ్రామాలలోనూ ఏర్పడాలని, ప్రజల హక్కులను సాధించేవిగానూ, వికేంద్రీకరణ సాధనాలుగానూ యివి రూపొందాలని, నవ్య మానవ తత్వానికి ఈ చర్చలలో ప్రాతిపదికలు ఏర్పడ్డాయి. ఈ చర్చలలో రాయ్ చెప్పినదంతా '(న్యూ ఓరియంటేషన్)' శీర్షికన కలకత్తా రినైజాన్స్ ప్రచురణ కర్తలు వెలువరించారు.

నవ్య మానవ తత్వం వలన రాయ్, గాంధీకి అతని ఆలోచనకు సమీపంగా వచ్చాడు. ఇరువురి మధ్య చాలా పోలికలున్నాయి. సాంఘిక ఆలోచనా, ఆచరణలో కేంద్రంగా ఇరువురూ వ్యక్తిని అంగీకరించారు. ఉభయులూ కూడా రాజకీయ ఆర్థిక వికేంద్రీకరణ జరగాలనీ, రాజకీయాలను ప్రక్షాళితం గావించటానికి పార్టీ రహిత ప్రజాస్వామ్యం వుండాలనీ సూచించారు. అయితే యిద్దరి మధ్య మౌలికమైన తేడాలున్నాయి. రాయ్ భౌతికవాదీ, హేతువాదీ. గాంధీ అంతర్వాణిపై ఆధారపడిన ఆధ్యాత్మిక వాది. అంత మాత్రాన లక్ష్యాలలో ఆచరణయుక్తంగా సాధించే నిమిత్తం కలసి పని చేయడానికి ఆటంకమేమీ లేదు. రాడికల్ హ్యూమనిస్టులూ, గాంధీజీ అనుచరులలో సర్వోదయవాదులూ ఉత్తరోత్తరా యిలా కలసి పని చేసారు.

గాంధీజీని గురించి రాయ్ భావాంలో చాలా మార్పు వచ్చింది. గాంధీజీ పట్ల నిశిత విమర్శకుడుగా వున్న రాయ్ స్వాతంత్ర్యం సాధించిన తరువాత అధికారానికి దూరంగా బెంగాల్‌లో మత సమస్య పరిష్కరించటానికి ఒక్కడుగా వెళ్ళడం రాయ్ కెంతో నచ్చింది. గాంధీజీ పెద్ద నైతిక శక్తి అని రాయ్ గుర్తించాడు. గాంధీజీ హత్య పట్ల రాయ్ దిగ్భ్రాంతి చెందాడు. కలకత్తాలో ఒక సమావేశంలో మాట్లాడుతుండగా యీ వార్త అక్కడికి చేరింది. క్లుప్తంగా జోహారులర్పించి వుపన్యాసాన్ని కొనసాగించ లేక సమావేశాన్ని ముగించాడు. తరువాత ఇండిపెండెంటు ఇండియాలో గంధీజీని గురించి గొప్పగా వ్రాస్తూ, ఏ మార్గాన్ని అనుసరించి అయినా లక్ష్యం సాధించాలనే పద్ధతి మంచిది కాదని గాంధీజీచెప్పిన సందేశాన్ని ప్రజలకు గుర్తు చేసాడు.

రాయ్ యీ కాలంలో అనేక పుస్తకాలు వ్రాసి ప్రచురించాడు. ఇందులో ముఖ్యమైనది వివేచనా, ఉద్వేగం, విప్లవం అనే రెండు సంపుటాలు. 1953 ఫిబ్రవరిలో మొదటి సంపుటం ప్రచురితమయింది. రాయ్ మరణానంతరం రెండవ సంపుటం ప్రచురితమయింది. రాయ్ ఆలోచనా సారాంశమంతా ఇందులో వున్నది. నవ్యవాద తత్వానికి సిద్ధాంత ప్రాతిపదిక కూడా యిది కల్పిస్తున్నది. చైనాపై వ్రాసిన ఆంగ్ల గ్రంథం చైనాలో విప్లవం ప్రతి విప్లవం కూడా 1946 లో ప్రచురితమైంది. 1930 లో దీనిని వ్రాసినా అనేక కారణాలచే ప్రచురణ జరగలేదు. విషయాన్ని అధునాతనం చేయడానికి కొన్ని అధ్యాయాలు చేర్చాడు. 1947లో రష్యా విప్లవం అనే గ్రంథం ప్రచురించాడు. యుద్ధ కాలంలో రష్యాపై వ్రాసిన వ్యాసాలే ఇందులో ప్రధానంగా వున్నాయి. యిదే సమయంలో రాయ్ తన జ్ఞాపకాలు కూడా వ్రాసాడు. వీటన్నిటినీ సేకరించి 1964లో పుస్తకంగా ప్రచురించాడు. అనేక రాజకీయ గ్రంథాలు కూడా ప్రచురిత మయ్యాయి.

నవ్యమానవ వాద ఉద్యమ కృషిలోనూ, తన రచనా వ్యాసంగం లోనూ నిర్విరామంగా కృషి చేసిన రాయ్‌కు విశ్రాంతి కావలసి వచ్చింది. 1952 జూన్‌లో

విశ్రాంతి నిమిత్తం ముసోరీ వెళ్ళాడు. అతనితో పాటు ఎలెన్ రాయ్ వున్నది. ఇద్దరూ చాలా దూరం నడిచి వెళుతుండేవారు. జూన్ 11న యథాప్రకారం ఉదయాన్నే నడక సాగించారు. తిరిగి వస్తుండగా రాయ్ జారిపడి దొర్లుకుంటు 50 అడుగుల క్రిందనున్న రాతిపై పడ్డాడు. అతనికి తీవ్రంగా గాయాలుతగిలాయి. కొన్ని వారాలపాటు మంచంలోనే వుండవలసి వచ్చింది. నిపుణుల వైద్య చికిత్స, భార్య మృదు సేవలూ రాయ్‌ని కోలుకునేటట్లు చేసాయి. డెహ్రాడూన్‌కు తిరిగి వచ్చాడు. మళ్ళీ తన పనికి ఉపక్రమించాలను కుంటున్నాడు. కాని మెదడుకు సంబంధించిన దెబ్బ తిరగ బెట్టటం వలనకోలుకున్నదంతా మొదటి కొచ్చింది. సంవత్సరాంతానికి మళ్ళీ కోలుకొని రాడికల్ హ్యూమనిస్ట్‌కు వ్రాయ డమే గాక ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా మొదలెట్టాడు. 1953 మే లో రాయ్ బాగా కోలుకున్నాడు. అమెరికా వెళ్ళి చికిత్స చేయించు కోవాలనీ, మాట్లాడ వలసిందిగా వచ్చిన ఆహ్వానాలను ఆమోదించాలనీ అనుకున్నాడు. ఆగస్టులో మెద డుకు తగిలినదెబ్బ మళ్ళీ తిరగబెట్టింది. అతని అనుచరులూ, సహకార్యకర్తలూ, స్నేహితులూ దేశంలోనూ, విదేశాల్లో కూడా యీ వార్త విని విభ్రాంతి చెందారు. యిరోపా, అమెరికాలోని స్నేహితులు యితని రాక కోసం చూస్తున్నారు. అందులో కొందరుకమ్యూనిస్టు ఉద్యమంలో కలసి పని చేసిన వారే, రాయ్‌ను కలసి తమ అనుభవాలను అతనితో పంచుకొని ప్రపంచ సంఘటనల పట్ల అతని భావాలుతెలుసుకోవాలనీ అనుకున్నారు. కానీ అది జరుగలేదు రోజులుగడిచే కొద్దీ వ్యాధి ముదిరింది రిపబ్లిక్ దినోత్సవం కొంచెం సేపట్లో పారంభమవుతుందనగా 1954, జనవరి 25 రాత్రి రుగ్మత రాయ్‌ని కబళించింది.

రాయ్ మరణానికి దేశంలోనూ, చాలా విదేశాలలోనూ స్నేహితులూ, విమర్శకులు కూడా విచారం వెలిబుచ్చారు సంతాప సందేశాలు 13, మోహినీ రోడ్డుకు విపరీతంగా వచ్చాయి. ఎన్నో సమావేశాలు జరిగాయి. జోహారులర్పిం చారు. రాయ్ పోవడంతో దేశం ప్రజ్ఞాశాలి అయిన మహామనీషిని, స్వేచ్ఛ

కోసం చిత్తశుద్ధితో పోరాడిన వ్యక్తిని పోగొట్టుకున్నది. జీవితంలో తొలిదశలోనే రాయ్ ప్రారంభించిన స్వేచ్ఛాన్వేషణను ఆతని గ్రంథాలతోనూ, అతను వదలి వెళ్లిన అశేష దీక్షా పరులైన కార్యకర్తలతోనూ కొనసాగించవలసి వున్నది.

# కాలానుక్రమణిక

| | |
|---|---|
| 1887 మార్చి | జననం |
| 1906 | విప్లవోద్యమంలో ప్రవేశం |
| 1907 డిసెంబరు | చింగ్రిపోత రైల్వేస్టేషన్ దోపిడీ |
| 1910 ఏప్రిల్ | నేత్రా దోపిడీ |
| 1910 | హౌరా కుట్రకేసులో అరెస్టు |
| 1911 నుంచి 1913 | విప్లవ ముఠాల ఏర్పాటుకై దేశంలో పర్యటన. జతీన్ ముఖర్జి నాయకత్వమున బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూలద్రోసే కుట్రలో పాల్గొనడం |
| 1914 ఆగస్టు | మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం |
| 1915 ఫిబ్రవరి | గార్డెన్ రీచ్ దోపిడీ |
| 1915 ఏప్రిల్ | బటేవియాకు ప్రయాణం |
| 1915 జూన్ | ఆయుధాలు ఏర్పాటుచేశాక భారత దేశానికి ప్రయాణం |
| 1915 ఆగస్టు | ఆయుధాలు తెచ్చే ఓడ రానందున మళ్ళీ బటేవియాకు పయనం |
| 1915 | జతీన్ ముఖర్జీ మరణం |
| 1915 ఆగస్టు నుంచి 1916 జూన్ | ఇండోనేషియా, మలయా, చైనా, జపాన్‌లలో ఆయుధాలకై పర్యటన. |
| 1916 జూన్ | బెర్లిన్ పోవడానికై అమెరికా చేరుట |
| 1916 జూన్ 14 | శాన్‌ఫ్రాన్సిస్కో రాక |

| | |
|---|---|
| 1915 జూన్ | స్టాన్ ఫర్ విశ్వవిద్యాలయంలో మానవేంద్రనాథ్ రాయ్‌గా మారడం |
| 1916 ఆగస్టు | న్యూయార్కు రాక |
| 1917 జూన్ | అమెరికా యుద్ధంలో జోక్యం |
| 1917 జూన్ | న్యూయార్కులో అరెస్టు-హిందూ-జర్మన్ కుట్రకేసులో |
| 1917 జూలై | మెక్సికో పారిపోవుట |
| 1918 డిసెంబరు | మెక్సికో సోషలిస్టుపార్టీ మహాసభ |
| 1919 వసంతం | బరోడిన్‌ను కలియుట |
| 1919 అక్టోబరు | మెక్సికో సోషలిస్టు పార్టీ కమ్యూనిస్టు పార్టీగా మారుట. రష్యా వెలుపల తొలి పార్టీ. |
| 1919 నవంబరు | రెండవ కొమింటర్న్ సమావేశానికై మెక్సికో వదలి వెళ్లుట |
| 1919 డిసెంబరు | బెర్లిన్ చేరుట |
| 1920 ఏప్రిల్ | మాస్కో రాక |
| 1920 మే-జూన్ | లెనిన్‌తో ప్రథమ సమావేశం |
| 1920 జూలై-ఆగస్టు | ద్వితీయ కొమింటర్న్ మహాసభ |
| 1920 ఆగస్టు | తాష్కెంట్‌లో కృషి |
| 1920 అక్టోబరు | భారతగృహం, సైనిక శిక్షణాలయం ఏర్పాటు |
| 1920 అక్టోబరు 17 | తాష్కెంట్‌లో భారత కమ్యూనిస్టు పార్టీ ఏర్పాటు |
| 1921 చివర | ఇండియా ఇన్ ట్రాన్సిషన్ ప్రచురణ -రష్యన్‌లో 1922 లో ఇంగ్లీషు ప్రచురణ |

| | |
|---|---|
| 1922 మే | వాన్‌గార్డ్ ప్రచురణ |
| 1924 | కాన్పూరు కమ్యూనిస్టు కుట్రకేసు |
| 1927 జనవరి–ఆగస్టు | చైనాలో కృషి |
| 1928 ఏప్రిల్ | మాస్కోనుంచి పరారి |
| 1928 సెప్టెంబరు | ఆరవ కొమింటర్న్ కాంగ్రెస్ |
| 1929 మార్చి | మీరట్ కమ్యూనిస్ట్ కుట్రకేసు |
| 1929 డిసెంబరు | కొమింటర్న్ నుంచి బహిష్కరణ |
| 1930 డిసెంబరు | రహస్యంగా భారతదేశం రాక |
| 1931 మార్చి | కరాచీలో భారత జాతీయకాంగ్రెసుకు హాజరు. |
| 1931 జూలై | ఏడుమాసాల రహస్య కార్యకలాపాల అనంతరం బొంబాయిలో అరెస్టు |
| 1931 ఆగస్టు–డిశంబరు | కాన్పూరు విచారణ |
| 1932 జనవరి | 12 ఏళ్ళ శిక్ష-విజ్ఞప్తిపై ఆరేళ్ళకు తగ్గింపు. |
| 1933 జనవరి | హిట్లర్ అధికారానికి రాక |
| 1936 నవంబరు | డెహ్రాడూన్ జైలు నుంచి విడుదల |
| 1936 డిసెంబరు | ఫైజ్‌పూర్ కాంగ్రెసు మహాసభలో పాల్గొనుట |
| 1937 ఏప్రిల్ | ఇండిపెండెంట్ ఇండియా ప్రచురణ |
| 2938 జూన్ | లీగ్ ఆఫ్ రాడికల్ కాంగ్రెస్ ఏర్పాటు |
| 1939 సెప్టెంబరు | రెండవ ప్రపంచయుద్ధం మొదలు |
| 1940 అక్టోబరు | యుద్ధ సమస్యపై కాంగ్రెసుకు రాజీనామా |
| 1940 డిసెంబరు | రాడికల్ డెమొక్రటిక్ పార్టీ ఏర్పాటు |
| 1944 ఏప్రిల్ | 'ప్రజా ప్రణాళిక' ప్రచురణ |

| | |
|---|---|
| 1945 | భారత రాజ్యాంగం ముసాయిదా |
| 1948 డిసెంబరు | నాలుగవ మహాసభలో రాడికల్ డెమొక్రటిక్ పార్టీ రద్దు |
| 1952 జూలై | ముస్సోరీలో ప్రమాదం-దీర్ఘ వ్యాధి |
| 1954 జనవరి | డెహ్రాడూన్‌లో మరణం. |